# ప్రేమ లేఖలు



(రెండవ భాగము)

రచయిత

శ్రీ గుడిపాటి వెంకటచలంగారు, బి. ఏ., యల్. టి.

ప్రకాశకులు

అభిసారికా గ్రంథమాల,

మచిలీపట్నం.

# నీకు — నాకు.

నిద్రకైనా విరామమెరగని ఈ హృదయయాత్ర నీకోసమని మరవలేను.

ఎంత నీనించి దూరంకావాలని ప్రయత్నించినా ఏదోవిధాన, ఏదోరూపాన, నా దృష్టిని మరల్చుకుంటున్నావు.

నీవు రావు. నన్ను పోనీవు.

మరల్చి, మత్తెక్కించి, స్వప్నాలతో లాలించి, మధురగానాలలో ఊగించి, ప్రపంచానికి వ్యర్థుణ్ణి చేశావు.

దిగులు కళ్లతో, వెర్రి చూపులతో, మరుపు మాటలతో, అన్ని విశ్వాసాలు నశించి తోవతెలీక తిరుగుతున్నాడు ఈ ప్రేమవైరాగి.

అనాదిగా విన్న నీపిలుపు, స్వప్నంలో అనుభవించిన నీ కుంతలాల కొనల స్పర్శ, ఏయుగాల అవతలి తీరానో సంయోగమనే వాగ్దానం, ఇంతే నాకు మిగిలిన ఆశలు.

నాకు వెర్రి.

ప్రియా,

నాకు సుఖంలేదు, శాంతిలేదు. ఆనందంలేదు. నువ్వు లేనే లేవేమో, అంతంలేని ఇంతకాలమూ, నన్ను నేనే వెతుక్కుంటున్నానేమో అని భయమేస్తోంది.

నీకోసం వెతికి వెతికి అలిసి, నా చూపులు తమలోకి తామే చూసుకుంటున్నాయి.

ప్రియా అని హృదయం తనని తానే గొణుక్కుంటోంది.

ఎండమావుల సౌందర్యానికై తపించి, వాడిలి, ఎండి లయమయ్యే ఈనిర్భాగ్యుణ్ణిచూసి దిక్కులే నవ్వాయి, చుక్కలే ఏడ్చాయి.

యోగులు హృదయాలలో వెలిగించుకునే కాంతి నీచిరునవ్వు.

నాకెట్లా దొరుకుతుంది?
లోకాన్ని వెతికి నాకు?

చెలం, 1941.

*What care I for the world's desire and pride*

*For my glad heart is drunk and drenched with Thee,*

*O inmost wine of living ecstasy.*

# ముందు ఈవిధముగా దిద్దుకోండి.

| పేజీ. | లైను. | |
|---|---|---|
| 146 | 12 | Moral evolution |
| 152 | 22 | రానా? రావాలని వుంటే |
| 187 | 12 | ఆదివారం — నిన్నే తలుచుకుంటో |
| 193 | 1 | On the wing? |
| 202 | 6 | నేను కి—న్ని కామించి |
| 203 | 4 | కథా, కంఠమూ |
| 212 | 13 | ఆర్టిస్టులతోటి స్నేహం |
| 215 | 8 | man గా నామనసులో |
| 218 | 1 | ఇంద్రలోకపు విమానంకింద మారి |
| ,, | 18 | యాడవనా చదువులు |
| 219 | 17 | నాయిల్లు వాళ్ళకి వొదిలి |
| ,, | 18 | నివాసం ఏర్పరచుకున్నాను |
| 224 | 10 | అనలేదు నేనామాట. నమ్మదు |
| ,, | 20 | నడుస్తోంది. ఆ ప్రియుడు వొస్తానని |
| 226 | 3 | చూడాలనుకుంటే చూడగలరు. |
| 227 | 25 | గడిపేవాణ్ణి - కాదు - అబద్ధం |
| 228 | 28 | వాళ్లందర్నీ బాగా ఎరుగుదును |
| 229 | 3 | తిండీ, బట్టా, ఇల్లూ, వుంటేచాలు. |
| 236 | 19 | ఉత్తరం రాలేదేమా |
| ,, | 22 | నువ్వు వ్రాయవు. |
| ,, | 24 | నా ప్రేమ నిన్ను కాపాట్టంలేదా? |

| | | |
|---|---|---|
| 238 | 16 | నన్నెందుకు తనని మరచిపోనీదు? |
| 247 | 5 | ఎందుకంటేలోకం. తనమీద |
| 249 | 11 | వెళ్ళక ఆగిన నావంక |
| 250 | 3 | Frued వేదాంతంలో |
| ,, | 7 | మనిషిమీదికి వెళ్ళక |
| 255 | 7 | తూర్పు నీ మొహాన్ని |
| 262 | 18 | మన ప్రేమదేవత |
| ,, | 24 | instinctive గా |
| 264 | 6 | అగాధంలోకి జారినట్లు |
| ,, | 20 | వెతికే మనుషుల్ని |
| 269 | 23 | sap of life |

---

పొద్దున్నే తొందరతొందరగా పనులు ముగించుకుని స్టేషన్ కి వెళ్ళాను. రైలు. ఆడవాళ్ల పెట్టె. వాళ్ళకెదురుగా అట్లానే నిలబడ్డాను. కదలను. కళ్ళని నమ్మలేను. ఇంకా యెట్లాగో యెక్కిణ్ణించో నవ్వుతో నువ్వు కనపడతావనే నా వెర్రి ఆశ. ఎట్లా ఐనాను ఆ నిమిషాన! నన్ను, రైలుని, జనాన్ని, ప్రపంచాన్ని అంతా మరిచాను. నువ్వు రాలేదనే పెద్దబాధ వొక్కటే. నేనే ఆ బాధ.

నువ్వు తప్పకుండా రావాలని నేను అనను. నీకు రావలసిన అవసరం కనపడకపోతే, నాకోసం నువ్వు రావాలి అని నేననను. భిక్షమడగడం, ప్రేమకోసమైనాసరే, చివరికి నీముందైనాసరే, నాకు యిష్టంవుండదు.

మననిట్లా ఏదోవొకవిధాన, మన అభిమానాలవల్లనైతేనేం, పరిస్థితులవల్లనైతేనేం, ఇట్లా మననిద్దరినీ దూరానవుంచే శక్తియేది? దయామయుడైన యీశ్వరుడా, జీవంలేని కర్మా? ఆత్మగౌరవంగల మన స్వభావాలేనా?

నాకు యీబడిబ్రతుకు దుర్భరంగా వుంది. దిగులుతో మూలుగుతాను. చిన్నప్పుడు పక్కమీద, ఉదయాన కళ్లుతెరిచి, కిటికీలోనించి నీలపు ఆకాశాన్నీ, యింటిముందు తోటలో పువ్వులన్నీ, ఆకుల మీదియెండనీ చూడగానే మొదట పెద్దసంతోషం వొచ్చేది. వెంటనే బడి జ్ఞాపకంవొచ్చి ఎందుకు నిద్రలేచానా, యెందుకీ జన్మయెత్తానా యీ అందాన్నంతా వొదిలి, ఆ బడిగోడలమధ్యని, ఆ ధుమధుమలాడే మేస్టరు మొహాని కెదురుగుండా, కూచోడానికి వెళ్లవలసిందేకదా అని దిగులుతో మళ్లీకళ్లు మూసుకునేవి. ఆబడితలపు యీవిశ్వసౌందర్యాన్నే మింగేది. ఎప్పుడీ బడి తప్పిపోతుందా అని కలలుకనే నాకు యీజన్మానికే పెనవేసుకుంది ఆబడి యేదో ఒక విధాన. ఈ నాటికీ ఆదిగులు ఒక్క కొంచెంకూడా తగ్గలేదు. ఈవిద్యాలయాల్ని యెట్లా

భరిస్తోందో యీలోకం! ఇంతఘోరమైనబాధ, యెరిగినవారికే తప్ప, స్త్రీస్త్రే, పేపర్లల్లో, మీటింగులలో, ఎంతో ఆందోళన జరిగేవి. తమ బాధని తామే యెరగని, యీపిల్లలుగనక, విద్యఅనీ, జ్ఞానమనీ, అభివృద్ధిఅనీ గొప్పపేర్లుచెప్పి మోసగించి, యిట్లా మారకశాలయాల్లో, ఆత్మల్ని, నీతిని, శరీరాల్ని, చీల్చి చితకకొడుతున్నారు. నాచేత చితకకొట్టిస్తున్నారు, నన్ను చీల్చుకుతింటున్నారు. ఎప్పటికన్నా నాకు విముక్తికలుగుతుందా! నువ్వుతప్ప యింక నాకు యీ బాధని తుడిచివెయ్యగల సంతోషంవుందా? కాని, నేను తప్పించుకుంటే మాత్రం, యీనోరులేని పిల్లలందరూ, యీ యీశ్వరసంతానం క్రమంగా పీనుగలై పోతూవుంటారే! పిల్లల్ని నమిలితినే రాక్షసులకింద ఈ టీచర్లని తర్ఫీదుచేసి పంపే ప్రయత్నంలో నియమింపబడ్డ నేను మాత్రం ఈ బాధనించి తప్పించుకోడానికి యెందుకు ప్రయత్నం చెయ్యాలి? నేనన్నావుంటే నాసానుభూతివల్ల, చిరునవ్వులవల్ల, తిరగబాట్లవల్ల, వాళ్ళకి ఆబాధలో కొంచెం శాంతినిస్తున్నానేమోనని ఆశ. అదిగాక ఇది మానుకుని ఇంకేపనిచెయ్యను, చెయ్యగలను? ఏమీచెయ్యకుండా సోమరినై ఎట్లాబతకగలను? parasite నై ఎవరికీ ఏమీ ఉపయోగపడకుండా తిని తిరుగుతూవుంటే నామీద నా అసహ్యాన్ని భరించలేను.

నీ కిట్లా వ్రాస్తూవుండగా, నువ్వు నాయెదురుగా, నాభుజం మీద చెయ్యేసినట్టే పులకిపడ్డాను. కలం వేళ్ళలో పట్టువొదిలి కిందపడ్డది. ఆశతో వెర్రిగా చుట్టూ చూశాను. ఏమీ తోచదు. నిరాశతో, ఇంత పిచ్చితో యెట్లాబతకను?

ఈవుత్తరం జానకిరాం Letter paper మీద వ్రాశాను. నేను చూడలేను. వెనక పేజీమీద అతను యేదివ్రాసిపెట్టుకున్నాడో. చూడు. సరిగా నా Mood కి సరిపోయింది.

Mother, sister, ideal woman in one, have I found-a Beautiful Beam of God, Light striving to dispel the cruel obstinate Dark.

ఓ! ర_మళ్లీ నాసంగతి మాట్లాడుతోందా! అదేపనిగా ఎందుకు పొగుడు తుందంటావు? పాతసంగతులన్నీ యెందుకు సంతోషంతో స్మరిస్తుందంటావు? అదంతా నామీద ప్రేమ అనుకోకు. గొప్ప ప్రేమచరిత్ర ఒకసారి ముగిసింతరవాత మళ్లీ యింకోసారి వెలగదు.

Never try to rekindle a cigar or a woman's heart.

అన్నాడు ఒకాయన.

మళ్లీ నేనుగాని, నా సహాయంగాని ఆమెకి అవసరమై వుండ వొచ్చు. అదిగాక నామాటలు మాట్లాడితే నీసానుభూతిని సులభంగా పొందవచ్చునని ఆశ. మనుషుల్ని పరిశీలించగా యేంతోస్తుందంటే... ఇంత మంచివాళ్లు యిట్లాప్రవర్తిస్తారేమా అని ఆలోచిస్తే ఏమను కుంటానంటే...కావలసి తమపనులు నేరవేర్చుకోడానికి చెయ్యరు, కాని వాళ్ళ Sub-conscious mind వాళ్లని ప్రోత్సహిస్తుంది వాళ్లకే తెలీకుండా. వాళ్లని Time-serving అని మనం నిందిస్తే, వాళ్లు ఆశ్చర్యపడతారు. ఎందుకంటే వాళ్లకార్యాల్లోని క్షుద్రత్వం తెలుసు కునే స్థితికి రాలేదు వాళ్లు. గొప్పపాపాలు, హత్యలు, దొంగతనాలు వ్యభిచారం, యిట్లాంటివి గుర్తుపట్టగలరు. శాస్త్రాలు ఖండించిన కార్యాలు వాళ్లూ ఖండిస్తారు. కాని స్వార్థపరత్వం, చిన్నమాటల వల్ల, పనులవల్ల యితరుల్ని వంచించడం, సగం అబద్ధాలు, కపటం, యిటువంటివీ లోపాలుగా గుర్తించగల నైతికాభివృద్ధి రాలేదు ప్రజలకి. నా 'హరిశ్చంద్ర' చాలా మందికి చాలా విపరీతమైన నాటకంగా తోస్తుంది. చాలామందికి, 'సత్యం' అంటే అంతా తమకి తెలుసున నే వుద్దేశ్యం. సత్యంకింద చలామణి అయ్యే అబద్ధాలను గుర్తించలేరు, గొప్ప గొప్ప రచయితల మనుకునేవాళ్లే. తన దైనిక నైతికానందం కోసం ప్రజలమీదా, ప్రజాసామాన్యంమీదా, పాతగ్రంథాలమీదా ఆధారపడతారు. ఆధారపడి అనీతులన్నీ తమ అంతరాత్మలూ, యీశ్వ రుడూ ప్రబోధించినవని మోసపుచ్చుకుంటారు, మోసగిస్తారు. . .

వీళ్ళు follow అయ్యే నీతి ఆచారాల్ని ఖండిస్తే, వాటికి వ్యతిరిక్తంగా నడుచుకొంటున్నట్టు కనపడితే, ఏనియమమూ లేకుండా వర్తిస్తున్నట్టు తోస్తుంది.

అమ్మణ్ణి మొగుడు "ఇంక నీ చిత్తవృత్తి యెట్లా యాడిస్తే అట్లా తిరగడమేనా?" అన్నాడు.

కాని యెవడైనాసరే, తన చిత్తవృత్తిప్రకారం తప్ప యింకో విధంగా నడుచుకోడం అసంభవమని తెలీదు, పాపం.

అతని వుద్దేశ్యం, నేను నా చుట్టుపక్కల ప్రజల చిత్తవృత్తిని అనుసరించి తిరగాలని. దానినే అంతరాత్మ అంటారు. ఎందుకంటే అదే సులభం, అదే మర్యాద. ఇట్లాంటివాళ్లు 'నీతి'కి ఇంకా కళ్లు తెరవలేదు. 'నీతి' అంటే ఏమిటి? ఏది నీతి? అనే సమస్య పుడితే గాని moral evolution వుండదు. ఇంకా పశువులువున్న stage లోనే వుంటారు చాలామంది. వాటిమల్లేనే యేయోచనా లేకుండా పరిస్థితులకి తలవొంచి నడుస్తారు. మర్యాదా, డబ్బూ. ఈ రెండే వాళ్ల దేవుడూ అంతరాత్మా. ఏది నీతి? అని ప్రశ్నించినవాళ్లకి నీతిబోధనలు చేసేది వీళ్లే.

నువ్వు వెళ్ళిన మర్నాడు Mrs Lodgers వొచ్చి "ఆమె వెళ్లిపోయిందా! నాకు మీయింటినించి నవ్వులు వినపట్టంలేదు" అంది.

నాకు జబాబు చెప్పలేనంత కంఠం పట్టుకుంది. ఈవూరినించే లోకంనించే సంతోషాన్నీ, నవ్వులనీ నువ్వు తీసుకుపోయినావని ఆమెతో యెట్లా చెప్పను?

నేను వొక్కణ్ణీ యీరాత్రి ఆస్పత్రి వరండాలో కూచుని నీకు వ్రాస్తున్నాను. ర...వొళ్లు తెలీక జబ్బుతో గదిలో పక్కమీద పడివున్నాడు. నా వొంటరితనాన్ని, బాధని, ఏమాత్రమూ నీకు తెలీనీకుండా వ్రాయాలని ప్రయత్నించాను. ఇంక నాచాతకావటం లేదు. నీకు వ్రాస్తే, నీతో చెప్పుకున్నట్టే, కొంత మనశ్శాంతి కలుగు

తుంది. అందువల్ల స్వార్థపరుణ్ణయి నాబాధ నీకు పంచుతున్నాను. ఆ పక్క మీద అతన్ని తలుచుకున్నంత మాత్రాన నాకు భరించరాని దిగులు కలుగుతుంది. అతను తన talents ని, Genius ని, జీనినీ వ్యక్తపరుచుకునే opportunity లేకుండా, మృత్యువుతో పోట్లాడే బాధతో యిటూ అటూ కొట్టుకుంటూవుంటే, అతన్ని ప్రేమించే నాకు, విశ్రాంతీ, సుఖమూ కావాలని అడగడానికి ఏమి అధికారం వుంది? ర...యేకాదు. ఏ స్వల్పజీవమైనా యీలోకంలో బాధపడు తున్నన్నాళ్లు సుఖించడానికి యింక యేజీవికీ హక్కు లేదనిపిస్తుంది నాకు. నేనేమీ సహాయం చెయ్యలేను అతనికి. నా హృదయబాధని, అతని శరీరబాధకి శృతికలిపి కాలిపోయి నా ప్రేమని సమర్థించు కోడంతప్ప.

బైట—అర్థచంద్రుడు చెరువుగట్టుమీద చెట్లకొమ్మల్లో ఆడుకుం టున్నాడు. ఒకవేపు బ్రహ్మాండమైన చెరువు. రెండోవేపు గుడి. నిశ్చలంగా వెలిగే నక్షత్రాలు. నా చుట్టూ అంతా నిశ్శబ్దం. ఈ గంభీరత్వాన్ని చూసినప్పుడు నాజీవనం, నాబాధ, నాప్రేమ అంతా అల్పమనిపిస్తుంది. దృష్టి ఆ మంచంవేపు తిప్పగానే నేనూ, నాబాధా తప్ప ప్రపంచమే లేదనిపిస్తుంది. 'నేను నేను' అంతా నేననే యీ అహంకారమే వాస్తవమా, నేనేమీకాదు, యీ మహాప్రపంచంలో ఒక్క అణువుని, ఒక నిమిషాన్ని, ఒక్క హృదయఘాతాన్ని అనే అల్పభావమే నిజమా? రెంటికీ సమన్వయం యెక్కడోవుందా?

అప్పుడప్పుడు నవ్వే బాలికల్నీ, కొమ్మలమీద పిట్టల్నీ, శాంత మైన ముఖాన్నీ చూసినప్పుడు, చప్పున లోకంలోని ఆనందం మన సుకి తట్టి, యెట్లాగో యీ దుస్స్వప్నంలోంచి, నైట్ మేర్ నించి బైట పడి, ఒక అంగతో సుఖజీవనానికి, దాటగలననే ఆశకలుగుతూ వుం టుంది. అందర్నీ, అన్నిటినీవొదిలి, ఏకాకినైనవాణ్ణి. హృదయంలో అణుచుకోలేని సౌందర్యతృష్ణనూ romance కోసమూ, సంతోషం కోసమూ వెతికే వాంఛని పదేపదే లోపల్నే అణుచుకుని, నోరెత్తక దైనికకర్మలకు లోబడిబతికేవాణ్ణి.

ఈ నిద్రిపొయ్యే కొంగల్నీ, సుఖంగా యేవిచారమూలేకుండా ఏనాటకం పాటో ఆనందిస్తున్న ప్రజలనూ, తలుచుకున్నప్పుడల్లా, నాకూ ఎన్నటికైనా విశ్రాంతి, యీ ఆరాటాన్ని మరవగల ఆనందం దొరుకుతుందా? ర...కి ఎన్నటికైనా తన Genius ని సార్థక పరుచుకోగల ఆరోగ్యం దొరుకుతుందా? ఈబాధకంతా అర్థంవుందా? ఇది పాపమా, లేక గ్రుడ్డి ప్రభుత్వమా, కర్మా లేక దయా? అనిరాత్రులకు రాత్రులిట్లా విచారిస్తో కూచుంటాను. ఏదో విశ్వాసం, ఏదోఆశ, యేదో విరామం దొరకకూడదా, నిరంతరమూ తపనపడే యీమనసు?

నిశ్చయమయింది. ఇదివరకంతా సందేహించాను గాని, ఈ రాత్రి నిశ్చయంగా తెలుస్తోంది నాకు దేవుడు వున్నాడని. దేవుడే లేకపోతే యీలోకంలో విచారమూ, బాధా, అన్యాయమూ, క్రూరత్వమూ, వికృతమూ వుండవు. బ్రహ్మసమాజంవాళ్లు అనేమాట నిజమే. మనం తర్ఫీదుకోసమే వొచ్చాము యీ లోకంలోకి. పరలోకంలో వున్న నరకం అనుభవించడానికి యిక్కడ యీ బాధలతో తయారు చేస్తున్నాడు. ఇప్పటికి అర్థమయింది యీలోకపు రహస్యం.

---

నిన్ను చేతులారా రైలులో దిగబెట్టి వొక్కణ్ణీ యింటికి తిరిగివొచ్చాను. బైటంతా చీకటి, హృదయంలో చీకటి. వూళ్ళో దూరంగా అక్కడక్కడ దీపాలు వెలుగుతున్నాయి. ఆకాశాన నక్షత్రాలు మిణుకు మిణుకుమంటాయి. నా హృదయాన్ని వెలిగించ గల వొక్క తేజన్నూ ఆకాశంకన్నా దూరమైపోయింది. అసలు కనపడదు.

ఈవాళంతా యెక్కడ చీరచెరుగు కనిపించినా, ఆడవాళ్ళ మృదుపాదాలు శబ్దమైనా, నువ్వేనని వులికిపడుతున్నాను. నువ్వు వెళ్ళిపోయినావు. వెళ్ళిపోయినావని, ప్రతినిమిషమూ నాతో అంటోంది హృదయం. మరిచిపోదామంటే, పూరుకోక బాధిస్తోంది. నెడుతో వుంటే, యేంచేస్తున్నావని నన్ను దూషించి మారాం పడు తోంది. బజారునించి మల్లెపూలు తెచ్చి, నీకోసం నెతికాను. నవ్వుతో నాచేతుల్లోంచి గొప్ప వరాలు తీసుకున్నట్టు తీసుకుని, చక్కగా చేతులు వెనక్కివొంచి తలలో పెట్టుకుంటోవుంటే నిన్ను చూసే భాగ్యం లేదుకదా!

ఇప్పుడు రాత్రి రెండుగంటలు. నువ్వు నా పక్కన లేనప్పుడు ప్రతిరాత్రీ నాకు యిట్లా మెళుకువ వొస్తుంది. అట్లాంటప్పుడు నా జీవిత వ్యర్థత్వమూ, నాప్రయత్నఫల శూన్యత్వమూ నన్నుభయంక రంగా చుట్టుకుని కుంగతీసి బాధపెడతాయి. నేను వ్యర్థంగా, ప్రేమ హీనంగా గడుపుతున్న కాలమంతా, నాముందు పెనుభూతంవలె నుంచుని నన్ను బెదిరిస్తుంది. నా ఆశలూ, నాకోర్కెలూ, నా కలలూ, వాటి వ్యర్థత్వమూ నన్ను నెక్కిరించి వెక్కిరించి, పిలిపి పిప్పిచేస్తాయి. ఏకదలించే వున్నతమైన ఆశలూ లేకండా సామాన్య మానవుడిగా పుట్టడం గొప్ప అదృష్టమనుకుంటాను. జీవితానికీ, శక్తులకీ, రుచులకీ సామరస్యం కుదుర్చుకోవాలని, నూర్కాలుమాస్తున్నా. మత

బోధకులూ అంటారుగాని, అట్లాంటి స్వభావంతో పుట్టనివారికి కుదరదు. ఏ ప్రయత్నంవల్లగాని, శిక్షణవల్లగాని, నిగ్రహంవల్లగాని, నా తీవ్రవాంఛల్నీ, నా వెర్రికలల్నీ నేను జయించి, సుఖపడగలనా?

'నేను' అనేది అంతా, నా అహం. నాజీవమే అది. ఈ కలలతోనే, యీ అగ్నితోనే, యీ వ్యర్థప్రయత్నాలతో, యీ ప్రేమలతో, సృష్టివి పెనవేసుకుని పుట్టాను. వాటిని నశింపచేస్తే 'నేను' అనేది నశించినట్టే! తనలో artistic వాంఛలూ, ప్రయత్నాలూ వుండి, వాటిని సార్థక పరుచుకునేందుకు వీలు దొరకనివాడికన్న నిర్భాగ్యుడు వుండడు. వాడు గొప్పవాడే కానీ, బతికినప్పుడో, చచ్చినప్పుడో, తరవాతో, లోకమే అతన్ని గొప్పగా పూజించనీ, అంతరంలో, వాస్తవంలో, అతను నిర్భాగ్యుడే. అతని artistic ఆశయాలు వున్నతాలైనకొద్దీ, కలలు యెక్కువవుతాయి. నిరాశా, బాధా, వేదనా అనంతం. ఈ జీవితంలో సుఖంగా బతుకుతో, ఉన్నత పీఠాల్ని అలంకరించే మనుషులకు, artistic లోకంలో, విలవతక్కువ.

నిజమైన artistకి లోకంలో విలవ తక్కువ. ప్రజలూ, జీవితమూ, దరిద్రమూ, అపనిందలూ, సఫలంకాని ఆశయాలూ, అశాంతీ ఇన్నిబాధలూపడ్డా, జీవితం ఈ నష్టాలనన్నిటినీ పరిహారం చెయ్యగల, compensate చెయ్యగల యీ కష్టాలన్నీ ఏమిలెఖ్ఖ! అనిపించే ఏగొప్పవరాన్నో ఇస్తుంది విధి—తమ కళాధిక్యతచేత జీవితాన్నించి బలవంతాన లాక్కుంటారు. ఇతరుల మానసా గోచరమైనది, ఎన్ని జన్మలకీ అందుకోలేనిదీ, ఐనగొప్ప ఆనందాన్ని, నాకే యీ artistic heart లేకపోతే నీ ప్రేమకి ఎట్లా అర్హతకలిగేది నాకు! నీ ప్రేమ తటస్థించినా, దాన్ని అంగీకరించే శక్తి, మనం కలుసుకునే స్వర్గాన్ని విడిపోయిన నరకాన్ని, ఇంత సుందరానుభవాలుగా మార్చుకోగల కాంతి, ఎట్లాకలిగేవినాకు?

నువ్వే నాపక్కన యిక్కడవుంటే, యీ అర్థరాత్రి నిన్ను లేపి కూచోపెట్టి నిద్రిలోతూగే నీకళ్లని ముద్దులతో మేల్కొలు

పుతో, యీ సంగతులన్నీ నీతో చెపుదునుకద! కాని నువ్వేవుంటే, యిట్లాంటిదిగులు, ఆలోచనలు, రానేరావుగా! అసలు మెళుకువే రాదు!

నా చుట్టూ అందరూ సుఖంగా నిద్రపోతున్నారు. వొంటరిని, నిరంతరమూ విరహవ్యధతో కుంగే నిరాధారిని, నేను వొక్కణ్ణీ, యీ గుడ్డిదీపంముందు, తలవొంచుకుని గంటలకొలది యీ అర్ధరాత్రి నిశ్శబ్దంలో కూచుని, నీకు వ్రాస్తున్నాను. నాఆశాదేవతకి, నీముందు నివేదించుకుంటున్నాను, నాబాధని.

ఇట్లారాత్రులు నిన్నుతలుచుకుని నీకోసం శూన్యంవేపు చేతులు జాచి జాచి, నా దుఃఖానిక్కై, నా మనోవేదనక్కై యేడ్చి యేడ్చి, గతిలేక, యెక్కిళ్లను లోపలే కుక్కుకుని పడుకుంటాను ప్రతిరాత్రీ.

నాదిగులుకితోడు వారంనించి యీవాన! ఈవాననిచూస్తే నాకెంత కోపమని! నువ్వూ నేనూ కలిసివుండగలిగినదీ, వాన అనేదాన్ని యెరగనిదీ, దేశంలేదా యీలోకంలో! సహారా!!! పోదామా, అక్కడికి నడిచి! కాని, నువ్వేవుంటే యీవాన నెవడు లక్ష్యం చేస్తాడు!

శుక్రవారంనించి ఈమూడురోజులూ యీయింట్లో వొంటరిగా కూచున్నాను. చదవడం, సిగరెట్లు కాల్చడం, నిద్రపోవడం. బైటికి వెళ్లాలనిపించదు. లోకానికీ, ప్రజలకీ, నాకూ యేమీ సంబంధంలేదు.

నీ 'బాడీసులు' చిరిగిపోయినాయనీ, దానికి నేను కారణమనీ, వ్రాశావు. నేనేదో 'పర్టిక్యులర్'గా 'రూడ్' అనుకున్నావా! నేనిప్పుడొక కథ చదువుతున్నాను. దాంటో-

"ఇంకోసారి 'బెరా'ని అతనిచేతులమధ్య కావిలించుకుని దగ్గిరికి లాక్కున్నాడు- భయంతో అతనికి 'యీల్డు' అవుతోంది. ఆమె జుట్టుజారింది- ఆమె డ్రెస్ పగిలింది- ఆమె చెంపలు అతని ముఖానికి తగిలి భగ్గుమన్నాయి" అని వుంది- చూశావామరి! ఆవ్రాసిన అతనికి

కూడా తెలుసు బాడీసులు చిరగడం ప్రేమలో మామూలని- నాది కాదు తప్పు- అంత ఆకర్షకం కావడం, నీవక్షం అంత సుందరంగా వున్నతం కావడం, నీశరీరం అంతనున్నగా మెరుగుగా వుండడం, నీ దేతప్పు.

నేను, నిన్ను వొదలలేక, అంతగోలపెట్టి యేడుస్తోవున్నా, నన్ను వొదిలిపెట్టి వెళ్ళావుకదా! అవును- నాప్రేమతీవ్రతవల్ల నిన్ను ఆపాలిగాని, కన్నీళ్లతో నిన్ను ఆప ప్రయత్నించడం నాది తప్పు అనీ, ఆగినట్లయితే నీది తప్పు అనీ, వోదార్చుకుని వూరుకున్నాను- సమస్తమూ, ధర్మమూ, దైవమూ, ప్రేమముందు అర్పించాలని అంటాను, వ్రాస్తాను, కాని అట్లా అర్పించాలా? ప్రేమకోసంకూడా త్యాగం చెయ్యకూడనివీ, ప్రేమకన్న అధికమైనవీ లేవా అని నాకు సందేహం కలుగుతోనే వుంటుంది. డ్యూటీ, ధర్మం, ఆరోగ్యం, ఆత్మవికాసం, యిట్లాంటివి పోగొట్టుకున్న మనిషి, వున్నతమైన ప్రేమకి అర్హుడుకాడు- మొత్తానికి కన్నీళ్ళకిమాత్రం ఏమాత్రమూ లోబడకూడదు ప్రేమ.

ప్రేమలో జాలి అనేది ప్రవేశించనే కూడదు. నువ్వు చూపిన కఠినత్వానికి కృతజ్ఞుణ్ణి. నీ ధైర్యంతో, పట్టుదలతో, స్వేచ్ఛాశక్తితో, నన్నూ, నా అల్పవాంఛల్నీ; నా mean prayers'నీ తోసిపుచ్చి, నిరాకరించి, మన ప్రేమని ఉన్నతమైన ప్లేన్‌లో నిలుపుతున్నావు గాని, నా విపరీత వ్యసనాలకీ, నా వెర్రి కన్నీళ్లకీ, లోబడ్డావా? మనిద్దరి జీవితమూ, ముక్కలైపాలుకాదా!

కాని, తీరా వెళ్లి, నువ్వు "రాన్నా? రావాలని వుంటే, 'టెలిగ్రాం' యియ్యి" అని వ్రాశావు. ఎంతక్రూరం? "మళ్ళీరావాలని వుంటేనా?" అడగాలా! ఎట్లావుంటుందో, నేను ఏమంటానో, నీకే తెలీదా? నిద్రలోకాని, కలలోకాని, నాదేహంలో వూపిరివున్నన్నాళ్లు, ఏమంటానో తెలిసికూడా, ఆ ప్రశ్న వేస్తావా నన్ను! నన్ను నువ్విట్లా సందేహించి ప్రశ్నించినందుకే, నేను టెలిగ్రాం యివ్వక

యీ వుత్తరం వ్రాస్తున్నాను. మళ్ళీ దిగులువేస్తుంది. ఇట్లా బింకం పోక, నేనే టెలిగ్రాం యిచ్చేవుంటే, నువ్వు యీపాటికి నా పక్కన కూచుని, చూస్తో, నన్ను-కాని అసలు యీ వుత్తరం వ్రాయ వలసిన అవసరం యేమివుండేది!

పోనీ యిప్పుడన్నా నేను టెలిగ్రాం యివ్వకూడదా? ఇవ్వను. నాకు self-respect వుంది. కాని, యిచ్చివుంటే, నా భుజంమీద నీముఖాన్ని ఆనించి, నేనేం వ్రాస్తున్నానో- మళ్ళీ మరిచిపోతాను. యీ వుత్తరం యెందుకు వ్రాస్తాను, అప్పుడు?

“నేను రావాలనివుంటే” ఆమాట ఎంత బాధ పెడుతోంది నన్ను!

నిన్ను రప్పించుకునే ఆనందాన్నికూడా దూరంగా తరమగలిగిన బలంతో బాధపెడుతోంది.

“నీకు బతకాలనివుంటే, గంధర్వలోకం చూడాలనివుంటే, యీ ప్రపంచ సౌభాగ్యమంతా నీదికావాలనివుంటే, ఆత్మవికాసాన్ని పొందాలనివుంటే—” ఇవన్నీ ప్రశ్నించాలా? నీవు కావాలా? జన్మజన్మలకి, నా నరాలు, నా రక్తంలోని అణువులు, నా మెదడులోని ప్రతి ‘సెల్’ నిన్ను కోరుతోవుంటే! ఏవుత్తరమూ వ్రాయకుండానే, మర్నాటి పొద్దునకే నువ్వు గుమ్మంలో నుంచునివుంటే, నిద్రలో వుండగానే నాపక్కమీద నవ్వుతో కూచునివుంటే, నిన్ను కలలో చూస్తోవుండగా, నువ్వు నన్ను ముద్దులతో లేపుతోవుంటే—

అంత అదృష్టమా యీ నిర్భాగ్యుడికి!

నామీదకన్న, నీకు జీవితంమీదనే యెక్కువ అభిమానం. నన్ను విడిచి వెళ్లేటప్పటి నీవిచారం అబద్ధంకాదు. కాని, నీ ధర్మంమీదనే నీకు యెక్కువ ప్రేమ. నీ సంసారమే నిన్ను మింగేస్తుంది. అవును నీ సంసారాన్నీ, నానించి వేరైన నీ జీవితాన్నీ చూస్తే నా జలసీ యెక్కువవుతోంది. ఎప్పుడూ నిన్ను నాదగ్గర్నించి లాక్కుపోతోవుంటుంది. నిజంగానే నీకు నామీద దిగులే యెక్కువై

వుంటే, నువ్వు వొచ్చేశేదానవు కాదా? నీ సంసారంమీదనే అభిమాన మెక్కువ. అందుకనే నిన్ను పిలిపించుకునే బాధ్యత నామీద వెయ్యాలని చూశావు.

నిన్ను blame చేస్తున్నాననుకోకు. మనం మనల్ని చక్కగా, స్పష్టంగా అర్థంచేసుకుని, మన motives విడతీసి చూసుకుంటే చాలామంచిది. ఈ ప్రజలవలె, మూర్ఖులవలె, మనకార్యాలకీ, emotions కీ సరికాని values ఇచ్చుకోవడనించి తప్పించుకోవాలి. మన ప్రేమ ఆదర్శంగా వుండాలంటే- నేనుమాత్రం, నీ ప్రేమకోసం, నాజీవితాన్ని, సంసారాన్ని వొదులుకోవలసిన అవసరమే వొస్తే, ఎంత సందేహిస్తాను? చివరికి ఏంచేస్తానో!

మనం 'ఆనెస్టు'గా ఆలోచిద్దాము. అంతే నేనడిగేది. నీజీవితంనించి, నిన్ను కదిలించగలిగినంత వున్నతమూ, గాఢమూ కాదు నా ప్రేమ. స్పష్టంగా తెలుస్తోనేవుంది. త్యాగమంటారుగాని యీ నీతిపరులు, యే motive కి బలం యెక్కువైతే అట్లా పనులు చేస్తారు. రెండోది 'ఆటోమాటిక్' గా త్యాగమైపోతుంది- అంతే కాని ప్రయత్నించి డ్యూటీ, అని త్యాగంచేస్తే, అది విపత్తుల్యమవుతుంది. నేను నీకోసం, ప్రేమకి డ్యూటీ అని సంసారం వొదిలినా, ఆజన్మాంతమూ ఆత్యాగానికై యేడవనా!

ప్రేమ వూరికే మనకి బజారులో దొరకదు. ప్రేమ, గాలి వలెనే, కాంతివలెనే, అనేకరూపాల సర్వత్రా వ్యాపించివుంది. ఈశ్వరుడి సాన్నిధ్యం పొందాలంటే, యుగయుగాలు, జన్మజన్మాలు, తపస్సూ, ఆత్మశుద్ధీ, కావాలంటారు. అంతకన్న ఘోరమూ తీవ్రమూ ఐన, కఠోరమైన తపస్సూ, హృదయశుద్ధీ self-descipline అవసరం వున్నతమైన ప్రేమ ననుభవించాలంటే. ఆత్మ, ఆ ప్రేమాగ్ని నిభరించగల సమర్థతని పొందాలి ముందు. మనలోనే, ఆ సంస్కారం లేకపోతే, మనముందే ప్రేమ నడుస్తుంది. మనచుట్టూ వుంటుంది ప్రేమ- గుడ్డివాడిచుట్టూ కాంతివలె. మనం మాత్రం గుర్తించలేము.

ప్రేమ లభ్యము కావచ్చు. కాని, ఆ ప్రేమని నిలుపుకునే అర్హత లేక, ఆ మాధుర్యాన్ని అనుభవించగల సమర్థత లేక, జారవిడుచుకుని ఏడుస్తాము. కొందరు అల్పత్వంతో lower passions తో, దాన్ని ధ్వంసంచేసి, partner నీ, స్త్రీలోకాన్నీ తిట్టి, సంతుష్టి పొందచూస్తారు.

నీ సంసారానికీ, నా ప్రేమకీ మధ్య, నీకే struggle కలిగి నప్పుడు, నువ్వు conscious గా నా ప్రేమనే యేరుకుంటావు: కాని, sub-conscious గా నీ సంసారం మీదనే వుంటుంది నీమన సంతా. నా ప్రేమలో నీకు శాంతివుండదు, వొదులుకున్న ధర్మంకోస మైన పరితాపంవల్ల ! ఎంత complex ఐనది మానవహృదయం !

జీవితం అతిగంభీరమైనది, భయంకరమైనది_ మనిద్దరి సంగతి తలుచుకుంటేనే ఆశ్చర్యమూ, భయమూ కలుగుతాయి. ఎట్లా యింత తీవ్రంగా, మన హృదయాలంతటితోనూ ప్రేమించుకుంటున్నాము ? ఈ విరహం, ఆశ, కలలు, violent passion, tender affection చివరికి ఇవన్నీ యెక్కడ అంతం ? ఈ ప్రేమ అసలు మాయా, కలా, వాస్తవమా ? ఈ జీవనమే క్షణభంగురము. ఐతే దీనిని ఆనందంగా, తేజోవంతంగా చేసుకోగలిగిన శక్తే మనచేతుల్లోవుంటే, యీ స్వల్ప కాలమూ, మనకి కటాక్షింపబడ్డ యీ కాసినియేళ్లూ, మనం అన్ని బంధనాలూ తన్నేసి, కలిసివుండి అనుభవించకూడదూ ? జీవితమే fleeting dream కదా ; యీ స్వప్నాన్ని, సుందర స్వప్నమే అయ్యేట్టు చేసుకోకూడదా ? ఎట్లానూ అనంతంగా నిద్రేనేమో యీ స్వప్నంతరవాత ! ఒకవేళ తిరిగి మెళుకువ అనేది వున్నా, యీస్వప్నాన్నీ, దాంటో మనంపడ్డ బాధల్నీ, సంతోషాల్నీ తలుచుకుని, నవ్వుకోడమేకదా ! చక్కని కలలేకందాము. ఈ విరహపు బాధలెందుకు ?

కాని, భయమేస్తుంది. ఈ ప్రపంచశక్తి మనకళ్లముందు నడిపే యీరంగుల తెరని, ఆనందమేకానీ, దుఃఖమేకానీ, దాని

తోవన దాన్ని సాగనియ్యాక, మనం ప్రయత్నించి మన మనసుకు యిష్టమైనట్టు మళ్లించామా, యెటు తిరుగుతుందో; అసలు చిరుగు తుందో లేక ఘోరమైన అంధకారంలో, బెదిరించి, విరుచుకు నెత్తి మీద పడుతుందో! ధీరాత్ములు విధినే, తమ మార్గానికి వొంచుకో గలరంటారు గాని, నాకు సందేహమే! మొత్తానికి సామాన్య మానవు లకు అపాయకరమైన ప్రయత్నమే! లియర్, మాక్‌బెత్‌లు చేసిన పనే అది!

ఈ రాత్రికూడా నాప్రక్కనే పడుకున్నావనుకుని, అర్ధ రాత్రి నీకోసం నిద్దట్లో చేతులుజాచాను- చేతులకి ఏమీ అందక ఉలికిపడిలేచాను- దిగులుపడి నిన్ను చాలాసేపు తలుచుకుంటో పడుకుని నిన్ను కలగన్నాను- మనిద్దరమూ చాలా అందమైన దేశంలో, ఏవిచారమూ, ఆటంకమూ లేకుండా విహరిస్తున్నట్టు కన పడ్డది. నిజమవుతుందా?

నిన్ను తలుచుకున్నంతమాత్రాన నావొళ్లు పులకరిస్తుంది- నిద్ర మత్తుగా class లో పాఠంచెపుతున్న సమయాన, నువ్వు జ్ఞాపకం వొచ్చావా, తటాలున ఆషాడు బూజుగదుల్లో, బంగారపుయెండ మెరిసినట్టయి నా మొహం చిరునవ్వులతో నిండుతుంది- నాస్కూలు పనీ, నాకాలుగోరుకి పోలని, యీ హెడ్మాస్టర్ల బుద్ధిలేని ఆజ్ఞలకి లోబడవలసిరావడమూ, ఎందుకూ ఉపయోగంలేని తుక్కుచదువుని, యెన్ని కుమార్గాల తిప్పిబోధించాలో, యీ టీచర్లకి బోధించవలసి రావడం, దెబ్బలతో, క్రూరత్వంతో, బలవంతంతో, చిన్నపిల్లల ఆత్మల్ని చదువు అని పేరుపెట్టి ఎట్లా హత్య చెయ్యాలో, ఆ పద్ధ తుల్ని బోధించవలసిన గతిపట్టడమూ, నాకు యివన్నీ తలుచుకుని విచారపడే సమయాన, యింక నాజన్మకి ఇంతేగతి యీ ట్రెయినింగు స్కూళ్లలో, అని నిరాశతో కుంగేసమయాన, నువ్వు జ్ఞాపకంవొచ్చి, జన్మఖైదునించి విముక్తిమార్గం కనపడే Convict వలె Feel అవు తాను.

ఒకరోజున నన్ను పిలిచి పెదవులతో ఆజన్మాంతమూ వశ్యుణ్ణి చేసుకున్నావు. ఒక్క నిమిషాన కళ్లెత్తి నన్ను చూచి నీకు శాశ్వతంగా కట్టేసుకున్నావు- ఆ మాధుర్యం రుచిచూసిన నిమిషాననుంచి, వెర్రెత్తి, తిరిగి తిరిగి ఆ అనుభవంకోసమే వెతుకుతున్నాను- ఒకసారే నా పేరు పెట్టి పిలిచావు- ఆనాటినుంచి యీనాటివరకు, ఆకంఠమాధుర్యంకోసం కలలుగని పరిగెత్తుతున్నాను, ప్రపంచాన్ని వెతుకుతో.

---

Along the parching highroad of the world
No other soul shall bear me company.
Always shall I be teased by semblences,
With cruel imposture, which I trust awhile
Then dash to pieces, as a careless boy
Flings a Kaleidoscope which shattering
Strews all the ground about with coloured shreds.

ఇదివరకే అనుకుంటున్నాను, నువ్వు మొన్నవొచ్చి వెళ్ళింతరవాత యింకా నాతలపు స్థిరపడ్డది. ఈవాళ నీ వుత్తరం చూసింతరవాత, ఆసంగతి నీకు వ్రాయాలనిపిస్తోంది. ఏమిటంటే— మనిద్దరమూ క్రమంగా మారిపోతున్నాము. కాలమూ పరిస్థితులూ, జరిగిపోతూనే వుంటాయి. ఎవరికోసమూ ఆగవు. ప్రేమ జలంతో ఎంత శుభ్రంగా హృదయమందిరాన్ని ప్రతిదినమూ కడిగి భద్రం చేసినా, కాలిధూళి, మూలమూల చేరి పురాతనత్వాన్ని స్థాపించకమానదు. నిన్ను తలుచుకున్నంత మాత్రాన భగ్గుమని ప్రజ్వలించి, నన్ను కంపింపచేసే, నాహృదయం మందగిస్తోంది. మనము కలుసుకున్నప్పుడు కూడా, పూర్వంవలె యిప్పుడు తుపానులో మబ్బులు కలుసుకున్నట్టు మోహ విద్యుచ్ఛక్తిలో భగ్గుమనము. కా...లో మనము కలుసుకుని గడిపిన రాత్రులు జ్ఞాపకం తెచ్చుకో. అది ప్రేమకాదేమో, ద్వేషమేమో అని సందేహం కలిగేటంత భయంకరమైన తీవ్రత. ఒకరినొకరం నాశనం చెయ్యడానికి పూనుకున్నామా, అనిపించేటంత దారుణవాంఛ! అదంతా మాయమయింది యీనాడు? క్రమంగా ప్రియతమమైన, మిత్రులమై పోతున్నాము. ఏళ్ళు గడిచినకొద్దీ మన యెడబాట్లతో, విరహాలతో, దుఃఖాలతో, చిరాకులతో క్రమంగా నలిగి శక్తిహీనులమూ, వుత్సాహరహితులమూ ఐనామా? ఎంతో జాగ్రతగా, పరస్పర పూజ్యభావంతో, ఆరాధనతో, నమ్రతతో మన

ప్రేమజ్వాల నెంత పోషించుకున్నా, మనచేతుల్లోనే క్రమంగా చల్లారిపోతోంది. కారణమేమిటో ? వయసా? రక్తలవణాల్లోని మార్పా? గ్లాండ్సులో లోపమా? లేక మనసులే, ఆత్మలే యిట్లా మారతాయా? మనుష్యుడికి యీలోకంలో ప్రేమ అంతా యింతేనా? ఇదే సహజమా?

మనలో ఘనత లేకపోలేదు. మనప్రేమలో ఆధిక్యత లేక పోలేదు. సాధారణ ప్రజలలో వారాలలో అంతమయ్యే వాంఛని, మనము యిన్ని సంవత్సరాలు, అద్భుతంగా, నవీనంగా, ప్రజ్వలితంగా పోషించుకున్నాము. ఇతరులు జన్మఅంతా పొందే ఆనందాన్ని, మనం ఒక్కముద్దులో పొందగలిగాము. ప్రేమలోకపులోతులు, అంచులు, శిఖరాలు, అన్నీ విహరించి అనుభవించాము. అగ్నివంటి విరహంలో రాత్రులకు రాత్రులుకాలి, హృదయాన్ని నిరంతరమూ పరిశుభ్రంగా, పవిత్రంగా వుంచాము. కాని, ఏమైతేనేం? చివరికి అంతా వొకటే.

అంటారుకదా, ప్రేమ ఏమీ తగ్గలేదు, నూతన వుద్ధృతం మాత్రమే తగ్గింది. ఆమోహతీవ్రత తగ్గినకొద్దీ మధురమైన శాంతం ప్రేమ నావరిస్తుందంటారు గ్రంథకర్తలు. నిజమేమో! ఈనాటికి గాని, ఏనాటికిగాని, ఒకరు లేక యింకోరం బరకలేము మనిద్దరమూ. కాని, యీ మోహజ్యోతిలోని కాంతి తగ్గడం నే నోర్చుకోలేను.

ఇది సహజమైన మార్పుకాదు. నేను యింకొకర్ని నూతనంగా యీనాడు ప్రేమించగలిగితే, మళ్లీ నాహృదయం వెయ్యి వెలుగులతో ప్రజ్వరిల్లుతుంది. ఇది రక్తశీతలత్వంకాదు. ఒకరికి ఒకరం అలవాటై, సాధారణులమైపోవడంవల్లగావుననుకుంటాను. ప్రపంచమే, ఈ అంత తేజోవంతుడైన సూర్యుడే, మామూలు కావడంవల్ల, ఆకర్షకత్వాన్ని గోల్పోయినాడు. ఇంతేనా? ఏదైనా యీ ప్రపంచంలో, అలవాటూ, సాధారణమూ కాకుంటే, నిరంతర నూత్న సౌందర్యాలతో, ప్రతిక్షణమూ, ఆజన్మాంతమూ, కాంతిప్రభావాలతో, హృదయ వాంఛని లాగిపట్టి వుంచగలదా?

ఒక యీశ్వరుడే అట్లా కాగలడంటారు. కాని, నేనా యీశ్వరుణ్ణి యెరగను. ఈ భక్తులనుకొనే వారందరికీ, ఆ యీశ్వరుడు వాళ్ల భార్యకన్న, వాళ్ల గోచీలకన్న, వాళ్లు పీల్చేగాలికన్న, నశ్యంకన్న మామూలైనాడు. నిజమైన ప్రేమేవుంటే ఆ దేవుడి మీద, ఎవరన్నా వీధిలో ఆపేరు ఉచ్చరించినంతమాత్రాన, పుస్తకంలో నామాక్షరాలు కనపడ్డంతమాత్రాన పరవశుడై, ఆనందబాష్పాలతో కళ్ళునిండిపోవొద్దా భక్తుడికి ! నీ పేరులోని ఒకటి రెండు అక్షరాలుకల యింకో పేరు వుచ్ఛరిస్తోవుంటేనే, నేను వులికిపడతానే !

నేను వొప్పుకోను, మనప్రేమ యిట్లా సాధారణ స్నేహంగా మారడానికి. కాని చిన్హాలు, మృత్యుచిన్హాలు కనపడ్డాయి నాకు. కొన్ని సంవత్సరాలలో ఏమైపోతామో ! ప్రేమపోయిందా, ప్రాణం పోయిందన్నమాటే. మనచుట్టూ చూసే జీవచ్ఛవాలవలె తయారైనామన్నమాటే. వీలులేదు. జీవితం నన్నట్లా మోసంచెయ్యడానికి వీలులేదు. ఎప్పుడూ నూత్న జ్యోతివలె, ఆకాశన దేదీప్యమానమై జారే మీటియర్‌వలె భగ్గుమని నిరంతరమూ వెలుగుతోవుండాలి నీ సౌందర్యదీప్తి నాహృదయంలో. నిన్ను తలుచుకున్నంతమాత్రాన, నన్నావరించిన యీచిరాకులు, విచారాలు, విఘాతాలు, నిరాశలు, పటాపంచలై ఆనందతేజస్సు నాహృదయంలో నాట్యమాడాలి.

కనకనే నేను ప్రపంచానికి, బతకాలని కోర్కెవున్నవాళ్లందరికీ, ఆత్మల అభివృద్ధికై పాటుపడేవారందరికీ బోధిస్తాను, ప్రేమ మామూలై చల్లబడ్డదా, పరస్పర బంధనాలు తెంపుకుని, నూతన ప్రేమ సంబంధాలకై ఎదురుచూడమని.

ఈ మోహం చల్లారి మనకి కొన్నిసంవత్సరాలలో, ఇంక జీవించేందుకు కారణం కనబడక, వెతికి, ఈ ప్రజలవలె మన ఆశయాలను, ఇళ్లమీదా, బళ్లమీదా, డబ్బుమీదా, డ్రెస్సుమీదా, వియ్యంకులమీదా నిలుపుకుని జీవిస్తామా - ప్రేమకోసం, స్వేచ్ఛకోసం, కులాన్ని, బంధువుల్ని, ఇళ్లని, మర్యాదని త్యజించి బైటపడ్డ మనం,

మళ్లీ చివరికీ వాటికోసమే పాకులాడతామా? నువ్వూ యీ ముత్తైదల వలె, చీరెలూ, నగలూ, నౌకర్లూ, మర్యాదలూ చూసుకుంటో, ఈ చదువుకున్న ఆడవాళ్ళవలె, వెకిలినవ్వులూ, దొంగసిగ్గులూ పడుతో, ఆఫీసర్ల భార్యలవలె, మర్యాదలకీ, ఆధిక్యతలకీ, ఈర్ష్యలుపడుతో, చచ్చుబ్రతుకు బతుకుతావా? నే నీకోట్లు సూట్లవాళ్లవలె, ఈలాం కోటు, బొర్ర హెడ్మాస్టర్లవలె, ఇళ్ళలో ఒళ్ళలో కన్నాలు చేసుకు బతికే యీ పందికొక్కులవలె, బండ మొద్దునైపోతానా? అంతకన్న, నువ్వు యేసిగ్గూ హృదయంలేని వేశ్యవూ, నేను భయమూ ఆటంకమూ లేని రౌడీనో ఐతే ఎంత అదృష్టం?

ఏమీ డబ్బూ, మర్యాదా, స్నేహితులూ, ఇల్లూ, లేకుండా చెయ్యిచెయ్యీ కలిపి తిరిగినరోజులు రావా మనకు? పూర్వంవలె మళ్లీ ఆడుకోమా! యింక. కర్రలూ, గిన్నెలూ, మీద విసురుకోడం, చెట్లు పాకడం, నీటిలో వుదయసాయంత్రాలు యీదడం చెట్ల, చుట్టూ, ఇళ్లచుట్టూ పరుగులు, నవ్వులూ, కనపడ్డ ప్రతివారినీ వెక్కిరించడం రోడ్లపక్క భోజనాలు, బయలులో నిద్రలు, చీకట్లో ఆకాశంకింద బయలులో ముద్దులు_అన్నీ ఆఖరుకాబోలు ఈజన్మానికి! ఎవరి లెఖ్ఖాలేదు. ఏ భయంలేదు. రేపెట్లానన్న ధ్యాసలేదు. ప్రపంచ మంతా మనదే, మనుషులందరూ వెలి. మతం, కులం, నీతి, అభిమానం ఏమీలేవు. సూర్యచంద్రులే మనమిత్రులు_ ధన్యమయింది నాజీవితం_ ఆరోజులు తలుచుకుంటే. సృష్టిమీది అప్రేమే పోయింది. ఆ అందమే కన్ను మరిచిపోయింది. నదిలోని నీళ్ళు, రోడ్డుప్రక్కన పువ్వులు, చెట్లనీడ, పిట్టలచిన్ని అరుపులు (మనంకూడ వాటితో అరవడం) పొలాలలో కొత్తగడ్డిలో వొదగడం, పొలంవాడువొస్తే పోవడం, తెల్లారి ఆ గడ్డిలో, మంచుతో తడిసి మేల్కొని, కొత్తసూర్యుణ్ణి చూస్తో, సంతోషంతో కావిలించుకుని, మళ్లీ పడుకోడం_ఇంకరవు.

నేను క్రమంగా టీచరుగా మారిపోతున్నాను. నువ్వు క్రమంగా కుటుంబస్త్రీనై పోతున్నావు. ఈ పరస్పరాకర్షణే లేకపోతే యీపాటికి నశించి వుందుము.

అప్పుడే నా పాతస్నేహితుల్లో, ఒకరిద్దరూ, నాతోటిటీచర్లూ ఒక్క బంధువుడుకూడా మొన్న నన్ను ఆప్యాయంగా యిష్టంగా పలకరించారు. నేను ఎంత పతితుణ్ణి కాకపోతే, ఎంత సామాన్యస్థితికి గుంజుకుపోకపోతే, ఎంత నాఆత్మ బూజుపట్టకపోతే, వీళ్ళునన్ను మర్యాదస్తుణ్ణిలాగు తమలో వొకణ్ణిలాగు పలకరిస్తారు? ఈ దరిద్రులు, పూజలూ కర్మలూ చేసే క్షుద్రులు, ధనాన్నీ కీర్తినీ సుఖాన్నీ ఆరాధించే ఈ పురుగులు, స్వేచ్ఛనీ అందాన్నీ మృదుత్వాన్నీ నలగతొక్కుతో పొయ్యే ఈ పశువులు, నన్ను తమలో ఒకణ్ణిగా తలిచి కీర్తించి మాట్లాడితే నేనేం తప్పుచేశానా, యే ఘోరపాపంలో పడ్డానో, వీళ్లింత చులకనచేసి గౌరవించడానికి యెంత అధోగతికి పాల్పడి, ఈ ప్రపంచానికి లొంగిపోయినానో అని విచారిస్తాను. ఇదివరకువలెనే పాపి, దుష్టుడు, నీతిరహితుడు, రాక్షసి, పిశాచి అని దూరంగా వుంచరేమా అని దిగులు.

కాని, ఈ పిల్లలు వీళ్లు, నావాళ్లు, పెద్దవాళ్లవుతున్నారు. వీళ్ళు నన్ను అర్థంచేసుకోక లోకం మాటలు విని నమ్మి నన్నుచూసి నా పేరుతలుచుకుని ఈ క్షుద్రులముందు, ఈ స్వార్థపు రాక్షసులముందు, యీ నీచజీవనులముందు,నామూలాన తలలు వొంచితే,ఆనాడుయింకా భరించి ధైర్యాన్ని నిలుపుకోగలనా? నేను వీళ్లని నా ప్రాణంకన్న నా సౌఖ్యంకన్న వున్నతంగా ప్రేమిస్తున్నానే; చివరికి వీళ్లనే యీలోకం నానించి లాగేసి, వాళ్లచేతనే నన్ను తృణీకరింపచేస్తే నామూలాన వాళ్లకే సిగ్గు కలిగితే, అప్పుడూ నిలవగలగాలి. ఇంకా వాళ్లని ప్రేమించాలి! అప్పుడు కద నా ఔన్నత్యం!

కాని తప్పదు. వీళ్లు దిగులుపడతారు, బాధపడతారు. "వీడికెందుకు పుట్టామా!" అని చింతిస్తారు. కాని, లోకంలో ఏమన్నా కావొచ్చును. దరిద్రుడు, నరహంతకుడు, కుష్ఠురోగి కావొచ్చునుగాని మర్యాదస్తుడు కావడమంత హీనత్వం యింకేమీలేదు. ఆనందాన్ని, స్వేచ్ఛని, జీవితాన్ని, రసికత్వాన్ని, మర్యాదకోసం ధ్వంసంచేసుకునే స్థితికి ఏశాపంవల్ల వొచ్చిందో యీలోకం నాకు అర్థంకాదు.

ఈ వ్యధనంతా నీకు ఎందుకు వెళ్లబుచ్చుతున్నానంటే, నువ్వే నాజీవితం, నీప్రేమలో నాజీవితమూ, ఆనందమూ అంతమవుతుంది. సహించలేను. మన ప్రేమ చల్లబడతోందంటే, నాకళ్లకాంతి తగ్గిందన్నమాట, ప్రపంచం నాకు నరకమయిందన్నమాట, నాహృదయం చల్లబడుతోందన్నమాట! ఏంచేద్దాం? ఏవిధంగా తిరిగి నూతనప్రేమ జ్యోతిని సాధిద్దాము!

నాకు ఒక సందేహంతోస్తోంది. ఇంతదూరమైన విరహాలు, ఒక్కసారిగా నెలలకి నెలలు మనం కలుసుకోలేకపోవడం, పరిస్థితుల్ని ఎదిరించలేని బలహీనత, ప్రేమదేవి ముందు మన సర్వస్వాన్ని బలియియ్యటానికి జంకిన అనుమానం, మనమీద కసితీర్చుకుంటోందేమోనని!

ఏమంటావు నువ్వు!

అదే నిజమైతే - నేను కడపటిత్యాగానికి సంసిద్ధుణ్ణి. సమస్త ధర్మాలూ, నీతులూ, honour, అన్నీ ప్రేమాగ్నిని ప్రజ్వలింపచేసేందుకేగాని, ప్రేమని ఆర్పడానికి ప్రయత్నించాయూ, ఏదైనా, చివరికి జాలీ, దయా కూడా భస్మంకావలిసిందే! ప్రేమ ఆ బలినే కోరితే!

నువ్వూ యోచించు.

ఈ రాత్రి యేమీ తోచటంలేదు. నువ్వు దగ్గిరలేకుండా యిట్లా బతికి యేంలాభమా అని యోచిస్తున్నాను. దేవుడేమంటాడో! అతని వుద్దేశ్యమేమిటో! ఆ దేవుడు మన హృదయాల్లోనే ఉంటాడంటారే, నా హృదయమంతా నీతోనిండివుందే, దేవుడికి స్థలమేదీ! ఆమాటంటే నాకు భయమేస్తుంది. భక్తులకథల్లో-హృదయం పరాయత్తమై యీశ్వరుడికి చోటు లేనప్పుడు, ఆ పరపదార్థాన్ని లాగేసుకుంటాడని వ్రాసుకున్నారు. నిజమైతే! కాని, నేను భక్తుణ్ణి కానుగా, నాకా భయంలేదు. నిన్ను తీసేస్తే, హృదయం శూన్యమవుతుంది. ఈశ్వరుడా! ఆ పేరెత్తితే ద్వేషంతో నిండిపోతుంది. అది తెలుసుకుని జాగ్రతగా వుండమను.

---

వారంరోజుల క్రిందట నేను బెంగుళూరు వెళ్లాను జానకి రాం, కృష్ణశాస్త్రి రమ్మంటే. జానకిరాంతో అతని హాస్టల్లోవుంటే, కొత్తపట్టణమూ, బెంగుళూరు atmosphere, ఆ హాస్టలు జీవితం, జానకిరాం తన చుట్టూ కల్పించుకున్న అందమూ, చూస్తే ఏదో చాలా దూరదేశం, నేను జీవితంలో miss ఐన సంతోషంలోకి వొచ్చినట్టుంది. నా దైనికి జీవితపు రొటీన్, నా ట్రెయినింగ్ స్కూలు బతుకు తలుచుకుని, నామీద నాకు చాలా జాలికలిగింది.

మర్నాడు పొద్దున్నే హరీంద్రనాద్ ఇంటికి వెళ్లాము. అతను ఆవేళ మౌనంలో వున్నాడు. కాయితంమీద వ్రాత ద్వారా మాట్లాడాడు మాతో. మమ్మల్ని తనవెంట చాలా చక్కని స్థలా నికి తీసుకుపోయినాడు. కొండంత ఎత్తైన ప్రదేశం, మా కళ్ళకింద లోతుగా గోరీలదొడ్డి - అందమైన గోరీలు - సూర్యకాంతి మా వెనక నించి పట్టణంమీదా గోరీలమీదా మెరుస్తోంది. కొండల్లోంచి వీచే చల్లని శుభ్రమైన గాలి. ఎంతోసేపు తన్మయులమై కూచున్నాము, అట్లా చూస్తో. అతను ఎప్పుడూ అక్కడికివొచ్చి కూచుంటాడు గావును!

మర్నాడు వెళ్లాం మళ్లీ. నిన్ననే నన్ను చూడగానే, సెక్సు కథలు వ్రాసేవాడివిలాగున్నావే? అన్నాడు. ఎన్నో పుస్త కాలు, నేను పేర్లు విననివిచెప్పి, అవి చదవమన్నాడు. అతని అను భవం అపారం.అంతకన్న ప్రతిచిన్నవిషయమూఅతని కవిహృదయంలో గొప్ప విలువతో మారింది. ఇంగ్లండులో సౌందర్య ఆదర్శంతో తిండి లేక అనామకులై మాడే artists సంగతీ, తన జీవితంలో ఉడుకు దుడుకులూ మాట్లాడుతోవుంటే, మొదటిసారి మద్రాసు వర్ణన వినే చిన్నపిల్లవాడివలెవుంది నా మనసు. అతను యిప్పుడు ఆధ్యాత్మిక చింతలో వున్నాడు. రామదాసు అనే సన్యాసితో హిమాలయాలకు

వెళ్ళిపోతున్నాడుట, నన్నూ రమ్మన్నాడు. ఎంత చక్కగా మాట్లాడతాడని.

"ఆ హిమాలయాల్లో ఆ ఆకాశచుంబిత శిఖరాల సమక్షంలో యీ ప్రజా అల్పత్వాలకి, క్షుద్రబాధలకి అతీతులమై యిక పుస్తకాలెందుకు, భాష యెందుకు, వ్రాసేందుకేముంది, మాట్లాడేందుకేముంటుంది?" అన్నాడు.

అంతేనేమో! ఈ వ్రాయాలీ, ఏదో సౌందర్యం కల్పించాలి, యితరులకి బోధించాలీ, అనేదంతా అల్పత్వమేనేమో! ఈ లోకాన్ని సంస్కరించాలనే యీ ఆశా, మనమేదో ఘనకార్యం చేస్తున్నామనే నమ్మకం, ఇతరులేదో బాగుపడుతున్నారని అనుకోడం అంతా భ్రమేనేమో! ఏమీలేదేమో! నీటిమీది వ్రాతలేనేమో! ఈ లోకదృశ్యం passing dream మన ఆత్మే శాశ్వతమైనదైతే, మన ప్రయత్నమంతా యెంతవ్యర్థం! ఆ సంగతి తెలిసే యీ యోగులూ, సన్యాసులూ అన్నీ విడిచి నిర్వ్యాపారులై, కొండగుహల్ని చేరుకుంటారు. మొన్న దీక్షితులుగారూ అట్లానే వ్రాశారు. ఒక్కమాటలో, "వ్రాసేందుకేముంది? ఎందుకు వ్రాయడం?" అన్నారు. ఈ బాధా, రోగాలూ, సంసారాలూ, ఆస్తిదాచుకోడాలూ, అన్నీ యివన్నీ పిల్లల ఆటలాగో, పలవరించేవాడి కలలాగో, పిచ్చివాడి ఆలాపనలలాగో కనిపించే, ఉన్నతమైన ఒక perspective వుందేమో! మన అల్పదృష్టి యీ ప్రపంచపటాన్ని ఒక మూలనించి, ఒక్కరవ్వ చూడడంవల్లనే యింత వికృతంగా భయంకరంగా, బాధావృతంగా మనం సంస్కరించవలసిందిగా కనబడుతోందేమో!

ప్రపంచానికి అర్థమేలేదేమో, సంస్కారం, త్యాగం, అంతా వృథాయేమో; దేవుడు ఏనిమషానో పెద్ద నవ్వు నవ్వితే, అదే యీ ప్రపంచం అయిందేమోననిపిస్తుంది. మరి 'నువ్వూ, నీకథలూ నీ స్త్రీ స్వాతంత్ర్య సమరమూ, ఏమిటం'టే యిదంతా నా 'చిన్ననవ్వు' అంటాను.

ఇట్లా వొక్కొక్క నిమిషాన నామనసు వ్యాకోచిస్తుందిగాని, ఒక్క చిన్నపిల్ల యేడవనీ, ఒక్క స్త్రీ హింసపడనీ, ఏ క్రూరుడి మూలానో, వాణ్ణీ, సంఘాన్నీ, యీ సిస్టమ్‌నీ, దేవుణ్ణీ, ధ్వంసం చెయ్యాలన్నంత కోపంతో మళ్లీ మాయలోపడతాను—

అందమైన ముఖం, జేబునిండాధనం, చల్లనిగాలి, చాలు, నన్ని వేదాంతంనించి permanent గా లాగెయ్యడానికి. ధ్వంసం చేసే శక్తిలేక ఆ కోపాన్నంతా కథల్లో కక్కేస్తాను. మళ్లీ పరిక్షచేసి చూస్తే ద్రోహంచేసిన మనిషీ నిర్భాగ్యుడే, అంధుడే, బలహీనుడే, అని తెలుసుకుంటాను. పిచ్చికని పట్టుకున్న పిల్లినిచూసి కసిపట్టే వాణ్ణి చిన్నప్పుడు. కాని "అనగనగా ఒకపిల్లి మూడురోజులు తిండిలేక మలమలమాడి తిరుగుతోంది. తిండికోసం చివరికి దానికి ఒక పిచ్చిక కనబడ్డది." అని కథగా చెపితే ఆపిల్లికి పిచ్చిక దొరికితేనే బావుండుననిపిస్తుంది. moral values అంటామే, వాటిల్లో యింతమాత్రమే సత్యంవుంది. ప్రపంచమంతా ఏమీ ప్రశ్నించకండా తలలు వొగ్గుతున్నారు, గనుక, చలామణి అవుతున్నాయి, యీ చట్టాలు. వాటిల్లోని న్యాయం, అర్థం ప్రశ్నించినవాడు వున్మత్తుడు, విరోధి అవుతాడు.

హరీంద్రనాద్ కొద్దిరోజులకిందటే హుబ్లీలో సిద్ధా ఆరూఢ స్వామిగారి దగ్గిర్నించి వొచ్చాడు. ఆ ఋషి దగ్గిరికి వెడితే ర—జబ్బు ఆయన కుదురుస్తాడన్నాడు. నమ్మకంలేని నన్ను నమ్మించడానికి ఎన్నో నిదర్శనాలు చెప్పాడు. తన అనుభవాలు చెప్పాడు. తాను పర్వతాలమీద నడవకండానే తేలిపోయినాననీ, గొప్ప ఆత్మ అనుభవాల్ని పొందగలిగాననీ ఎన్నో కథలు చెప్పాడు. నేను నవ్వాను. మళ్లీ ఆలోచించాను. పరదేశాలన్నీ తిరిగి, హిందూమతమూఢత్వాన్ని యెరిగించిన, హరీంద్రనాద్ యెట్లా యీ విధంగా మాట్లాడుతున్నాడు! ఆత్మవంచనా? పరవంచనా? కాని నన్ను హుబ్లీకి పంపితే అతనికేంలాభం? హరీంద్రనాథ్ మాటల్లో, స్నేహంలో ఒక విశేషముంది. నీతో వున్నంతసేపూ నీవే అతనికి అత్యంత ఆప్తుడవనీ,

అతనికి నీమీద గొప్ప ప్రేమవుందనీ, నమ్మించగలడు. నిజంగా వుంటుందేమో! ఎంత గొప్పగుణం అది! నేనెవరిలోనూ చూడలేదు ఆ trait. అందువల్ల నేను వాదించలేకపోయినాను. అతను స్వయంగా చూశానన్నదానివిషయమై ఏమివాదించను? మూడురోజులు కృష్ణశాస్త్రి, జానకిరాం, హరీంద్రనాద్‌వంటి ముగ్గురు గొప్ప artists తో గడిపి-వొచ్చేశాను. హరీంద్రనాద్‌ని కలుసుకోడం గొప్ప అనుభవం.

ఈ artists దగ్గరలేని 'సిన్సెరిటీ' ప్రేమా, పర్పస్, వున్నట్టున్నాయి అతని దగ్గిర. కాని పూర్తిగా చెప్పలేను. అతన్ని అర్థం చేసుకోడం సులభంకాదు. ఏమైతేనేం? ప్రతి అంగుళం artist లాగు కనపడతాడు. జీవితంలోంచి తానేం అనుభవించాలనికాక, ఏంనేర్చుకుందామనే ఆసక్తి అమితంగా కనిపిస్తుంది. భౌతిక సంకుచితాల్నించి ఉన్నతం కావాలనే తీవ్రియత్నం తోస్తుంది. అందువల్లనే అతను త్వరలో art ని అతిక్రమించి, ఎదో కాబోతున్నాడని నానమ్మకం. అదేమిటో, అది నిజమో కాదో నాకు తెలీదు. కాని ఈ art మాత్రం ఎంతనిజం, artist ని తయారుచెయ్యడానికే దాని ఉపయోగం, ఎంత చర్చించీ ఆ art ఏమిటో, దాని values ఏమిటో ఎవరూ తేల్చలేరు- ఎందుకంటే, నే ననుకుంటానుకదా, ఎవరి art taste వాళ్ల మనసుమీదే ఆధారపడుతుంది గనకనని.

హరీంద్రనాద్ పద్యాలువ్రాస్తాడు, నాటకాలు వ్రాస్తాడు ఇంగ్లీషులో, act చేస్తాడు, హిందీలో పాడతాడు. ఓ మధ్యాన్నం చాలా శ్రద్ధగా వినిపించాడు సంగీతం. కాని నేను impress కాలేదు. ఆ రకం సంగీతం నాకు appeal లేనట్టుంది. కాని అతని పాటమీద అతనికి అభిమానంలాగుతోచింది. అది గొప్పదనికాక, అదితనకి ఇచ్చే గొప్ప అనుభవంమీద అభిమానం. నన్నూ పాడమన్నాడు. అంత శాస్త్రం తెలిసిన అతనికి నా పాట వెర్రిగా కనిపించినా నన్ను ఎంతో encourage చేశాడు. అతని మనసులో సాధారణుల మనసుల్లో ధనంవల్ల, పదవులవల్ల, తోచే హెచ్చుతగ్గులు పోయినాయి.

హరీంద్రనాద్ ఇట్లా అన్నాడని ర-తో అన్నాను. ఈ విష యాల విషయమై-ఏమీ విశ్వాసంలేని-వీటి నన్నిటినీ చూచి నవ్వే ర-అదేపట్టుపట్టి 'ఆయన వాజబ్బు కుదురుస్తాడు. తీసుకుని వెళ్ళమ'ని గట్టిగాపట్టుపట్టాడు పాపం, బాధ అట్లా అనిపించిందిగావును.

నాకు పెద్ద సమస్య పట్టుకుంది, "నువ్వేమంటావో, అనుకుం టాను, యీ సమస్యవిషయమయి. నాకు(వాయి."

బ్రహ్మసమాజం వాసనవల్లనేగాక, అసలు నాస్వభావంలోనే ఒక్కరికి, దేవుడికిగాని, మనిషికిగాని మొక్కడం నాకు అసహ్యం. నా అధికార్లకి మొక్కకపోవడంవల్ల నాకు తటస్థిస్తున్న యిబ్బందులు నీకు తెలుసు. పైగా, దేవుళ్ళకిగాని, యోగులకిగాని యిట్లాంటి మహిమలున్నాయని నాకు నమ్మకంలేదు. నేను నమ్మని సంగతులు, మర్యాదలు, పూజలు మాని, చిన్నతనంలోనే తిరగబడి తరమబడి, యుద్ధాలుచేసి బైటపడ్డాను. మళ్లీ యీనాడు నమ్మకంలేని వరమిమ్మని ప్రాధేయపడనా యింకోమనిషివద్ద! · నా respect కి నేను తగివుంటేనేగాని ముందు నీ ప్రేమకి నాకు అర్హతవుంటుందా? నువ్వు మాత్రం ఒక్క చిరునవ్వునవ్వి, పోనీలే అంటావు. కాని నేనంగీకరించను. హీనుణ్ణి అయింతరువాత నీప్రేమను అపేక్షించడానికి వొప్పుకోను, నీపైన నాకు గల రెవరెన్సువల్ల.

But he who would win to the heavens above and be as the Gods on high.

Must tremble naught at the paths where men-folk die.

మూడురోజులయినా ర-అపట్టువదలలేదు. ఏడ్చాడు- నా మనసు తహతహలాడింది. ఆలోచనప్రారంభమయింది. ప్రేమ,నిష్కామమయిన ప్రేమ, నిర్వ్యాజమయిన ప్రేమ, మనకెన్ని పాఠాలు నేర్పుతుంది! ఎన్ని సమస్యల్నిస్తుంది! ముఖ్యంగా పిల్లలపైని ప్రేమ. మనిషి తన స్వభావాన్ని మార్చుకోడం దుస్సాధ్యం. ఎవరో ఒకరు

తప్ప మనుష్యులు ఎట్లా పుట్టారో, అట్లానే చస్తారు. ప్రేమవొక్కటే character ని కలతపెట్టి, పునాదివేళ్లతో పెకలించి, కొత్త సౌధాలను నిర్మించగల శక్తికలది. ఆ ప్రేమ తటస్థించేవాళ్లు అరుదు.

రటకోసం నేను త్యాగంచెయ్యడం తప్పా! కాని ప్రేమ కోసమైనా నియమాలు భంగపరచవొచ్చా? నా చిన్నతనంలో నేను తిరగబాటు మొదలుపెట్టిన నాటినించీకూడా యీయిరవైయేళ్లూ, ప్రతి స్టేజ్‌లోనూ యెప్పటికప్పుడు మిత్రులు ఆశపడుతోనేవున్నారు. "కానీ, కానీ, వయసురానీ, నాలుగేళ్ళు గడవనీ, సంసారబాధ్యతలు, కష్టాలు నెత్తిన పడనీ, నువ్వూ మామల్లేనే, నీబాహ్మణీకానికి తిరిగి వొస్తావు" అన్నారు. ఏరోప్లేను కనిపెట్టిన మొదటిరోజుల్లో, ప్రాణాలకి తెగించి యెగిరేయోధుణ్ణి చూసి, "కిందపడతావులే!" అని దీవించినట్లు. తమరు పడే బాధలోంచి, తమ అల్పత్వంలోంచి, తప్పించుకోడానికి ప్రయత్నించే మనుషుల్ని చూస్తే, మనుషులకి ఎంతకోపమని! క్రీస్తుని సిలువవేసింది, ఆయన్ని చూస్తే భయంవల్లకాదు, అంధత్వంవల్లకాదు, కోపంవల్లకాదు, ఆయన ఔన్నత్యాన్ని చూసి వోర్చలేక అనిపిస్తుంది, యీ మనుషుల్ని చూసినకొద్దీ. మొదటి రోజుల్లో నాకు అర్థంకాక యోచించేవాణ్ణి, నా స్నేహితులకి నన్ను చూస్తే ఎందుకా ఇంతకోపం అని. నేను పాడైపోతున్నానంటే నామీద దిగులుపడకుండా, ఇట్లా నామీద అబద్ధాలు, scandals మాట్లాడి నన్ను గాయపెట్ట చూస్తారేమా, ముఖ్యం నాతో స్నేహంగావుండే ఈకవిమిత్రులు, అనుకునేవాణ్ణి. నాలో పలికే ఈ ఆవేశం వాళ్లల్లో పలకదా నాకథలు చదివితే! ఇప్పుడు తెలుస్తోందిపాపం, దినదినమూ ఎంత వికృతమూ దుర్భగమైన ఈర్ష్యతో కాలిపోతూ వుండాలోవాళ్లు! ఎన్నాళ్లకీ తిరిగిరాక నానాటికీ మరీ impossible man అయిపోవడంచూసి, వెర్రివాడని సమర్థించుకుంటారు. పరలోకంలో కాలుస్తారు కదా అని సంతోషిస్తారు. పదిహేనేళ్లనించి యేపూజా యేగుడీ, పదేళ్లనించి యే ప్రార్థనా యెరగని నేను యీనాడు మళ్లీ, యీస్వామిని సమీపించడం, నాస్నేహితులు 'ప్రొఫెసీ'

చేసిన మార్పా? వయసువల్ల రక్తం చల్లబడి నన్ను పాతమార్గాలకి దింపుతోందా? అని తర్కించుకున్నాను. ఇదివరకు సంఘాన్నెదిరించి, మళ్లీ మతాచార్యుల శరణుచొచ్చి, బ్రాహ్మణుల కాళ్లు కడిగారని నేను ఎవరిని తృణీకరించానో వారంతా, యిట్లా ప్రేమకోసం త్యాగం చేసినవారేనేమో! పిల్లలకి పెళ్లికాదని, తల్లికి చివరిసంతోషాన్నిద్దామని. ఇట్లాంటి సందేహాలు కలిగినప్పుడే లోకాన్ని, మనుష్యహృదయాన్ని యేకొంచెంకూడా అర్థంచేసుకోలేమే,అయినా, మనుషుల్ని వాళ్లబహిఃప్రవర్తననుబట్టి దొంగలనీ, దొరలనీ, విభాగిస్తాముకదా, ఖండించి శిక్షిస్తాముకదా, అనిపించింది.

స్త్రీలు అవినీతిమార్గాల సంచరించేందుకు, వృత్తకండకావరం కాక, అనేక రహస్యమైన motives అందులోకొన్ని చాలా ఉదారమైనవి వుంటాయని నేను analyse చేసినందుకేగా సంఘం విరుచుకుపడ్డది నామీద!

ఈ నియమాలు, నేను పెట్టుకొన్న యీ నిరీశ్వర నియమాలు సత్యమా? నాకుమాత్రం, ఆ కాలానికి అవి సత్యాలు - ఎన్నిసార్లు మారలేదు ఆ నియమాలు నాజీవితంలోనే? వాటిని గట్టిగా పట్టుకొని జీవితాలనూ, సౌఖ్యాలనూ భగ్నంచేసుకోడం మూర్ఖం. తన నియమంకోసం తాను బాధలు పడడం న్యాయం కాని, యితరుల సౌఖ్యానికి అడ్డురావడం ధర్మంకాదు అనిపించింది. కాని యిదంతా, యీ reasoning అంతా మెల్లిగా వెనక్కి మూఢత్వంలోకి జారడం కాదుకద!

కాని తాను నమ్మిందే సత్యమనీ,అదే నిర్మలమనీ దానికి విరుద్ధమైన నమ్మకాలు అబద్ధమనీ విశ్వసిస్తేనేగాని, లోకంలో యేపనినీ చెయ్యలేము, యేసంస్కారణాన్నీ తలపెట్టలేము. లోకంలో సిద్ధసంకల్పుడు కావలిసినవాడికి హ్రస్వమూ, సంకుచితమూ ఐన దృష్టి వుండాలి. తనలో అపారమైన విశ్వాసం వుండాలి. వీరేశలింగంగారే, వివాహంవల్ల విశంతువుల జీవనానికి నిజంగా సౌఖ్యాన్ని

యిస్తున్నానా అని ఆలోచించినట్టయితే, యేమాత్రం పనిచెయ్యగలిగేవాడు! విశాలమైన జ్ఞానం, యితరులతో నిజమైన సానుభూతి - యివి యీలోకపద్ధతిలో వేలుపెట్టడానికి, జంకు కలిగిస్తాయి. ఎవరి నమ్మకాలు, నియమాలు, వారికేగాని యితరులకి పనికిరావని నా నమ్మకం. ఇతరుల్ని నానియమాలకి తిప్పి, నామతం వ్యాప్తం చెయ్యాలని నాకు ఆశలేదు. మన స్వల్పమేధస్సులకి సత్యం అనేక కారణాలనించి, అనేకరూపాల గోచరిస్తుందనుకుంటాను. అందువల్లనే practical world లో నేను వ్యర్థుణ్ణి. నాపుస్తకాలు చదివి నాదగ్గిరికి సలహా కోసం వొస్తారు. వుత్తరాలు వ్రాస్తారు. నేనేంచెప్పగలను? విజ్ఞానం వాళ్లయెదుట పెట్టాము. ప్రవర్తన వాళ్లే నిర్ణయించుకోవాలి.

'వుత్తవ్రాయడమేగాని, ఏంచేస్తున్నావు?' అని అడుగుతారు. ఏంచెయ్యాలి? ఏంచెయ్యగలను? వ్రాసేవాడు పనికూడా ఎందుకు చెయ్యాలి? నేను అడిగేదల్లా గడ్డకట్టి శిలలుగా మారుతున్న హృదయాల్ని విప్పమని. ఏంచేస్తావు? ఏంచెయ్యమంటావు? అంటే 'మీకుతోచింది చెయ్యండి' అంటాను.

నేను వ్రాస్తున్నదేగాక, నేను చేస్తున్న పనినికూడా నేను ప్రచురించాలి, పత్రికల్లో, ఎవరో గొప్పవాళ్లని ఆశ్రయించి వాళ్ల patronage సంపాయించాలి. అప్పుడూ నేను పనిచేసినట్టు. చందాలు పోగుచేసి, ఏదో స్థాపించాలి. అప్పుడూ మనిషి గొప్పవాడు.

అదిగాక నేనుచేసే పనులు ప్రచురించినా, చెప్పినా, చాలా ఘోరమైన అవినీతికింద కనపడతాయి. కనపడకపోతే వెనక ఏవో rotten motives వాళ్ల మనస్సుల్లోంచి పెకలించి నాకు ఆరోపిస్తారు.

కొందరు 'నేను బోధించే అవినీతిని ఆచరణలో పెడుతున్నానని' గోల.

ఇంక కొందరు, 'ఉత్తవాస్తితలేగాని బోధించే నీతిని ఆచరణలో పెట్టే ధైర్యం, ఔన్నత్యం లేవ'ని గోల.

ఇదీ ప్రపంచం.

మరి పిల్లలకోసం నియమాలు త్యాగంచెయ్యగలవాణ్ణి, నా పెద్దలకోసం, సంఘంకోసం యెందుకు చెయ్యలేదు? యెందుకు చెయ్యను? పిల్లలు నామీద ఆధారపడ్డారు. నా నిరాకరణవల్ల వాళ్లజీవితాన్ని ధ్వంసంచెయ్యగలను. వాళ్లకి వేరుగతిలేదు. పెద్దలు అట్లాకాదు. వాళ్లు నాకోసం త్యాగంచెయ్యాలి నామీద ప్రేమ వుంటే, లేకపోతే విడిపోవాలి. పెద్దల్ని ధిక్కరించి, వాళ్లహృదయాల్ని ఛేదించి ముందుకు నడిస్తేనేగాని దేశాలకీ, సంఘాలకీ మోక్షం లేదు. అదిగాక ఆ పెద్దవారు నానించి వూరికే విధేయతనూ, కృతజ్ఞతనూ demand చేశారుగాని, త్యాగాన్ని పొందగల ప్రేమని చూపివుండరు. ప్రేమేవుంటే నాకోసం వాళ్లనియమాల్ని త్యాగం చేసివుందురు. నేనూ చేసివుందును.

సరే, మరి నిజంగా మనుష్యుడికి, యిట్లా జబ్బులు కుదిర్చేశక్తి వుంటుందా? కుదిరిస్తే miracle అన్నమాట. ఏవిధంగా దేహంలో మార్పు తీసుకురాగలడు? అట్లా యోచిస్తే, యీ మందులు మాత్రం యెట్లా కుదురుస్తున్నాయో తెలుసా యెవరికన్నా! అవి మామూలయినాయి గనక మనకిది విచిత్రంగాలేదు. గోసాయిచిటికలు అద్భుతంగా చిరవ్యాధుల్ని కుదిర్చినమాట అందరికీ తెలుసు. ఆచిటికలకన్నా సూక్ష్మమైనవీ, నిగూఢమైనవీ cures వుండకూడదూ? ఫాముల నరసయ్య సంగతేమిటి? ఈ rationalists యిట్లాంటివాటిని పోయి కనుక్కోరు. సులభమైన నిరాకరణంలో దాక్కుంటారు. Will-power అని తోసేస్తారు. కాని యీజబ్బు ఆయనశక్తికి లోబడవొచ్చు. అంతకీ అతీతం కావొచ్చు. ఆయన కుదర్చాలని యిచ్చగించవొచ్చు. నిర్లక్ష్యపడవొచ్చు. కుదిర్తే! కుదరకపోతే - జబ్బుబలమా, కర్మఫలమా? కుదిరితే కర్మని జయించాడా? లేక కుదిరేఫలం వున్నప్పుడు, ఆ యోగి నిమిత్తమాత్రమా?

ఈవాళంతా స్కూల్లో పనిచేసి అలిసివొచ్చాను. స్కూలు పనివల్ల సులభంగా అలిసిపోతాను. ఎన్నేళ్లుపనిచేసినా, యీపనికి adjust కాను. అందువల్ల యెంతకీ మహాప్రయత్నంలాగువుంటుంది. పని. నా ఆశలూ, కలలూ, అనంతం. నక్షత్రాలలో ధగధగని అనుభవించాలన్నంత విస్తీర్ణమైన కోర్కెలు. పని నాలుగుగోడలమధ్య. ఎక్కడ ఏసౌందర్యమున్నా, నాదేననిపిస్తుంది. ఎట్లా నాజన్మహక్కుని, నా దారుణ నిర్నిద్రవాంఛల్ని మరిచి, యీ 'రొటీన్' జడత్వంలో యెట్లా యిమడను? కాని యీ దినదినవేదన, యీ నరాలతీపి! అయితేనేం? ఇంకా యీ పనికి బానిసనికాక తిరగబడుతున్నందుకే, శవాన్నిగాక, యింకా టీచరురూపం పడక, జీవించి తిరుగుతున్నాను. నీప్రేమని ప్రతిసారీ కొత్తగా మేల్కొలుపగలుగుతున్నాను. నీ ప్రేమ నన్ను, నావృత్తి అల్పత్వంనించి, నాశరీరసంకుచితత్వంనించి విముక్తినిచ్చి, నేను దేవాంశసంభూతుణ్ణని, ప్రపంచానందపతిని, అనేభావం, పునస్థాపితం చేస్తోవుంటుంది. నాహృదయంలో నీ చేతులమధ్య, నీపెదవులమీద, నీకళ్లల్లో, యీ ప్రపంచ రసాస్వాదనం చేయగలుగుతున్నాను. ధన్యుణ్ణి.

నీమీది నాగాఢప్రేమనూ, సౌందర్యంమీది నామహాకర్షణననూ తలుచుకున్నప్పుడు, నాజీవితం మృత్యువుతో అంతంకాదనీ, నేను యీ శరీరమేకాదనీ, యెప్పుడో యెట్లానో, యీ బంధనాలూ నన్ను సంకుచించే యీ వెనికలూ వూడి, నేను స్వేచ్ఛనుపొంది, నా అల్పభావాలన్నీ నశించి, యీ ప్రపంచలీలతో ఐక్యమవుతాననీ, నా హృదయంలో మండే యీ స్వప్నాలన్నిటినీ, సార్థకం, నిరూపకం, చేసుకోగలదనీ అనిపిస్తుంది. కాకపోతే, యీ ధ్యాసలూ, ఆశలూ, ఆశయాలూ, అన్నీ మాయా? తలుచుకో. ఆకలీ, స్కూలూ, గడ్డం గొరుక్కోడం, ఇవన్నీ లేకుండా సూర్యుడుదయించే రమ్యస్థలాలా, చంద్రుడస్తమించే మృదుసదనాలా, మబ్బులో, Milky-way

తీరాల, విహరించడం? నువ్వూ, నేనూ కలిసి! ఈభావంకూడా మాయా భ్రమా? నాలో ఇమిడి, నన్ను తత్తరపెట్టే, యీ ఆలోచనల్ని ఒక్క టాగోర్, ఒక్క కృష్ణశాస్త్రి వ్రాయగలరు. నేను దేన్ని feel ఐ కూడా మాటలతో చెప్పలేక, హృదయంలో మననం చేసుకొంటానో, దాన్ని వాళ్లు, చక్కని మాటల్లో, పాటల్లో, చెప్పి వొప్పించగలరు.

"What is poetry if is n't something, that has to fight for the unseem against the seen, for the mysterious against the obvious? Poetry is the only lost cause we have got left. It fights for the impossible."

ర—మ్మతో చెప్పు. ఆమెమీద నాకేం కోపంలేదనీ, ఆమె నన్ను అన్యాయం చేసినా, ఆమె అవసరాన్ని అర్థం చేసుకున్నాననీ, ఎప్పటివలెనే ఆమె నన్ను మిత్రుణ్ణిగా, last refuge గా చూచుకోవచ్చుననీ. ఆమె జీవితయాత్రలో 'child'. ఈ జీవితపు గంభీరత్వం, mystery, complexity, అర్థంగాక వెతుకుతోంది. Experiment చేసి చూసుకుంటోంది. అందువల్లనే ఈబాధ. సాధారణంగా మనుష్యులు తాము యేమూల బతుకుతున్నారో, ఆమూలని మాత్రమే thorough గా study చేస్తారు. తక్కిన ప్రపంచంజోలి వాళ్ళకక్కర్లేదు. కనక వాళ్ళు చిక్కుల్లోకి రాక తప్పుకుని, బాగా తెలిసినదోవన, రేవునించి రేవుకుపొయ్యే పడవలవలె సుఖంగా బతుకుతారు. ర—మ్మవలె, లోకాన్ని అన్వేషించాలని మహాసముద్రవక్షంమీద తెరలువిప్పిన మనుష్యులు కనబడని కొండలమీద, తుపానుల మధ్య, నలిగి, ఇంకి, నశించడానికి సిద్ధమవుతారు. ప్రపంచం వాళ్ళని సులభంగా మోసగిస్తుంది. కాలుస్తుంది. కాని అప్పటికీ కుదుటబడరు. ఏడుస్తారు. మళ్ళీ ప్రయాణమౌతారు. ర—మ్మకి తన restlessness ని, తన romantic heritage ని అంగీకరించే జ్ఞానంలేదు. మనవంటివాళ్ళం యిట్లా

దెబ్బలుతిని క్షోభపడడానికే పుట్టాము. కాదని నటనచేసి లాభం లేదు. తప్పించుకోడానికి ప్రయత్నం వృధా. ఆమెది గొప్ప హృదయం. స్వల్పమైన మెదడు. అదీగోల!

ఇవాళ ఒకాయన చాలాదూరంనించి వొచ్చాడు నన్ను చూడాలని, నాపుస్తకాలు చదివి. ఇట్లా యెవరెవరో నన్ను చూడాలని ఆశపడి వొస్తారు— వారివ్రాతల స్వభావాన్నిపట్టి, కొందరు రచకుల్నే చూడాలని బుద్ధిపుడుతుంది. నేనే యే హైదరాబాదు ఆంధ్రుణ్ణోవి, ఈ నవీన తెలుగు వాఙ్మయాన్ని శ్రద్ధతో చదువుతూ వుంటే, నండూరి సుబ్బారావునీ, కృష్ణశాస్త్రినీ, చూడాలని కుతూహలపడి వుండేవాణ్ణి. 'ఎరత్ లీ లౌ'ని అద్భుతంగా చిత్రించినందుకు ఒకర్నీ, 'స్యూపర్ ఎరత్ లీ లౌ'ని చిత్రించినందుకు, యింకొకర్నీ. తనని చూడడానికి వొచ్చినవాళ్లని క్రిష్ణశాస్త్రి మెరిపించగలడు. సుబ్బారావు పోనీ పాటలన్నా వినిపించగలడు. నాదగ్గరికి వొచ్చిన వాళ్ళని వాళ్లు వ్యయపరచిన శ్రమకీ, కాలానికీ, దిగులుపడేట్టుచేసి పంపగలను నేను. నా కలంతోతప్ప, నా స్వభావంలోతప్ప, నా నాలిక చురుకు తక్కువ. నేను ప్రేమించిన స్త్రీలతో తప్ప, యితరులతో సంభాషణా, చమత్కారాలూ నాచాతకావు. చాలా చనువైతే తప్ప యితరులతో మాట్లాడగల విషయాలే తోచవు. ఏమి మాట్లాడదామా అని ఆలోచిస్తో కూచుంటాను. ప్రతిదీ క్షుద్రంగా తోస్తుంది.

"ఎప్పుడొచ్చారు?" ఎప్పుడొస్తే నాకేం?

"ఎంతమంది పిల్లలు?" నాకేం సంబంధం?

"నా పుస్తకాలు ఏమి చదివారు" పాపం, చదివినందుకు ఇదొకపరీక్షా! ఏంగొప్ప నాపుస్తకాలు!

"మిమ్మన్ని చూడడం నాకు సంతోషంగా వుంది."

నిజంగా సంతోషంగా వుందా? ఎందుకు అబద్ధాలు!

"ఏవూరు? ఏపేరు?" ఏవూరైతే నాకేం?

ఏవేవో సందేహాలు అడుగుతారు. నా జవాబులు ఎప్పుడూ నచ్చవు వాళ్లకి. ఎందుకంటే వాళ్లనే ఆలోచించుకోమంటాను. నేను నాహృదయమంతటిలోనూ తపించే యీస్త్రీ సమస్యవిషయమై కూడా యితరులలో అగ్నిని ప్రవేశపెట్టలేను, పెట్టాలని యిష్టపడను. అందు వల్లనే నేనెంత తీవ్రంగా గొప్పగా వ్రాసినా, నాకు అనుచరులులేరు. నారచనలవల్ల సంఘమేకాదు; ప్రత్యేకజీవనాలు అభివృద్ధిపొందాలని నా ఆశ. అంతేకాని, నాకుగాని, నా అభిప్రాయాలకిగాని అనుచరులు కావాలని కాదు. నా మిత్రులుగాని, ఆప్తులుగాని, పిల్లలుగాని, చివరకి నువ్వుగాని నాతో యేకీభవించరని నాకు తెలుసు. ఏకీభవించాలనిలేదు. ఏకీభవిస్తారేమోనని భయం. భర్తమాటలు మాట్లాడి advertise చేసే భార్యనీ, తండ్రి ఆదర్శాల్నే మాట్లాడి ఆధిక్యతను చాటే పిల్లల్నీ, చూస్తే నాకు అసహ్యం. భర్తగాని, తండ్రిగాని, గురువుగాని, తెలీకుండా వాళ్ళు పీల్చే గాలివలె వుండాలిగాని, వాళ్లని మెరిపించే తేజస్సువలె వుండకూడదు.

ఆ వొచ్చిన ఆయనయేదో మాట్లాడి, "మీఅభిప్రాయాలకేంలెండి! మీశైలి అద్వితీయమండీ" అన్నాడు. నాఅభిప్రాయాలతో యేకీభవించమనను, కాని నా శైలిని విడతీసి ఆమోదిస్తే నాకుకోపం. ఆమాటలకి అర్థంఏమిటంటే "మీ అభిప్రాయాలు సరైనవే, కాని వాటిని అంగీకరించే ధైర్యం నాకులేదు" అన్నమాట. శైలిఅంటే వీళ్లవుద్దేశ్యం అదొకసాధన, trick practice అని. అదేదో ఆ రహస్యంతెలుసుకుంటే తమకీ అట్లా వ్రాయడం చాతనవుతుందని. నాకు శైలి అనేది అసలు తెలీదనీ, ఆవిషయం శిరోమణిని అడిగి తెలుసుకోవచ్చుననీ; నాజీవితంలో యీ స్త్రీ సమస్యవొచ్చి, నా హృదయంలో రక్తాన్ని వుడికించిందాకా, యీవిషయమై స్త్రీలని అర్థంచేసుకోక సంఘం పెట్టేబాధల్ని నేను తెలుసునుని మండిపడ్డదాకా, నేను వ్రాయగలననే నాకు తెలీదనీ, ఇప్పటికీ ఆవిషయమై తప్ప, ఇంకేదీ వ్రాయడం నాకు చాతకాదనీ; యెట్లా తెలియచెయ్యను?

ప్రయత్నించి శైలికి నునుపు తేగలరుగాని, వుద్రేకం హృదయంలోంచి అప్రయత్నంగా రావలిసిందే! మాటల్ని యేర్చికూర్చి, మన నేర్పుకి యితరుల్ని ఆశ్చర్యపడ చెయ్యగలంగాని, వాళ్లహృదయాన్ని ప్రజ్వలింప చెయ్యలేము. బాధపడాలి, నలగాలి, జీవిత రథచక్రాలకింద, కలంలోంచి నెత్తురు వొలకాలంటే! అక్షరాలా, పాండిత్యమా, కాదు. సంవత్సరాల మూగ వేదన, అంధకారంలో అన్వేషణ, నాబోటి దీన జీవుల రహస్యహృదయాంతర విషాదం, దిక్కులేని దుర్బలుల జీర్ణ ఆవేశం- ఎవరితోనూ చెప్పుకోలేని అధమపాత్రల గర్భశోకం- యిదీ నా శైలి!

"So clever—quite astonishing—over written—queer style—oh what pep!" అంటారు.

Pep! my dear critics, readers, admirers, and detractors, pep is life itself, poured out for you, from my very soul! అంటాను నేను.

నా భావాల్ని తోసేసే గట్టితనం లేక, వాటిని అంగీకరించే ధైర్యం లేక, నా వుద్రేక ప్రవాహంలో కొట్టుకుపోయి, ఎందు కింత impress ఐనామా అని ఆశ్చర్యపడి, విషయంలోవుండే వాస్తవ్యంవల్లనని వొప్పుకోక, ఆ effect ని శైలికి ఆరోపించి, శైలిని విషయాన్నించి విడతీసి, ఇది యీశైలిచేసిన యింద్రజాలం మామనసుల్లో యీకలవరం—కాని యీయనవాదంమాత్రం అబద్ధమని, మళ్లీ తమ మూఢత్వాన్నీ, భీరుత్వాన్ని, కాపిలించుకుని, కరిగినహృదయాన్ని రాయిచేసుకుంటారు. వీరికన్న కొంచెం వాఙ్మయ వీధుల్లో ఆరితేరిన శిరోమణులు, యేదో చమత్కారంచాత, చెప్పే నేర్పరితనంచాత వొప్పించాడే గాని — అసలు నాయికానాయకులున్నారే...... అని మూలుగుతారు.

---

శ్రీరూఢ స్వామిదగ్గిరికి హుబ్లీవెళ్లాము. నమస్కరించి కొబ్బరి కాయా పళ్లూ యిచ్చాము.ర—తలమీద చెయ్యేసి నయమవుతుందన్నా డు. అక్కడి ఆయనశిష్యులు ఆయన తలుచుకుంటే సాధ్యంకానిదేదీ లేదన్నారు. కాని యింతవరకు ఏమీ నయంలేదు. ఇది వొక Experiment. ఒక అనుభవం.

నేను ఏమీ భక్తిలేకండానే, ఉన్న సందేహాలతో వెళ్లానా, అయిన్నీ చూస్తే యేదో చెప్పలేని దిగులు కలిగింది. ఎప్పుడు ఆ స్థలంలోంచి నవ్వుతున్న లోకంలో బైటపడతానా అనిపించింది. ఆయన, యేదో నిస్సహాయంగా, వొంటరిగా, వున్నాడని తోచింది. ఆ ముఖంలో యేదో గొప్ప దిగులు, చాలా వున్నతమైన విచారం కలవాడివలె కనపడ్డాడు. ఇట్లాంటి యోగిని చూడడం ఇదే మొదటి సారి. ఇదే ఆఖరు.

నేను విశ్వాసంతో వెళ్లలేదు గనక, ర—కి జబ్బు తగ్గలేదని అంటున్నారు. ఇంక నేనేం చెయ్యగలను? లేనివిశ్వాసం ఎట్లాగా తెచ్చుకోడం అని ఆలోచిస్తున్నాను. చాతనైతే అదీ తెచ్చుకుందును.

దేనిలోనూ నమ్మకంలేక, యెవరితో ఏమతసంబంధం, బంధు సంబంధం, లేకండా బతకడం సులభమైన పనికాదు. అందువల్లనే గావును యీ మతాచారాల్ని అసహ్యించుకునే మనుష్యులుకూడా సంఘాన్నీ బంధువుల్నీ యెదిరించి వొదులుకోలేరు. ఒక్కొక్కప్పుడు, ఏదోవొకటి నమ్మగలిగితే యెంత శాంతి కలుగుతుంది అని ఆశపడ తాను. ఈ సందేహం యిలా పెద్దడౌటు నన్ను నిరంతరమూ తన శూన్యాగ్నితో కాలుస్తుంది. క్రీస్తులోనమ్మి, తప్పక మోక్షమిస్తా డని, నా స్నేహితులు మాట్లాడేప్పుడు, వీళ్ల క్షుద్ర సులభవిశ్వాసా నికి నవ్వూ చిరాకూ కలిగినా, వాళ్ల నిశ్చయ విశ్వాసాన్ని చూసి యీర్ష్యపడతాను. ఎంత సులభం జీవితం అట్లా గుడ్డిగా నమ్మగలి

గితే! కాని, ఇదంతా ఏమిటి? ఏది ధర్మం, ఎక్కడికి పోతాము, ఏమౌతాము? అనే సందేహాలు భరించడం ఎంతబాధ!

నీ భయాలు పోయినాయా యిప్పుడు? నేనూ హరీంద్రనాద్ కలిసి హిమాలయానికి పోతామనీ, గడ్డాలు పెంచుకుంటామనీ, బూడిద రాసుకుంటామనీ అప్పుడే బొమ్మలు చిత్రించావు. ఏం భయంలేదు.

అతనూ యోగికాడు, నేనూ రుషినికాను. ఈ ప్రపంచ బాధలకి మగ్గి, భరించలేక, మా సునిసితమైన నరాలవల్ల Sensitive అయి, వైరాగ్యం—శరణ్యమనీ, అట్లాతప్పించుకోవాలనీ ఆశపడతాం. తాత్కాలికంగా, ఈ సౌఖ్యాలతో, ఆనందాలతో తృప్తిపడక, శరీరానికి అతీతమైన ఆనందాలుంటాయని కలలు కంటాము. దేవుడు కూడా నాకు గొప్ప ప్రియుడివలె తోచేవాడే పూర్వం. ఆదేవుడి శక్తి, స్త్రీలల్లోగాని నాకు వ్యక్తం కాదే, నేను రుషిని కావడమేమిటి? నేను యోగినైనా బాలయోగినులతోటేగా నా యోగ సాధన! హిమాలయాలకి ప్రయాణమైన నిమిషాన, నీ దగ్గిర్నించి నువ్వు వొస్తున్నావని వుత్తరం వొచ్చిందా, ఏమవుతుంది నా ప్రయాణం? ఒక్కసారి నన్ను రావాలని నువ్వు తలుచుకుంటే హిమాలయారణ్యాల్లో వున్న గుహాంతరాళాల్లోంచి పెకలించుకుని బైటపడతాను, నీపాదాలవద్ద.

తినడమూ, మాట్లాడ్డమూ, డబ్బు కూడపెట్టుకోడమూ, వీటితో తృప్తిపడేవాళ్లు, ఏకలలూ లేకండా బతకగలరు. వాళ్లకి ప్రపంచంలో సమస్యలే కనపడవు. సందేహాలే వుండవు. తిండి దొరికిన గేదెమల్లే సంతోషిస్తారు. బురద దొరకని గేదెమల్లే కష్టపడతారు. అంతేకాని చుట్టూచూసి, చావుబతుకుల్నీ, నీతి దుర్నీతుల్నీ, సుఖబాధల్నీ, ఏమిటి? అని ప్రశ్నించరు. కాని ఏఅందమూ, ఆనందమూ; తృప్తినియ్యని మా అశాంతివల్ల, నిద్రనివ్వని సందేహాలవల్ల, ఎట్లానన్నా యీ ఆలోచనాశక్తి నశించిపోతే బావుం

దువనిపిస్తుంది. కాకినిచూస్తే యీర్ష్యనాకు. జట్కా అతన్నిచూసి 'ఎంత అదృష్టవంతుడు!' అనిపిస్తుంది. ఎంత సంతోషంలోవున్నా, సుఖంగావున్న నిమిషాల, మృత్యువు జ్ఞాపకంవొస్తుంది. సాయంత్రం ఉరిపడేవాడికి పొద్దున్న పొందే సుఖం ఏం ఆనందాన్నిస్తుంది! ఎంత సుఖపడితేనేం, ఎన్ని వ్రాస్తేనేం, ఎంతప్రేమిస్తేనేం - చివరికి రేపో ఎల్లుండో మరణం. అంతం. తరవాత—ఏమీలేదా? వుంటే మళ్లీ పుట్టక—అసలు ఉండకపోవడంకన్న భయంకరంగా తోస్తుంది. మళ్లీ పుట్టడం, మళ్ళీ పిల్లలమై ఎవరిచేతులోనో అసహాయులమై చిక్కడం, మళ్ళీ టీచర్లు, మురికి పలకలు, అక్షరాలు, దెబ్బలు—ఎందుకో ఇట్లా! చావులోకూడా యీ చిక్కులోంచి, maze లోంచి తప్పించుకోడానికి ఆశ లేదనుకుంటే, ఎంత మండి పోతుంది, భయమేస్తుంది! ఇదంతా ఏర్పరచిన భూతం ఎట్లానన్నా దొరికితే, ఆ Tyrant ని చంపి లోకాన్ని ఉద్ధరించాలనిపిస్తుంది.

మనని ఒక్క మృత్యువు తప్ప యేదీ వేరుపరచలేదనుకో. అదీ వేరుపరచలేదనే ఆశ పడతాను. చావంటే నాకుభయం, అసహ్యం. ఎందుకంటే నాకీ లోకంమీద అమితమైన ప్రేమ. మనుషులమీద కాదు: ఈ జీవించడం, చిత్రంగావుంటుంది. ప్రేమించడం అద్భుతంగా వుంటుంది. కాని వొక్కొక్కప్పుడు విసుగుపుడుతుంది. అప్పుడూ నిన్ను తలుచుకున్నంతమాత్రాన, నూతన వికాసమూ, తృష్ణా కలుగుతుంది. నీప్రేమే లేకపోతే నాజీవితం యింత సుందరంగా వుండేదా? విసుగు పుట్టినప్పుడు ఈలీల చాలు. అవతలికిపోయి, తెరవెనక యేముందో చూడాలనిపిస్తుంది. కాని పిల్లల్ని నిస్సహాయులుగా వొదలాలనీ, నీకంటికి నీళ్లు తెప్పిస్తాననీ—అంతే దిగులు. మళ్లీ నేను చచ్చిపోవడమేమిటి? నేనే లేకపోతే యీ సూర్యోదయమూ, యీ నవ్వులూ, భోజనాలూ, మోటార్లూ యిట్లానే జరుగుతో వుంటుందా, అని ఆశ్చర్యం వేస్తుంది. ఆత్మకి అంత అహంభావముంటుంది గావును?

బెంగుళూరులో నేనూ హరీంద్రనాద్ వాదించుకున్నాము. అతను గాంధీ గొప్పఅనీ. నేను టాగూర్ గొప్పఅనీ. టాగూరువుత్త "మూర్ఖుడు" అనీ, బీదవాళ్ళని ద్వేషిస్తాడనీ అన్నాడు. నేను గీతాంజలిలోంచి ఆయన బీదవాళ్ళతో యెంత ఐక్యమవుతాడో చూపించాను. అతను నవ్వి అదంతా "Literary exploitation of the poor" అన్నాడు. హడిలిపోయినాను. అంత enlightend man తో ఏం వాదించను :—ప్రయత్నించాను. చివరికి అతను "You have not sinned enough yet, go into the world, and sin much more." అన్నాడు నన్ను. బావుండలా?

రెండే గొప్ప మార్గాలు అన్నాడు—ఆత్మరాజ్యాధిపత్యమో—లేక లోకరాజ్యాధిపత్యమో! తక్కిన యీ టీచర్లూ ప్లీడర్లూ గా బతకడం వృధా అన్నాడు—భర్తృహరివలె. నాకూ అట్లానే అనిపిస్తుంది. కాని యీ రెంటికన్నా వుత్తమమైన స్థితిని నేను పొందాను. నీ హృదయరాజ్యాధిపత్యం. ఇంకేం కావాలి నాకు!

నువ్వు వ్రాసిన వుత్తరం హరీంద్రనాద్ కి పంపనా? నీ తిరస్కారం, నీ అపనమ్మకం. అతని మూఢనమ్మకాల్ని నువ్వు తిట్టిన తిట్లు! నీవుత్తరం చదువుతో వుంటే, నీరూపం కనపడ్డది నాకు. దూకుడు, కోపం, చిరాకు, నానిశ్చయాన్ని పగలగొట్టాలనే నీ విజృంభణం.

చాలా అవసలో వున్నాను. చుట్టూ పోట్లాటలు. చి—తో, హెడ్మాస్టరుతో, కుర్రాళ్ళతో, దాసీతో తగాదాలు భరించలేను. లొంగిపోయి శాంతిని తెచ్చుకోనా? నాగర్వం, self-respect, చంపేసుకుని, పడిపోనా? నన్ను చూస్తే, నేనే అసహ్యపడే స్థితికి రానా! కాని యిట్లా యెంతకాలం యుద్ధం చెయ్యను; ప్రతిచోటా ప్రతివాళ్ళతో, ఇంటో, బైట, స్కూలులో, రోడ్డుమీద—ఎన్నాళ్ళు? ప్రతిచోట ప్రతివాళ్ళలో అన్యాయం. నిరంకుశత్వం, అసహాయుల్ని పీడించడం—మనని అంటని అధర్మానికై యుద్ధం ప్రారంభిస్తే, యీ

లోకభారమే మనమీద పడుతుంది. ఇవిగాక నా ఆత్మలో ఆరాటం, ఈ శ్రమంతా యేంలాభమని సందేహాలు? పోనీ, యీయుద్ధాలకి అర్థమూ, ఫలితమూ వున్నాయనీ, ధర్మం జయిస్తుందనీ, రక్తం వోడ్చడంవల్ల, లోకం అభివృద్ధి చెందుతుందనీ, విశ్వాసమన్నా వుంటే యీ సమరం అనంతంగా సాగిద్దును. కాని అన్నీ సందేహాలే! నువ్వే నా దగ్గిరవుండి, నాకళ్లలోకినవ్వి, వేడెక్కిన నా నుదుటిమీద నీచెయ్యి వేస్తే! అదొక్కటే నా ఆశ! అదొక్కటే నా నిరాశ!

కాని నాస్కూలుసంగతి, నాపని దుర్భరత్వం సంగతి, తలుచుకున్నంత మాత్రాన కుంగిపోతాను. నీ ప్రేమకూడా స్కూలు ఆవరణంలోకి నావెంట రాలేదు. ఆపాఠాలు, ఆ మొహాలు! వొద్దు. నువ్వు రావొద్దు, అక్కడికి! వాళ్లని, ఆమొహాల్నికూడా హెడ్మాష్టర్లని కూడా ప్రేమించగల గొప్పతనం కలగకూడదూ నాలో! అది గొప్పతనమేనా? వాళ్లంత క్షుద్రత్వానికీ దిగడమా? ఎవరు తీర్చగలరు. నాసందేహాలని నీ నేత్రాలు తప్ప?

ఎప్పుడో నాకు మరీ వినుగుపుట్టి తెంచుకుంటాను నౌకరీతాళ్లని. రక్కే వోళ్లు బాగైతేనా! ఒక్కసారి యెగిరి—

off off, away, away, free, free from Schools —off into the clouds—Just you and I.

నిన్న—సాహేబు యింటికి వెళ్లాను. నిలువుటద్దాలముందు నుంచుంటే నువ్వు జ్ఞాపకం వొచ్చావు. ఆరాత్రి మనిద్దరం తలుపుకొట్టి ఆయన్ని లేపడం, ఆయన నవ్వుతో మనని ఆదరించడం, వెళ్లేప్పుడు మనం side by side ఆ అద్దాలముందు నుంచుని, ఒకరి నొకరం చూసుకుని, యిందాకణించి ఆ అద్దాలు మనని చూస్తున్నాయని సిగ్గుపడడం, ఎవరన్నా వొస్తారని నువ్వు బెదరి చూడడం— అన్నీ తలుచుకుంటే, ఎంతో విరహంకలిగి, కన్నీళ్ల పర్యంతమయింది. విచారంకాదు, అదేదో మాధుర్యంతోకూడిన బాధ!

శుక్రవారం — నిన్న చి — అనంతపురంనించి వొచ్చింది సామాన్లు తీసుకుని. నా పుస్తకాలు చదివిన హార్వెల్ అనే జడ్జి, ఆమె చేతికి ఒక వుత్తరం, యిచ్చి పంపాడు, నాకై. దాంటో నేను గొప్ప జీనియస్‌ని అనీ, నాకథలు గొప్ప యింగ్లీషుకథలంత బావున్నాయనీ వ్రాశాడు. నిజంగా గొప్పవే నేమో అనుకుంటాను. కలలు కంటాను. మరి యిక్కడ మనవాళ్లు యెందుకు అంతగా యిష్టపడరు? అనుకుంటే, నా ఐడియాస్ వల్ల షాక్ ఐ, బెదిరిపోయి, కథల్లోవున్న టెక్‌నిక్, నా వర్ణనలలో వుండే ఆర్టు, నాపాత్రలలో వుండే Delicate మాధుర్యం గమనించరు. విమర్శనాజ్ఞానం తక్కువ కావడంచేత తాముపొందిన సంతోషాన్ని శైలికీ, తాము పొందిన బాధని నా వికటత్వానికీ, ఆరోపించి వూరుకుంటారు.

దుమ్ముకొట్టి పాతబడి వాళ్లకి మామూలైనలోకం, నాకెంత అందంగా, అద్భుతంగా కనపడుతుందో, వాళ్ల మనస్సులకి సాధారణమైన బాధలు, నన్నెంత కలవరపెడతాయో, కష్టాల్లోవున్న స్త్రీలు, నాకెంత ఆప్తులవుతారో, వాళ్లకెట్లా అర్థమాతుంది?

The wonder of the world, I snare
In shining nets of love and song;

ఇదంతా నీకెందుకు? అసలు కథలూ పుస్తకాలూ అయిష్టం నీకు. అందువల్లనే, నాసారస్వతంవల్ల నిన్ను మెప్పించలేక, యితరులు మెచ్చుకున్నారని, నీకుచెప్పి, ఆవిధంగానైనా నీనించి గౌరవాన్ని పొందచూస్తాను.

నాబాధల్లో, నాసుఖాల్లో, కలిసి పెనవేసుకుని నాతో నా వూపిరిలో నివసిస్తుంది నీ ధ్యాస. ఎంత అంధకారంలోనైనా, నువ్వు అనే జ్యోతి కనిపించి నడిపిస్తోనే వుంటుంది నన్ను. ఈ విచారసాగరానికంతా తీరం నువ్వులాగుంటావు. ఈ సంతోషానికంతా

మాత్రం, అర్థం నువ్వే ! ఆ దేవుడే నీరూపమెత్తి, నా వెంటనంటి నన్ను వొదలక, ధైర్యమిస్తో నాకాలాన్నంతా సౌందర్యంతో, ధైర్యంతో నింపి, అవతరించాడు.

నావిచారాలూ, అన్వేషణలూ అన్నీ నీకు వ్రాసి నిన్ను కలత పెడుతున్నానా, నీమనసుని ? లేదు. నిన్నీగోలలన్నీ యేమీ అంటవు. నేనెంత వ్రాసినా నువ్వు నవ్వుతో "ఆదేవుడు వుంటేనేం, లేకపోతే నేం, మనకెందుకు పోనిద్దూ!" అని నన్ను మరిపిస్తావు. నేను యీ సందేహాలతో బాధపడుతున్నానే అని దిగులుమాత్రం పడతావు. ఎవ్వరితో యీ సంగతులు మాట్లాడకండా లోపలే మననంచేసుకుంటూనా, నీకైనా వ్రాస్తే, నీతో మాట్లాడినట్టే వుంటుంది. వ్రాస్తున్నంతసేపూ నీచల్లని చూపులు నాచుట్టూ ఆవరించినట్టే వుంటుంది.

నువ్వే నా విశ్వాసదేవతవు. నాకార్యాలకు కథలకు నీమీది ప్రేమే మూలసూత్రం. ఈశ్వరుడే వున్నాడని చెప్పుకుంటే; అతనే నిన్ను నాకు ప్రసాదించాడనుకుంటే, నీకన్న అతనిమీద యెక్కువ ప్రేమను చూపాలనే భయంవల్ల ఈశ్వరుణ్ణి దగ్గిరికి రానియ్యతలుచుకోలేదు. నీకన్న ఆనందమయినది, సుందరమయినది, నాకేమీ అవసరంలేదు. ఇట్లా ప్రాణమంతటితోనూ నిన్ను ప్రేమించగలగడం ఎంత అదృష్టం!

Real love, that outburst of the whole being, that internal ravishment, which turns the presence of the beloved into the boundary of the world and time, the supreme sensation, beyond which we can conceive nothing

చాలా అందమైన మాఘమాసంరాత్రి యిది. కథలువ్రాసే mood లో వున్నాను. సిఫిలిస్ జాడ్యాన్ని గురించి కథ వ్రాయాలని కూచుంటే యింతలో యూరేషియన్ పిల్లలు, నా స్నేహితులు వచ్చి, ఆడుకుందామని కాలవదగ్గిరికి లాక్కువెళ్లారు. వాళ్లల్లో

Patty అని ఒక అమ్మాయి వుంది. ఎందుకో నన్ను సేట్ అని పిలుస్తుంది. తనని చూస్తే నాకు యిష్టమని ఆమెకి తెలుసును గావును, రోజుకు పదిసార్లన్నా కంచెలోంచి దూకివచ్చి నన్ను లాక్కుపోతో వుంటుంది. నాచేత తనకిష్టమైన పనులన్నీ సులభంగా చేయించుకుంటుంది.

వాళ్లతో ఆడుకుంటోవుండగా, పాటకచేరికి వొస్తానన్న సంగతి జ్ఞాపకమొచ్చి, చేతులు పట్టుకు వేళ్లాడే, నా Patty ని చక్కిలిగిలిపెట్టి తప్పించుకొని పోయినాను. నా వాగ్దానాన్ని భంగపరుచుకోకూడదనే బింకం తప్ప ఏసంగీతం, నా Patty నవ్వుకన్న మధురంగా వుంటుంది? ఇంకా యీబ్రహ్మసమాజపు నియమాల influence పోలేదు నామీద. వొస్తానన్న మాత్రాన వెళ్లి తీరాలా! ప్రేమముందుకూడా నా నియమాల్ని భగ్నంచెయ్యడానికి నేను నిరాకరించడం నన్ను ప్రేమించే మిత్రులకు అర్థం కాదు, నీకుతప్ప.

పాటకచేరినించి వొస్తో, తోవలో, నువ్వువొచ్చి యింటిదగ్గిర వుంటావేమో ననుకుని, నడవలేక ఆగాను. నాపిచ్చిగాని, రైలుటయిమన్నా కాలేదే యెట్లావొస్తావు? అదిగాక రేపు రాత్రికద నువ్వు వొచ్చేది? ఏమైతేనేం నీవిషయమై ఆలోచించేప్పుడు నా కామన్ సెన్సు మాయమౌతుంది. కాని ఓరోజుముందు రాకూడదా? ఆ వూహకి నన్ను నేనే కోప్పడుకుని, యిల్లుచేరుకుని కథ వ్రాయడం ప్రారంభించాను. రాజమండ్రిలో గార్డియన్ అనే ఆమె నాకు ప్రత్యేకం ఒకానొక అవసరంలో నాకు చెప్పినకథ! నిజంగా జరిగిన సమాచారం! పదుకొండయింది. కాలు నిలవలేదు. లేచి స్టేషన్‌వేపు వెళ్లాను బళ్లన్నీ పరీక్షించుకుంటో. ఎందుకువెళ్లాను ? లేదని తెలిసికూడా, నువ్వురావని తెలిసికూడా! పురాతన కాలంనించి, ప్రియులు ఎందుకు వెతికారు? ప్రియులకోసం అసాధ్యమూ అసంభవమైన స్థలాల!

---

నిన్న రాత్రి నాపిచ్చికీ, ఆత్రుతకీ లోబడి వేళకాండే స్టేషనికి వెళ్ళకూడదని నిశ్చయించుకుని కథ దిద్దుకుంటున్నాను దీపంముందు. ఆ కథా ప్రయత్నంలో నువ్వు వొస్తున్నావనే సంతోషం కలిగించే బాధని మరచిపోవాలనే ఆశతో. ఆగంటలోనే మళ్లీ విరహం.

ఇన్ని నెలలు Wait చేసిన వాడికి యీ గంట భారమై పోయింది. రావేమో తీరా అని భయం! నిబ్బరం అమితమై పోయింది. వేళ దాటింది. స్టేషన్ కి ఒక్క పరుగు తీశాను, నామూర్ఖానికి నన్ను తిట్టుకుంటో. స్టేషన్‌లో రైలువుంది. గేటు తాళం వేసివుంది. చుట్టూ తిరిగి వెళ్లి రైలంతా వెతికాను. నువ్వు కనపడవు. ఏమైనావు? ఎంత తిట్టుకున్నాను! ఇట్లా, వుపేక్ష చేసిన నాకు బతకడానికి హక్కులేదు, రైలుకింద పడాలనిపించింది. బైటికివొచ్చాను. ప్రతిమనిషినీ పరీక్షి స్తాను. చీకటి, స్టేషన్ పక్కన, బళ్లలోపల. నీచీర ఏరంగుదై వుం టుంది? నీచీరలన్నీ జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించాను. ఇంటికి వెళ్లి వుంటావనే ఆశతో, Old horse ని తెగ పరిగెత్తిం చాను. 'ఏమిటా యీ తొందర? ఎంత ఆలస్యమైనా స్కూలుకి యిట్లా తోలడే,' అని ఆశ్చర్యపడి వుంటుంది. వరండాలో వెన్నెట్లో నాపక్కమీద, నువ్వు కూచుని, నాకోసం ఎదురుచూస్తో వుండడం నా కళ్లముందు తలుచుకున్నాను. లేవు. నాసైకిలుతోబాటు తటాలున నాగుండె ఆగింది. నుంచోలేక పోయినాను అక్కడ, ఆ శూన్య ప్రదేశంలో. Old horse ని అక్కడే పారేశి, తిరిగాను. మైళ్ళకి మైళ్లు ఆవెన్నెట్లో వొక్కణ్ణీ, నిర్జీవమైన వీధుల్లో పొలాల్లో, యేళ్ళ వెంబడి. నీ ప్రేమనీ, నాదౌర్భాగ్యాన్నీ తలుచుకుంటో.

తెల్లవారకట్ట అయింది. దూరాన కోడి అరుపు వినిపించింది. ఒకవేళ నువ్వువొచ్చి నాపక్కమీద నిద్రపోతూ వుంటావేమో! తొందరగా వొచ్చేశానేమో! రాత్రంతా నీదగ్గిర యెవరూలేరే! అని

అన్ని మైళ్లూ పరుగెత్తుతో, రోజుతో వొచ్చాను. ఇంటిపక్కనించి యింకో కోడి కూసింది, వెన్నెట్లోచల్లనిపక్క నన్ను చూసి యేడ్చింది. ఇప్పుడప్పుడే రావడానికి వీల్లేదని నువ్వు వ్రాసిన వుత్తరం యివాళ అందింది. నిన్న అందివుండకూడదూ? ఇంతవేదన తప్పివుండును. పన్నెండుగంటల బాధ! కాని రాత్రివరకు నేను పడ్డ మధురమైన ఆశా! అదీ పోయేదికద! ఇక్కడే వేదాంతులకీ నాకూ తగాదా! ఆ ఆశలో బాధ ఉందంటూరు వాళ్ళు! ఆ బాధలో ఆశ వుందంటూను నేను. ఆ ఆశా ఆబాధా అన్నీ తప్పించుకోమంటూరు వాళ్ళు! ఆ ఆశా ఆబాధా రెండూ కావాలంటూను నేను. ఆబాధలేకండా ఆ ఆశ నే అనుభవించే స్థితికి రావాలి లోకం. బైటి ప్రపంచం మారితేనేం, మనోప్రపంచం మారితేనేం? రెండూ మారాలి. రెండూ ఒకటేగా!

ఆదివారం నిన్నే తలుచుకుంటో, కన్నీళ్లతో దిండుని తడుపుతో ద్వేషంతో చంద్రుడివంక చూస్తో నిద్రపోయి అర్ధరాత్రిగావును లేచాను. రాత్రిలు వొంటరిగా మేలుకుని కూచోడం అలవాటైన నాకు, చంద్రుణ్ణి చూసి, తిథి లెక్కపెట్టుకుని, వేళ కనుక్కోడం మామూలైపోయింది. ఈరాత్రి, రూఢి ఐన నిరాశకన్న, నిన్నరాత్రి అనుమానమైన ఆశ యెంత ఆనందంగా వుంది! ఆ భయం, ఆ విరహం, ఆ వేదన! కాని యీనాటి నిరాశాగర్భంలోంచి చీల్చుకుని ఆశ తలచూపకపోలేదు. ఒకవేళ నువ్వు వ్రాసిన అభ్యంతరం యెట్లాగో తొలగిపోయి, బైలుదేరావేమో! చంద్రుడివంక చూసి, మళ్లీ గంటలు లెక్కచూశాను. పన్నెండు. రైలాలిస్యం కాకూడదా? నీజ్ఞాపకంతో, బాధతో, నరాలు లాగాయి. వేళ్లు వొంకర పోయినాయి, కాళ్లు పక్కమీద ఆనవు.

యెంకికి "కాళ్లు నేతులు

పక్కకంటుకొని పోయినాయి."

మొగవాళ్లకి విరుద్ధం గావును?

ఇటూఅటూ కొట్టుకున్నాను. ఏదో యెవరిమీదో కోపం. నీమీద అనుకుని నవ్వుకున్నాను. నువ్వు రాలేని కారణం వ్రాశావు. ఎంత ప్రయత్నించినా, నామీద ఎంత ప్రేమవున్నా, యీవొక్క రాత్రికోసం, నీజీవితమంతా ధ్వంసంచేసుకోడానికి పూనుకుంటేనే గాని, నువ్వు రావడానికి వీలులేదని నాకు తెలుసు. ఇంక యెవరి మీదకోపం? దేవుడిమీద నమ్మకంవుంటే, పాపం నాకోపాన్ని అతనినెత్తిన పారేశేవాణ్ణే, మనవాళ్లు కర్మమీద పారేశినట్టు.

రావు నువ్వు. రాత్రిగడియలన్నీ యిట్లా యెదురుచూస్తో కూచుంటాను నేను. గీతాంజలిలో పాట జ్ఞాపకం వొచ్చింది.

"బీద అనాథ బాలికని. యిట్లా నీడలో కూచుని కాచుకొని వుంటాను. రోడ్డుపక్కన చెట్లనీడలవెనక కనపడక దాక్కుంటావు నువ్వు."

నా ఆలోచనలలో తెల్లవారింది.

---

సోమవారం - ఈ దత్తమండలపు యెండకాలపు గాలి, నీ వేళ్లవలె నా చంపల్ని తాకి విరహాన్నెక్కువ చేస్తోంది. నామీద జాలి తలచిందేమో? ఏంలాభం? విరహపడేవాణ్ణి, యింకో స్త్రీ తాకి వోదార్చగలదా? "నీ ప్రియురాలు కఠినురాలు. నేను కాను." అంది నాతో. తోటలో బంతిమొగ్గలు యింకా తెరుచుకున్నాయో లేదోనని వెతుకుతూంది శీతాకోక చిలక.

పగలు యీవరండాలో మనం దగ్గిరిగా కూచోడానికి వీల్లేదు. పోనీ నువ్వు కనపడితే చాలదా అనిపిస్తుంది, నువ్వు దూరాన వున్నప్పుడు. అంతే. కాని నువ్వు రాగానే ఆ తృప్తిని అప్పుడే మారుస్తాను. తుపాను ప్రారంభం. చిన్నప్పుడు, —ణ నన్ను, "ఇంటి వాకిట్లో కొంచెం కూచోమని చోటిస్తే చాలు, యిల్లంతా తిరుగుతాడు." అనేది.

కథ పూర్తి అయింది. పత్రికకి పంపాలి. దీన్ని చూసి మొర పెడతారు గావును, దుర్నీతి అని. ఒకాయన వ్రాస్తున్నాడు—నా కథల్ని చదివితే, యువకులు, పవిత్రమైన సున్నితమైన ప్రేమనుమరిచి, కామాంధులౌతారట! వీళ్లకి, యీ యువకులకి, పవిత్రమైన సున్నితమైన ప్రేమవుంటేగా, మరిచేందుకు! పెద్దవాళ్ళు కట్టిన పిల్లల్ని గదుల్లో అడ్డదిడ్డంగా అభ్యంతరం లేకుండా, హక్కులాగు, ఆక్రమించుకుని భుక్తపరుచుకునే యీ యువకులట! సున్నితమైన ప్రేమట! ప్రేమా లేదు, మోహమూ లేదు, అంతా కామంతోనే ప్రారంభం? ఆకామం చచ్చి మనమల్ని కన్నతరవాత, వాంఛలుడిగింతరవాత ప్రేమ మొదలు యీ విమర్శకుడి యువకులకి! పవిత్రమంటే ఆయన అర్థం భార్యతో—నన్నమాట! భార్యఅంటే అర్థం, తండ్రి వరించింది అన్నమాట! గర్భాదానంనాటి పెళ్ళికూతుళ్ల రోదన ధ్వనులు విని వుంటే, "సున్నితం" అర్థమవుతుంది. ఎక్కడో కోటికి వొకర్తు

ఉంటారు. ఆవోక్కర్నీ భరిస్తున్న యీ కోటీ సిగ్గుపడకండా, డాబులు కొట్టుకోడం చాలదూ, ఆపవిత్ర్రప్రేమకి వుదాహరణం !

సినీమాలలో చేరుతున్నారు, హక్కులకోసం పోట్లాడుతున్నారు, వివాహాలు విచ్ఛేదాలైపోతున్నాయి, శాస్త్రాలనీ, నీతుల్నీ బహిరంగంగా దిక్కరిస్తున్నారు. కాని యీ పత్రికల్లోని నీతిపరులు మాత్రం, కళ్లమూసుకుని నిద్రపోతో, "నీతి, నీతిచెడిపోతోంది యీకధలమూలంగాన" ని పలవరిస్తున్నారు.

కిందటివారం—హుబ్లీవెడుతో తుంగభద్రని రైలులోంచి చూశాను, వెన్నెట్లో నది మెరుస్తోంది. సరిగా మనం స్నానాలుచేసిన చోట, నీళ్లల్లో మెల్లిగా తేలి నదిమధ్య రాళ్లమీద కూచోడం, నీనించి నేను దూరంగా యీదితే, భయమేసి నువ్వు నన్ను వెనక్కి పిలవడం, నీలపు నీటికింద నీ తెల్లనిచేతులు—సాగేనడుం, అవతల వొడ్డుననే మళ్లీ నృత్యం—అంత అందం—ఎట్లాంటి రోజులవి! భోజనమే దొరికితే, రాత్రులు భయమే లేకపోతే, అక్కడే ఆనీళ్లమధ్య, రాళ్లమీద, వొడ్డున, ఆచెట్లనీడలక్రింద బతుకంతా గడపమా, వొచ్చిపొయ్యే రైళ్లనీ, వాటిల్లోని మనుషుల చిరాకు బతుకుల్నీ, చూసి నవ్వుతో! బ్రిడ్జికింద వెన్నెట్లో గలగలమనే నీరు నన్ను గుర్తించి, నీవేమైనావని ప్రశ్నించినట్లేవుంది. ఎంతోసేపు మనసు కలతపడ్డది, ఆరాత్రి, రైల్లో, నిద్రపట్టిందాకా.

మనకి నిలవనీడ లేదు. ప్రియులకి స్థలంలేదు యీ లోకంలో. కలుసుకుని కూచునేందుకుకూడా చోటుదొరకక, టీషాపుల్లో, రైలుపెట్టెల్లో, తోటల్లో, కాలవలవొడ్డున యెండల్లో, చిన్నచెట్ల పిచ్చినీడకింద, రగ్ గుడారంకింద, ఎన్నివూళ్లల్లో, ఎన్ని వుపాయాలు పన్ని, ఎన్ని అపాయాల్లోంచి తప్పించుకున్నాము ! చివరికి శ్రీ—రి యిచ్చిన చిన్ని స్థలం, హోటలు, గది, పైగా ముగ్గురం—ఉదయానే ఆమె నవ్వు, భర్త ధుమధుమలు, మనం ఆమెకి బోధించడం, ప్రోత్సాహం, మళ్లీ ఉదయానే మళ్ళీ నిరాధారులమై తిరగడం—ఎంత గొప్ప

రోజులు అవి! అర్ధణా రొట్టెమీద రోజంతా యిద్దరం—భోజనానికి మూడుమైళ్ల బ్రిడ్జిదాటడం, మనంత దిక్కుమాలిన కుక్కపిల్ల వొకటి—గుడిశలో బతుకు, ప్రేమ భరింపరానిదై భయంతో దాక్కోడం—ఎట్లాంటి రోజులు!

---

నువ్వు పంపిన చిన్న ఫోటో నన్ను ఎన్ని తిప్పలు పెడుతోంది? నీమెడని చూసినకొద్దీ అందాలు తోచి ఆశపెడుతుంది, కాని నా పెదవి కొనకన్నా అందదుగద! ఈ ఫోటో ఎవరన్నా నాదగ్గర చూసి, నా జీవిత రహస్యాన్ని, నా ఆనంద సూత్రాన్ని, తెలుసుకొంటారని భయం! కాని వొదలలేను. నా పర్సులో దాచుకున్నాను. ఏ ధనముతోనూ విలవ కట్టడానికి సాధ్యంకాని నిన్ను, యీడబ్బులమధ్య దాచాను. ఆ పర్సు జేబులో పెట్టుకొని నీకు గాలి ఆడకండా చేస్తున్నానని దిగులుపడతాను. టాగూరు ఒక గీతంలో ఒక స్త్రీ ఆమెనాథుడితో యిట్లా అనేట్టుచేశాడు—

"ఇదేంకానుక! ఆభరణంకాదు, పువ్వులుకావు. పెద్దకత్తి నిచ్చావు. నేను దీన్ని ధరించడానికి వీల్లేదు స్త్రీని గనక. దాచడానికి అలివికాదు. ఇదేం వరం?"

అట్లావుంది నాసంగతి.

ఎప్పుడూ ప్రతి నిమిషమూ నీ ధ్యాసతో నాహృదయం తపిస్తోవుంటుంది. ప్రతి పనీ ప్రేమకు అర్హతగలదేనా అని యోచించి పరీక్షచేసుకుంటూ ఉంటాను. ఈప్రేమ జీవనం ఎంత కఠోరమయినది!

Love is a terrible thing
For there is a flame that has blown too near,
And there is a name that has grown too dear,
And there is a fear.
And to the still hills and cool earth and far sky
I made a moan,
The heart in my bosom is not my own!

Oh! would I were free as the wind in the wing;
Love is a terrible thing!

ఎన్నాళ్ళకి నిన్ను మళ్లీ చూడటం? చూసినా రెండురోజులు, మళ్ళీ ఎన్ని నెలల వియోగం? ఇంతే నాజీవితమంతా! పోయినసారి నిన్ను కలుసుకున్నప్పుడు అన్నానే అంతేనేమో యీ జీవితాంతం వరకు? ఇట్లానే రాత్రులంతా పక్కలమీద వొంటరిగా పడుకొని వుత్తచేతుల్ని శూన్యంవేపుకు జాచి జాచి శుష్కించి మరణించడంలోనే అంతమా? విముక్తి ఏ వృద్ధాప్యంలోనో వస్తుందేమో? అప్పుడు ఒకరి కెదురుగా ఒకరం కూర్చుని, గడిచిపోయిన యవ్వన కాలం సంగతి తలుచుకొంటూ, ఆనాటి నవయవ్వనులు ప్రేమలో విహరిస్తోంటే, చూపుపోయిన కళ్లతో వాళ్లని చూసి మనం వొదులుకొన్న ఆనందానికై దిగులు పడుతో కూర్చుంటాం గావును! కథల్లో విడిపడ్డ ప్రియుల్ని యిరవైయేళ్ల తరవాత మళ్ళీకలిపి సుఖంగా ప్రేమగా కాలం గడిపారని వ్రాసి, సంతోషాంతం చేశామని తృప్తిపడతారుగాని, అంతకన్న చిన్నప్పుడే మృత్యువుతో త్వరగా అంతం చెయ్యడం తక్కువ విషాదాంతం కాదూ? కాని యీ నాడు మనం సాహసించి ప్రేమకోసం విధికి యెదురు తిరిగి మనని కట్టివేసే బంధనాన్ని తెంచుకుంటే వరదలయ్యే రక్తం మనని ముంచి వూపిరాడకుండా చంపి వెయ్యదా? ఈ కలలు కూడా మిగలవేమో! సులభంగా లేచిపోయినారనీ, లేచిపోగలరనీ, లేచిపోయి సుఖపడరనీ కష్టపడ్డారనీ నేను కథలు వ్రాశానన్నమాటేగాని, ఏమాత్రం మార్దవమైన హృదయమున్నవాళ్ళయినా, యితరుల కన్నీళ్లలోంచి నడచి స్వసుఖాన్ని పొందగలరా? నిజంగా అట్లాంటిపని ర——వంటిది చేసినప్పుడు ఎంత Heroine! అని అభినందిస్తుంది గాని నామనసు, హృదయం మాత్రం ఇంక ఆమెకు జీవితంలో ఆనందం Possible అవుతుందా అని సందేహిస్తుంది. కాని యితరుల్ని ఏడిపించడానికి నేను వెనకకితీసినంత మాత్రాన అట్లా ప్రేమకోసరం లక్ష్యం చెయ్యని ధీరుల్ని విమర్శించడానికి హక్కు వుంటుందా?

జీవితమే యింత! సుఖపడాలంటే పశువులన్నా కావాలి. దేవతలన్నా కావాలి. అంతేకాని మనబోటి మధ్యరకం వాళ్ళని, కొంచెమో గొప్పో హృదయం వున్నకొద్దీ, రసికత్వం కళాభిరుచీ హెచ్చయినకొద్దీ, జీవితం యేడిపిస్తుంది యెక్కువగా. ఆబాధ మనని ఉన్నత స్థలానికి తీసుకపొయ్యే ప్రయత్నమో ఏమో మరి నాకు తెలీదు.

ఏదో వింత సుందర ప్రపంచాల కలలు కని వాటికోసం కళ్లు తెరిచి పరిగెత్తిస్తుంది. దోవలో చీకటిచేసి యే గోతినో, యే యెడారినో కల్పించి వుంచుతుంది మనని పడెయ్యడానికి. పడగానే మన వెర్రితనాన్ని, అసహాయత్వాన్నీ చూసి నవ్వుతూ చప్పట్లు కొడుతుంది విధి. ఏదో 'గోల్' వుందా? లేక అంతా ఈ యెండమావులేనా? ఈ రొమాన్సు, ఆర్టుమీది ప్రేమ, ఆదర్శాలు—ఇవన్నీ బంధనాలమధ్య పనిచేసే యీ మనసు కల్పించుకున్న మాయలా? మనసునే ఆవరించిన జాడ్యాలా? లేక ఔన్నత్యాలా? ఊర్ధ్వలోకాలకు సోపానాలా?

వర్షాలకి ఈ వూరిచెరువు కట్టలఅంచువరకు నిండింది. మధ్య నిండుచంద్రుడు ఆడుతున్నాడు. కాని నా హృదయంమాత్రం యెండి బీటలుబారి అరుస్తోంది. నువ్వు, నీ దయ ఏఆకాశపు అంచులలోనూ ఉదయించదు.

Come, Oh, Come!
Come with your sweet-speaking lips!
Come with your soft-pulsing heart!
Come with your kind-loving eyes!
Come!

నిన్న వాకిట్లో ఎవరిదో బండి ఆగింది. నువ్వేమోననుకుని బయటికి పరిగెత్తి వెర్రిగా చూశాను. ప్రతిదీ నువ్వేననిపిస్తుంది. నీ. రాకే ధ్వనిస్తోవుంటుంది చెవుల్లో. రాధప్రేమా, శ్రీరాముడి

వియోగమూ, చదివితే అదంతా కవి అతిశయోక్తులని నవ్వు వొచ్చేది. నిజంగా ప్రేమతో వెర్రెత్తితే అప్పుడు తెలుస్తుంది; వాస్తవంతో పోలిస్తే ఆ వర్ణనలు వెర్రికావని. టాగూరు గీతం జ్ఞాపకం వొస్తోంది. టాగూరు కవిత్వం యీ బొమికల్లోకి యెక్కింది. బ్రహ్మసమాజమూ, దేవుడూ, భక్తీ నన్ను వొదిలి పోయిందాకా ఒక ఐదేళ్లు టాగూరు కవిత్వం తాగి బతికాను. ఆయనవ్రాసిన భక్తి నన్ను వొదిలినా కవిత్వం వొదలలేదు.

"వొస్తున్నావు; దగ్గిరగా వొస్తున్నావు; దినదినమూ, నిమిష నిమిషమూ వొస్తున్నావు- ఈ వానచినుకుల్లో, ఈ వసంతమారుతంలో, ఈ లేయెండలో...నీపాదాలచప్పుడు వినపడుతోంది." అంటాడు. భక్తులకి ప్రేమగీతాల్లో భక్తి గోచరిస్తుంది. నాకు భక్తిగీతాలలో ప్రేమ గోచరిస్తుంది.

శకునాలూ, భయాలూ వుంటాయనే మరిచిపోయిన నేను— నువ్వు నీ ఫొటో సంగతి వ్రాస్తో " There is a shadow before me " అని వ్రాశావా, ఆమాటలు చదివి వొణికిపోయినాను. చూడు, ప్రేమ మనుష్యుల్ని ఎంత వెర్రివాళ్లని చేస్తుందో !

నిన్న సాయింత్రం నేనూ పిల్లలూ వి—ని చూడ్డానికి వెళ్ళాము. ఎంతో ఆదరంగా గౌరవంగా భక్తితో ఆహ్వానించింది నేను జీసస్ క్రైస్టు ఐనట్టు. ఎందుకో తెలుసా? నువ్వు నాసంగతి ముందే చెప్పావుట. ఏం చెప్పావో! పిచ్చిపిల్లా! నీకు అంత గౌరవమూ, ప్రేమా నామీద వుంటే ఇతరులకీ కూడా అట్లానే చెపితే! ఆ గౌరవమంతా నీ హృదయంలోదే నని అనుకోక, ఆ గొప్పతనమంతా నిజంగా నాలోవుంది అనుకోదా ఆమె నీమాట నమ్మి? ఇవాళ యిట్లా పూజించిందా! అంత అందమైన ఆమె పూజించడం చూసి నేను గర్వపడ్డానా? కాని యేంలాభం? రేపు ఫూల్లో నామీది నిందల్నీ, కోపాల్నీ, నా కథల్నిగురించీ విని నువ్వూ నేనూ కలిసి తనని మోసంచేశామని కోపించి మాట్లాడడం మానేస్తుంది.

కి—తో స్నేహం మానెయ్యమన్నావా? ఒక వారంముందు నీ వుత్తరం వొస్తే మానేసివుందును. కాని ఇప్పుడు నా స్నేహం కాదు నా సహాయం కావాలి ఆ అమ్మాయికి. అవును; కొంచం అపాయం వున్నమాట కూడా నిజమే. నువ్వు భయపడతావని నీకు వ్రాయలేదు. కాని ఇప్పుడు వెనకతీస్తే నామీదే నాకు గౌరవం పోతుంది. అవును. అపాయం యెక్కువగా పెరగవొచ్చుననీ వొప్పుకుంటాను. కాని ఆ అమ్మాయి గతికి ఆమెని వొదిలి నన్ను దాక్కోమంటావా? నీ కేమిబాధ కలిగిస్తానో అనే నా దిగులు, నాకేం సంభవిస్తుందోనని కాదు. ఇంక ఇతరులకి చేసే సహాయం యేమిటి ప్రతివాడి బెదిరింపులకీ జడిస్తే? నాకోసం కాదు ఈ సాహసం. స్త్రీ కన్నీటిని చూసి భరించగల రాతినో, పురుషుడి దౌర్జన్యానికి భయపడే పిరికివాణ్ణో, నా సౌఖ్యమే చూసుకునే స్వార్థపరుణ్ణో ఐతే నీ ప్రేమకి ఎట్లా అర్హుణ్ణవుతాను? మనస్వభావాన్ని లోకం కళ్ళముందునించి దాచగలముగాని ప్రేమ కళ్ళముందునించి దాచలేము. Love is blind అంటారుగాని True loveకి ఉన్నంత తీక్ష్ణమైన చక్షువులు ఎవరికీ వుండవు. నీమాటే విని, నీభయాలకే నేనూ వొణికితే, చివరికి నీ ప్రేమ నామీద నిలవదు. అంత క్షుద్రుణ్ణవుతాను. పురుషుల ఆజ్ఞలకు ఇట్లా లోబడేగా స్త్రీలు తమ సహజ సౌరభ్యాన్ని పోగొట్టుకుని దాంతో పురుషుల ప్రేమనిగూడా భస్మం చేసుకునేది!

ఇదే వాంగ్మయంలోనూ జీవితంలో కూడా సమస్య! అనర్హుణ్ణి ప్రేమించడం ఉదారమా నీచమా? ఇదే పతివ్రతలతో నా తగాదా. దీక్షితులుగా రంటారుగదా భర్తలు నీచులయినా వాళ్ళని ప్రేమించడం గొప్పకాదా! అంటారు. గొప్పేమీ కాదు. అదోకరకం మనుష్యులు. ఆ గుణం ఏమీ గొప్పగుణం కాదు_ విచక్షణలేకుండా ప్రేమించడమంటాను నేను.

తరువాతకథ ఇంక నీతో జరిగింది నిజం చెప్పేస్తాను.

ఆ అమ్మాయిని వారంరోజుల క్రిందట ఆమె తురకప్రియుడు నెత్తురు కక్కుకునేటట్టు కొట్టాడు. మంచంమీదనుంచి లేవలేని స్థితిలోవున్నాననీ, నాతో పనివున్నదనీ, తప్పకుండా రమ్మనీ కబురు పంపింది. నేను రాకండా అతను కావిలి వుంటున్నా, అపాయానికి జంకక, ఏమి అవసరమోనని నేను వెడితే మాట్లాడదు. చివరికి_నేను వెళ్లబోతే,

“మిమ్మల్ని చూచి చాలా రోజులయింది. చూడాలనిపించింది. కబురు పంపాను. పని వుంటే చీటీ వ్రాశేదాన్నే! ఇట్లాంటి అపాయంలోకి మిమ్మన్ని రప్పిస్తానా? అంతమాత్రం గ్రహించలేక పోయినారా?” అని కన్నీళ్లు పెట్టుకుంది. దెబ్బలుచూపి ఏడ్చింది. పోలీసు రిపోర్టు చేస్తానంటే వొద్దని బతిమాలింది. ఆలోచించగా, నా సహాయం అసలేమీ అక్కర్లేదనీ, మొదటినుంచీకూడా నాతోస్నేహం, నాస్వేచ్ఛనీ, నే నిచ్చే స్నేహానికిది వొక మిష అనీ అనిపించింది. అందుకని మళ్ళీరానని చెప్పి వొచ్చేశాను. రెండురోజుల తర్వాత నేను యింటికి వెళ్లే తోవలో రోడ్డుమధ్య మార్కెటు దగ్గర సాయంత్రం అడ్డంగా నుంచుని నా Old Horse ని ఆపింది. ఆమెకి అందమే కాక, యీ మొగవాళ్ళని, అందులో taste rowdy plane లోవున్న మనుషుల్ని యీగల్లాగ ఆకర్షించే శక్తివుంది. నా అనుమానం పురుషహృదయాల్ని ఆకర్షించే Art ని conscious గా study చేసిందని. ఆమె సెక్సుజీవితం పదోయేట ప్రారంభం. అందుకోసమే పుట్టిందనిపిస్తుంది ఆమె జీవిత చరిత్రవింటే. నేను సైకిల్ దిగగానే మా చుట్టూ గుంపు మూగారు. నేను ఈ వూరికి కొత్త గనక నాకు తెలీదుకాని, ఆమె అందరికీ పరిచయమనుకుంటాను. ఆమె యేమీ మాట్లాడలేదు. వూరికే రెండు నిముషాలు నా వంక చూస్తో నుంచుని,

“మిమ్మన్ని చూడాలనే ఆపాను. ఇంక వెళ్లండి” అంది. ప్రతి సాయంత్రమూ ఇంతే. సైకిల్ దిగకూడదనుకున్నాను. చెయ్యి కూడా సైకిల్ కి అడ్డంగా చాచింది.

కొత్తగా వొచ్చినా, ఒకరితో మాట్లాడక పోయినా, యీ గోలతో వూరికంతా పరిచయుణ్ణి అయినాను. నన్ను వున్నయింటో నించి పొమ్మంటారేమోనని అనుమానంగా వుంది. ఎందుకంటే కి___ రెండుసార్లు యింటికొచ్చింది. ఎందుకు రానిచ్చావని వ్రాస్తావేమో? కాని రావొద్దనడం పిరికితనంగా తోచింది.

ఇదీ యింతవరకు జరిగిన సంగతి. ఇంక ముందు ఏంజరగబో తుందో తెలీదు. నువ్వేమనుకుంటున్నావో, నాకోసం ఎంత ఆదుర్దా పడుతున్నావోనని, దిగులు పుడుతోంది. కాని నన్ను వెనకతియ్యి మని వ్రాయకు. దీవించి యుద్ధానికి పంపు. సు___కూడా ఈసంగతి విని, నన్ను ఆ వ్యవహారం వొదులుకోమని బ్రతిమాలుకోడానికి వచ్చారు. 'లోకంలో దీనస్త్రీల నందరనీ రక్షించగలవా'? అన్నారు. కాని తెలిసిన స్త్రీ, నాసహాయం అడిగిన స్త్రీ, నా సహాయంవల్ల ఉపకారం పొందుతుందని నాకు అనిపించిన స్త్రీని, ఎట్లా వదల గలను ?

ఈ గోలలు పోనీలే. ఈ డిశంబరు రాత్రిలు యెంతో దీర్ఘంగా కనపడతాయి, నువ్వు లేనందువల్ల. పగలు యేదో పనులలో గడుస్తుంది కాని.........

అందరూ సుఖంగా నిద్రబోయే కాలమంతా నేను మేలుకుని కూచుంటాను నిన్ను తలుచుకుంటో, బయిట తిరుగుదామంటే చలి. వొచ్చే నెలలో నిన్ను చూడగలనేమో అనే ఆశను పట్టుకుని వేళ్ళా డుతోంది మనసు. నేను వొంటరిగా ఇట్లా కూచున్నప్పుడు ఆకా శపు లోకాలకేసి చూస్తోవుంటే నిశ్శబ్దంలో ఎట్లాగో నా ప్రేమ ఎంతో విశాలమయిందిగా తడుతుంది. ఈ విరహబాధని యీ రాత్రిలో కలిపెయ్యాలేనా అనుకుంటాను. ఎప్పుడో మనకు అదృ ష్టమే ఉదయమైతే మేలుకున్న యీ నిశ్శబ్దమైన కాలమంతా ఎంత గొప్పగా కనపడుతుంది ? కాని నువ్వు వొచ్చినప్పుడు నిన్ను చూడ గానే ఇదంతా మరిచిపోయి నీకళ్లనీ జుట్టునీ తాకుతో, నీ మాటల్ని

వింటో తన్మయుణ్ణవుతాను. నువ్వూ, నీ శరీరం, నీ చక్కని చేతులు మాత్రమే కనపడతాయి. ఇప్పుడు నువ్వు యీ భూమికీ ఆకాశానికీ మధ్యప్రదేశాన్నంతా కప్పే ఆత్మవి. నువ్వు వొచ్చినప్పుడు నిన్ను యీ దేహంలో యిముడ్చుకుని ఆనందించాలని చూస్తాను.

ఇట్లా కూచుని రాత్రి తిరిగిపొయ్యే రాశిచక్రాన్ని చూస్తే మళ్లీ ఎన్నో తారీఖు అని ప్రశ్నించుకుంటాను. ఇంతలోనే ఎన్నో దినాలు గడిచినట్టు—మనసు తొందరతో, నా హృదయ వాంఛా శక్తితో లోకపు కాలచక్రాన్ని ముందుకు తిప్పి వొచ్చే నెలని దగ్గిరికి తీసుకురాలేనా ? కాలం మనసుసృష్టించుకున్న మాయ అంటారే శాస్త్రజ్ఞులు ! మరి నా మనసు యింత తొందరపడినా మారదేం కాలం ?

ఎప్పుడో అకాత్తుగా నేననుకోనప్పుడు వెనకాలే వొచ్చి నువ్వు

"ఎవరు వో" రంటే !—

ఈలోపల—

All other things to their destruction draw :
Only our love hath no decay !
This no tomorrow hath, nor yesterday ;
Running, it never runs from us away,
But truely keeps his first last everlasting
day.

ఎంత మాట వ్రాశావు? నువ్వేనా వ్రాసింది అని ఆశ్చర్యమేస్తోంది? నీ హృదయంలోంచే వొచ్చిందీ? అంత కఠినమైన ఆలోచన! లేక వూరికే నన్ను ఉడికించడానికి వ్రాశావా?

"నా చేతుల్లోంచి నిన్ను లాక్కుందా?" అన్నావు. నీ చేతుల్లోంచా? లాక్కోడమా? ఎవరితరం? ఎట్లా లాక్కుంటారు? ఆలోచించు. ఎట్లా వీలవుతుందో!

నిజంగా అట్లా అనుకున్నావా? నిజంగా నీకాభయం తోచిందా? అట్లాంటి భయాలకు అతీతురాలవు కాదా? నన్ను కి___ లాక్కుందే అనుకో. అదే నిజమైతే, నాకీ వుత్తరం ఎందుకు! నేనెవరు; యింక? కి___ నన్ను లాక్కోగలిగితే, కి___ని నేను నన్ను లాక్కోనిస్తే, ఇంక నీ ప్రేమకి అర్హుణ్ణెట్లా అవుతాను? అంత క్షుద్రుడికోసం నువ్వు దిగులుపడ్డడమెందుకు?

నిజంగానే బాధపడ్డావా నా___! ఆ మాట చదివినప్పణ్ణించి నాకింకో ఆలోచన లేదు, నీకు నావల్ల అంత బాధా భయమూ కలిగాయే అనే దిగులు తప్ప! కొంచెం గొప్పగాకూడా వుందనుకో, నీనించి యింత ఆదుర్దాకి పాత్రుణ్ణైనానుకదా అని! ఎందుకంటే నిన్ను చూస్తే నాకంత పూజ్యభావం. నువ్వు నన్ను ప్రేమించడం తటస్థించడమనేది యీలోకం పుట్టినప్పణ్ణించి జరిగిన అసాధారణ కార్యాల్లో మొదటిదిగా కనపడుతుంది, ప్రతిసారీ తలుచుకున్నప్పుడల్లా!

ఈ వుత్తరం నీకెప్పుడు చేరుతుందా, యెప్పుడు నీమనసుకి ప్రశాంతి కలుగుతుందా అని తత్తరిల్లి పోతున్నాను. ఈ అక్షరాలేమాత్రం చెప్పగలవు? 'Writing to a woman one loves after several days' separation is like

talking to her without seeing her eyes; it is like uttering words, the echo of which escapes us in the creature we idolise.' నా వేళ్ళలో పొంగే రక్తపు వేడి యీ కౌగిలితం యేమాత్రం తీసుకురాగలదు నీదగ్గిరికి! నామాటలతో చూపులతో, నా చేతులతో నీకు నా సూన్యతాన్ని తెలియ చెయ్యాలి. నిన్ను నమ్మించాలి. అంతేకాని—

ప్రత్యుత్తరంలో నువ్వు 'నమ్మను' అని వాస్తేమాత్రం నాకు సంతుష్టి కలుగుతుందా, నీకళ్లల్లో ప్రత్యక్షంగా నమ్మకాన్ని చూడగలిగితేనేగాని! ఇంకా ఆ చిటికినవేలిని నోటిచివర పెట్టుకుని, గడ్డాన్ని చేతిమీద ఆనించి కిందికి చూస్తోనేవుంటే—నేను భరించగలనా?

ప్రేమా! ఆమెమీద నాకు ప్రేమా? ఎందుకు ఆమాటని, పవిత్రమైన ఆమాట విలువని దహించేస్తావు? నిజమే. ఉత్త స్నేహంకన్న ఆమె నాకు సన్నిహితురాలే అయింది; నిజం దాచలేదే నీనించి? ఎట్లా దాచగలను? నువ్వు అర్థం చేసుకుంటావనుకున్నాను. అవును. అర్థంచేసుకున్నావు. చేసుకోగల ఔన్నత్యం వుందినీలో. కాని ప్రేమని ఒక్కసారి కదిలించి స్థిరపరుచుకునేందుకు అట్లా నిందించావు నన్ను; ఒక్కసారి నన్ను ఆరాటపెట్టి ప్రేమవిజయం చెయ్యాలని. అవునా? ప్రేమపోయిందని హాస్యమాడావు. కాని నిజంగా అనుకుంటావా? నేను వూహలోనైనా తలుచుకోలేను నన్ను సందేహిస్తావని.

అవును. ఆమె అందం నాకళ్లని చెదరకొట్టింది. కొన్ని విషయాల్లో ఆమె నీ కన్న చూపుల్ని చెదరకొడుతుంది. ఆమె sex ఆకర్షణ అతి తీవ్రమైనది, భయంకరమయింది. sex అనేది లేనట్లు నవ్వేసే నీకు, పురుషుణ్ణి తాకితే అపవిత్రమౌతుందా అన్నట్టు కనపడే నీ సౌజన్యానికి, దేహసంబంధం చాలా అల్ప విషయంగా చూసే నీకు, ఎట్లా అర్థపరచగలను? నాలో Lower Levels ఉన్నాయి.

సింహాలూ, కోతులూ, పిచ్చికలూ, కుక్కలూ, నా పూర్వీకులందరూ యింకా రక్తంలో ఆడుకుంటూనే ఉన్నారు.

అంతేకాదు. అందాన్ని చూస్తే ఆకర్షణలేని మొద్దునూ కాదు, దేహసౌందర్యంలో విశ్వ సౌందర్యాన్ని చూడగల రుషినీకాను. అందువల్లనే యిట్లా తప్పటడుగులు వేస్తో, తిప్పలుపడతాను. నిజంగా, నేను కి—న్ని కామించి సుఖించి యితర ఔన్నత్యాలకు కళ్ళు మూసుకునే అంధకారంలో పడ్డా, అప్పుడూ నువ్వు తత్తరపడ కూడదు. నీ ప్రేమ అప్పుడూ జయించాలి.

కి—artist ఆర్టిస్టు. ఈ sex విషయంలో. సాధారణులైన స్త్రీలకి యీ కామ ఔన్నత్యం గొప్ప కళానైపుణ్యాన్నిస్తుంది కొందరిలో. పురుషుణ్ని ఎట్లా రంజింపచెయ్యాలో, ఆమెకి నైజంగా తెలుసు, పైగా స్టడీచేసి నేర్చుకుంది. ఈసంగతి తెలిసికూడా ఆ మాయ హస్తాల్లో మోసపోవడం యెంత ఆనందకరమని! అట్లాచూస్తే, మనసులో తెలుసుకుని కూడా యీ ప్రపంచపు మాయాదేవి హస్తాలకు యింద్రజాలం అనుభవించేందుకు మనం హృదయాలను ఒప్పచెప్పడం లేదా?

కి—అర్ధరాత్రిలు చీకటి గది కిటికీలోకూచుని ఆమెవొళ్లో అనుకున్న నాకళ్లలోకి అస్తమించేదూరపు వెన్నెల వెలుగులో చూస్తో, నాచంపలమీద చేతులేసి, ఆమె బాధల్నీ, అనుభవాల్నీ, క్రూరులైన ప్రియుల్నీ, నిజమో అబద్ధమో, కథలుచెపుతో వుంటే, నన్ను!, కథలు కల్పించే నన్ను!, చదివేవారిలో నా యిష్టంవొచ్చిన feelings rouse చెయ్యాగలనన్ను, తన చిత్తంవొచ్చిన feeling లోకి తీసుకుపోయి, తనజుట్టు కప్పినంతసునాయాసంగా కళ్లుమూసి సుఖింప చెయ్యాకలిగేది. ఎందుకు చెపుతున్నానంటే, నేను ఏ ఆకర్షణకి లోబడ్డానో అది నీకు తెలిసేందుకు. ఆమెకికాదు—ఆమెలో art కి కళకి, ఆమె సౌందర్యానికి, వశ్యుణ్ణయినాను. అయితే దేహసంబంధమంటావా; అది దేహాలున్నంతవరకు, పూర్తిగా మనసు

దేహాన్ని జయించనంతవరకు తప్పదనుకుంటాను—భీరులకూ నపుంసకులకూ చాదస్తులకూ తప్పు! ఆమె మాట్లాడుతో వుంటే, వణికేవాణ్ని, ఏడ్చేవాణ్ని—కోపంలో పళ్ళుకొరికేవాణ్ని— ఇంతలో ఆమె నామీద జాలితలిచి కాబోలు కథా, కంఠమూ, మార్చేది. నా కళ్ళు తుడిచి, దగ్గరికి లాక్కునేది. నవ్వేవాణ్ణి, తలని శాంతంగా వాల్చేవాణ్ని, మళ్లీ కథ మొదలు—స్థంభితుణ్నై వింటూ తెల్లార్లూ అట్లా కూచుంటాను.

ఇంతైనా, నువ్వు ఆమెతో నా పరిచయాన్ని 'ప్రేమ' అని పిలిస్తే, మన స్నేహాన్ని యింకోపేరుతో పిలవాలి. అయితే యింక యీ మానుష భాషలో మన స్నేహానికి పేరులేదు, భూమికి సంబంధించని వాతావరణపు భాషలో వుంటుంది ఆ పదం, ఆ దివ్యపదం అదేదో.

నీ చేతుల్లోంచి నన్నెవరు తీసుకోగలరు? మరి యింతమంది మిత్రులూ పనిమీద వొచ్చేవారు. వారందర్ని గురించి వ్రాస్తున్నాను కదా, చూశావుకదా, నువ్వెన్నడూ యిట్లా భయపడలేదే! ఇప్పుడెందుకు? నేను అపాయాల్లోకికూడా ఆమెకోసం దిగడానికి సంసిద్ధుణ్ని ఐనాననా? కాని యిదివరకు మాత్రం? నీకు జ్ఞాపకం లేదూ?

నాకు తెలుసులే ఇదంతా నీలీల, ప్రేమాలింగనంలో, నువ్వు నాకు వొద్దుసుమా, అని తోసేసి గట్టిగా కావిలించుకోమూ అట్లానూ.

ఈ స్త్రీలమీద కోపగించి లాభంలేదు. నువ్వు తొందరపడి ఖండించక. నీకోపం నాకర్థమవుతోంది, ఆమెమీది దూకుడంతా, నీ అక్షరాల్లో చదివాను.

When you love anyone greatly it does not seem of such consequence what he has done; it is the sins of those we don't love enough which are unforgivable.

వామీదకన్న ఆమెమీద నీకు కోపం రావడం సహజం. కాని యీ సాధారణ సహజత్వాన్ని అతిక్రమించాలి నీవంటివారు. అవును యీ స్త్రీలెవరూ మన admiration కి తగరు. కాని వాళ్లకష్టాలు, వాళ్లమీది యీ పురుషుల దౌర్జన్యం యీ సంఘ క్రౌర్యం! ఎంత దయతలిచినా యింకా చాలదు. ఎన్ని లోపాలన్నా క్షమించవొచ్చు మనం. వాళ్ల దుర్మార్గం, నీచత్వం, చంచలత్వం, అంతా ఎట్లా క్రమంగా వారి చుట్టూ, యీ సంఘు బుద్ధిహీనత్వంవల్ల అంధత్వం వల్ల, ఆత్మశూన్యత్వంవల్ల అల్లుకుందో సులభంగా చూడవొచ్చు. లోకం తోబాటు, మనబోటివాళ్లుకూడా, వాళ్ళ యడల impatient ఐతే వాళ్లగతి యేమిటి? లోకం యేపాపాన్నన్నా క్షమిస్తుంది గాని, స్త్రీనించి యీ పాపాన్ని క్షమించదు. అందులో బైటపడ్డ వాళ్ళని, వాళ్ళ శరణు చొచ్చునివాళ్లని, యెదిరించిన వాళ్ళని చీల్చి చూస్తుంది.

నువ్వు కోరే వాగ్దానాన్ని యివ్వలేను. ఇవ్వను. ఆమె నా సహాయాన్ని కోరిందా, నేను నిరాకరించను. అపాయమా! రానీ, నేను వాగ్దానమిచ్చింది ఆమెకి కాదు, నా ఆత్మకి, నీకు. ఆ వాగ్దానం తప్పితే నా దృష్టిలో నేను నీచుణ్ణి, నీ ప్రేమకి అనర్హుణ్ణి అవుతాను.

టాగూర్ యీశ్వరుడి గీతంలో 'నువ్వు విహరించే ప్రదేశం గనక నా మనసుని అబద్ధాలనించి తొలిగించి వుంచుతాను' అని వ్రాశాడు.

అట్లానే నేను "నిన్ను ప్రేమించేది గనక నా హృదయాన్ని ఉదారంగా వుంచుతాను" అంటాను. నేను అల్పుణ్ణయితే, నా ప్రేమే అల్పమవుతుంది. వూరికే, ప్రేమ, ప్రేమ, అని వాడేస్తారు కాని, ఆధ్యాత్మికవిద్యకన్న కఠోరమైనది యీ ప్రేమదీక్ష. ప్రేమాగ్ని మనుష్యహృదయాన్ని కాల్చడం ప్రారంభించిందా, యెంత పవిత్రము, నిర్మలంగా మారుతుంది సాధారణ హృదయం! ప్రేమా—

Love! Do I love? I walk

Within the brilliance of another's thought,
As in a glory. I was dark before
As Venus' chapel in the black of night;
But there was something holy in the darkness,
Softer and not too thick as other where;
And as rich moonlight may be to the blind,
Unconsciously and consoling. Then Love came,
Like the out-bursting of a trodden star."

నువ్వు వొస్తేనా? రావొద్దు. ఇప్పుడు నేను వొక్కర్తెనే గనక జాగ్రత్తగా తప్పుకుంటున్నాను, యీ అపాయాల్లోంచి. నువ్వు వొస్తే, నిన్ను, నాకన్న అమూల్యమైన నిన్ను, ఏ ఆపదలోకి లాగుతానో అనే భయం—భరించలేను ఆ ఆలోచనని.

"ఆమెని ఆమెగతికి వొదిలెయ్యి. నీకెందుకు?" అని ఎంత క్రూరంగా వ్రాశావు? అంత మార్దవమైన నీ హృదయంలోంచి యింత కఠోరత్వం యెట్లా జన్మించిందో! నామీద ప్రేమ, నాకోసం ఆదుర్దా, అట్లా మార్చివుంటాయి నిన్ను తాత్కాలికంగా. ప్రేమకి అట్లా 'రైట్' కావాలి. సహజమైన సుగుణాల్ని కూడా అతిక్రమించాలి అవసరమైనప్పుడు. ప్రేమ, వూరికే మాటలంటారు, "లోకమంతా నీకోసం వొదలగలం." యిట్లాంటి మాటలు, అవన్నీ అబద్ధాలని అనేప్పుడే తెలుసు మనుషులకి.

To relinquish the whole world for love is a meaningless phrase, since no one posseses the whole world, or even a small portion of it. It may sound heroic, but it is simply hysteria.

చివరికి సమయం వొచ్చేప్పటికి దుర్గుణాలు పోనీ, సుగుణాన్ని కూడా వొదులుకోరు ప్రజలు, ప్రేమకోసం.

నేను నీకు వ్రాస్తున్నానన్నమాటే గాని, వ్రాస్తున్నంతసేపూ పక్కన నా హృదయం.

"ఎందుకు వ్రాయడం! ఈ వెర్రిమాటలు వ్రాసి ఏం ప్రయోజనం? నువ్వు అనుభవిస్తున్న విరహం, నువ్వు జ్ఞాపకం తెచ్చుకుంటున్న మాధుర్యం ఏమాత్రమన్నా ఆమెకి తెలియజెయ్యగలవా, యీ అక్షరాలతో?" అని నిరుత్సాహపరుస్తోంది. మనం కలిసివుంటే మాత్రం, నిన్ను చూస్తోవుంటేమాత్రం నా హృదయంలో కలిగే సౌందర్యభావం, ఏమిచేసినా తృప్తిపడని ప్రేమాగ్నిని నీకు తెలియ చెయ్యగలనా? అప్పుడు మాత్రం? ఆలోచించగా, ఆలోచించగా, నాలో యీ ఆనందాల్ని, ఉద్రేకాల్ని, ఆత్మ విశాలత్వాన్ని ప్రేరేపించడానికి నువ్వు నిమిత్తమాత్రమనీ, యీవిశ్వ సౌందర్యమే, నాకళ్ళకి అందని యీ సృష్టిప్రేమభావమే, నామీద కరుణించి, నీ రూపాన సాక్షాత్కరించిందనీ తోస్తోంది. నేనూ నీకు అంతే నేమో! నీకు తెలియచెయ్య గలిగితేనేం, లేకపోతేనేం, నా హృదయానందమే, నా ప్రేమ మాధుర్యమే, అవి నేననుభవించ గలిగాననే విషయమే ముఖ్యం. ఈ అనుభవాలు, ఎంత ఉన్నతమైనవీ, ఎంత సన్నిహితమైనవీ, తృప్తినియ్యక, నిద్రపోనీక, తృప్తిలో అతృప్తిలో, అనుభవంలో విరహంలో, ఆలింగనంలో వియోగంలో, అన్నిటిలోనూ అమితమైన మాధుర్యంలోకూడా యీ బాధతో, యీ నిరంతరాగ్నితో, ఏదో తెలియని ఆశతో నిరాశతో, వాంఛతో యింకా వేధించడం చూస్తే, యివన్నీ యింకా దూరంగా వుండే దేనివైపో చూపే చిహ్నాలవలె arrow marks వలె తోస్తాయి. అదేదో తెలీదుకద! ఈ ప్రేమాన్వేషణం అంతంలేని, అవధిలేని, నిరంతరమైన యాత్రకాదుకద! అర్థమూ ఫలితమూ కూడాలేవా?

ప్రేమించినవారి స్నేహాన్ని అందాన్ని అనుభవించడమే, ఆ ఆనందమే ప్రేమకు అవధి, తృప్తి అని నమ్మాను చాలాకాలం. కాని అనుభవించినకొద్దీ, అనుభవంలో జనించే అశాంతిని పరీక్షించినకొద్దీ, ఎంత అందాన్ని కావిలించుకున్నా ఇంకా కావాలనే తృష్ణని తలచుకున్నకొద్దీ, నా అల్పత్వం, అసహాయత్వం నన్ను వెక్కిరించి, ఇంకా గాఢంగా ఈ సమస్యలకు అర్థాన్ని ఇంకా ఆకాశపు అంచు

నాలో వెతికేట్టు చేస్తున్నాయి. మనసు అలిసి puzzle ఐ, బాధ పడుతుంది. సందేహించడమూ, వెతకడమూ, మనసు స్వభావమే కాని, ఈ సమస్యలు తేలేవికావు అనిపించినా, అన్వేషించే గుణాన్ని ఈ మనసు మానుకోలేదు సముద్రంలోకి ఎంత ప్రవహించీ విసుకు చెందని నదివలె, ఎట్లాగో రహస్యాన్ని తెలుసుకోగలననే నమ్మకాన్ని మనసు వొదులుకోదు.

నువ్వు నన్నిట్లా ఆకర్షించి యీ ప్రపంచంలోని తక్కిన ఆనందాలన్నిటికీ వ్యర్థుణ్ణి చేశావు. నా చుట్టూవున్న ప్రజలు సుఖంగా బతుకుతో, మాట్లాడుతో నవ్వుతూవుంటే, "ఆమెని చూడకండా వీళ్ళెట్లా దిగులు లేకండా తిరుగుతున్నారు?" అనుకుంటాను, ఏమీ తోచదు. దేంట్లోనూ కుతూహలంలేదు. 'ఏమిటా యీబతుకు?' 'ఎందుకీబాధ?' అని ప్రశ్నించుకుంటే, 'ఆమె లేదుగా' అని అంతరాళంలోంచి జబాబు వొస్తుంది. కాని నువ్వు లేవు గనక ఆ బాధకి కారణం నీమీదా విధిమీదా పారేశానేమో కాని, యీ అశాంతి నాలోపుట్టిన జాడ్యం కాదుకద! అనిపిస్తుంది అప్పుడప్పుడు. ఎందుకంటే నువ్వువున్న ఆకొంచెం దినాలలోకూడా, అనేకవిధాల శరీరంలో, మనసులో, ప్రేమలో, నా అతృప్తిని నువ్వు ప్రశ్నించావుకాదా? నీప్రేమజ్యోతిముందు, యీ స్వల్ప సౌఖ్యాలు, భోజనం, విశ్రాంతి, కీర్తి, మిత్రులు, సినీమాలు, యితర స్త్రీలు, సృష్టి అందం—అన్నీ నిస్సారంగా నిష్ఫలంగా తోస్తున్నాయి. ఏం చెయ్యను? ఎట్లా గడపను అర్థంలేని యీ నిర్జీవ దినపరంపరలను?

---



నువ్వు నిశ్చయించినట్టు, మూడురోజులనించి అర్థంకాని యీ శ్లోకాలని భద్రంగా కాపీచేస్తున్నాను. కాని తలయెత్తినప్పుడల్లా, నాకళ్ళు యీ నీలం ఆకాశం మీదపడి, మనసు చెదిరి, నన్నెవరో పిలచినట్టయి, కలం క్రిందపారేశి వెర్రిగా చూస్తాను. మనకి కనపడకుండా యీ ఆకాశమంతా, యీగాలిలో, మబ్బులమీద దేవకన్యలు విహరిస్తో, మనని చూడమని స్వరంలేని కంఠాలతో పిలుస్తోవున్నారేమో! సముద్రంలోంచి వొచ్చి ఒక్కరాత్రి ప్రేమనిచ్చిపోయిన నాగకన్యకోసం దుర్భరమైన నిరాశా విరహంపడే వాడిమల్లే, వూరికే దేనికో తెలీనిదానికోసం వెతుకుతాను ఆకాశాన్ని, ఎవరో సగం కనబడిపోయినట్టు, కొంచెం పిలిచి మబ్బుచాటున మాయమైనట్టు! ఈ జగత్ సౌందర్యదేవత ఇన్ని రూపాల ఆరాటపెడుతుంది గావును మనసుని_ తనని గుర్తించిందాకా! కాని యీ జన్మకి నీ రూపాన అవతరించింది నాకు ఆమె. నువ్వే దగ్గిరవుంటే, యీ ఆకాశగానాలు వినడానికికూడా నాకు వ్యవధి వుండదు. ఈ ఆకాశాన్ని వెతికే నా చూపుల్లో నిరాశ యింక కనపడదు. అందుకేనేమో తన్మయుణ్ణై, నీలో సర్వము మరుస్తాననేనేమో, నిన్నింత దూరాన వుంచుతుంది విధి!

ఈ శ్లోకాల్లోని విసర్గలూ ధాతువులూ అన్నీ మరిచి అటు యిటు చూసి, మళ్లీ నీ ఆజ్ఞ అని జ్ఞాపకంచేసుకుని ఆకాశ ఆహ్వానాల్ని దూరంచేసుకుని వ్రాయడం ప్రారంభించినా, యీ అల్లరి పవనుడు వెనకాలేవొచ్చి కావిలించుకుని, నా హృదయాన్ని అల్లరిపెట్టి, నాధ్యాసల్నీ, నీ శ్లోకాల్ని చిందరవందర చేసిపోతాడు.

"ఏం చేస్తున్నావు, మూర్ఖుడా, యిట్లాంటి అందమైన ఉదయాన?" అని అడిగి నవ్వుతాయి దిక్కుల్ని యీ శ్లోకాలు నీఆజ్ఞవల్ల ఎంత ఆకర్షకమైన అర్థాల్ని పొందాయో తెలీక.

"ప్రేయసి ఆజ్ఞ" అంటే నేను,

"ఏది నీ ప్రియసి? ప్రేయసేవుంటే పుస్తకంలో తలపెట్టి వంకర గీతలు గీస్తో కూచుంటావా, దౌర్భాగ్యుడా!" అంటారు, వీళ్ళందరూ.

"ఏం జవాబు చెప్పను?" నువ్వు అనే తలపు లేనిది యీ సృష్టికంతా, యీ అందానికంతా, యీ గాలికి కాంతికి అర్థంలేదని ఎట్లా చెప్పను?

మా బడికి శలవిచ్చినట్టే, యీ సంక్రాంతికి యీ మబ్బులకీ శలవ లిచ్చినట్టున్నారు. తెల్లగా విచ్చి పరుచుకున్న యీ మేఘాలు పనీ పాటా లేక, యిటూ అటూ తిరుగుతున్నాయి. ఈ పూరిపండగ ప్రజలు ఆ చెట్లకింద తిరుగుతున్నట్లు, సంతోషోత్సాహంలో; వీటికి ఒక తోవా, ఒక గమ్యస్థానమూ లేవు. ఆడుకుంటున్నాయి, గాలి యెటువీస్తే అటు పరుగులెత్తుతో; ఆకారాలు మారుతాయి. తెలుపు కొంచెం నీడలోకి. నీడలు మిరుమిట్లు గొలిపే వెండిలోకి, అనేక వంకర్లలో, 'కర్వు'లతో (curves) ఒకటి ఇంకోదాన్ని కలుసుకోవాలని, ముడుచుకుని, చాచుకుని దగ్గరగా జరుగుతుంది_ ఏదో సంకోచిస్తో హృదయంలోని గాఢ ప్రేమని భరించలేక, మెల్లిగా దగ్గిరిగా జరిగే ప్రియుల ముఖాలవలె. కొన్ని చిన్నవి, నీళ్ళలో మంచువలె, స్వచ్ఛమైన గాలిలో చూస్తోవుండగా కరిగిపోతాయి. చూస్తున్నంత సేపు మార్పేవుండదు. ఒక శ్లోకంవ్రాసి తలెత్తేలోపల ఆకాశమంతా కొత్త పటంగా మారివుంటుంది. నా నెత్తిమీద కొమ్మలమీదినించి రాలే పండుటాకులు_ వారంకింద కిందపడి శుష్కించిన ఆకులుసహితం యీ గాలిలో యిటు అటూ పరిగెత్తుతున్నాయి, యీ వసంతోత్సవంలో మేలుకుని. నాహృదయం మాత్రమే, నువ్వులేని విచారంతో కదలదు. నవ్వదు. నిన్ను, యీ సంస్కృత అక్షరాల్లో, నీ గ్రేస్ ని, వెతుకుతో యిట్లా కూచున్నాను. ఎక్కడనించో యీవసంత రుతు పరిమళాలు, అవ్యక్తమైనవి, యీ రక్తంతో మాట్లాడి నరాల్ని

యిటూ అటూ లాగుతున్నాయి. ఈ భూమిలోంచి పుట్టిన యీ దేహం, యీమనసు ఆజ్ఞల్ని మీరి, కట్టేసిన లేడివలె గుంజుకుంటుంది; ఈ ఋతు శబ్దాల్ని విని, యీ ఆకాశపు పరిమళాల్ని ఆఘ్రాణించి. ఎంత జడులై పోవాలి ప్రజలు- ఆఫీసుల్లో దుకాణాల్లో, ఫ్యాక్టరీల్లో పనిచేస్తో యీసృష్టిమార్పుని feel కాకుండా పనిచేస్తారు కద! ఎంత దూరాన్నించో మామిడిపూతలూ, వేపచిగుళ్లూ, హృదయాన్ని పిలుస్తున్నాయి, తమని కలవమని, కాని ఎంతో దూరానకూడా యేమీ ఆశ కనపడని నేను, ఏం కానుకను తీసుకురాగలను యీ వసంత దేవతకి ?

రేపు బడి తెరుస్తారు. ఇట్లా చెట్టుకింద కూచుని ఆకాశాన్ని చూస్తో, నిన్ను తలుచుకుంటో విరహబాధ పడుతోనే, వెర్రికలలు కనే అదృష్టంకూడా వుండదు. ఆ చీకటి దుమ్ముగదుల్లో, ఆ నిర్భాగ్యులు కోతుల్లాగు బల్లలమీద వేళ్ళాడుతూవుంటే, అరగని సుద్ద ముక్కలతో, లేని కోపపుచూపులతో, అన్యాయపు loss of stipend భయాలతో, నాకూ వాళ్లకీ ఎవరికి అక్కర్లేని మూర్ఖపు నిర్జీవ విషయాన్ని వాళ్ళ మెదళ్ళలోకి యెక్కించాలి. 'డ్యూటీ' ఇంత అసహ్యమూ దుర్భరమూ ఎందుకు ఐపోయిందో నాకు? "సోమరి నా? పని యెగగొట్టే మనిషి నా!" అని నన్ను నేను తిట్టుకుంటో Smiles సైసెల్పుని పఠించుకుంటో, బుద్ధి చెప్పుకుంటో, యీరాళ్లకావిడి బుజాన యెత్తుకుంటాను. ఎంతదూరం? ఎంతబరువు! ఎంతకాలం?

"కాదు ఈపని నీదికాదు. నువ్వుతగవు. నువ్వుకవివి. ఆర్టిస్టువి. కనక నే నీకీబాధ" అని వోదారుస్తుంది హృదయం.

"కాదు ఇదంతా పని యెగవేసేయెత్తు; నీ సోమరి తనాన్ని సమర్థించుకోడానికి, నువ్వు కల్పించుకున్న excuse ఎక్స్‌క్యూజు. తక్కిన టీచర్లు సంతోషంగా పని చెయ్యటంలేదా? నీకే మొచ్చిందే? నీకధలు, నీకలలు, నీ ప్రియురాలు, నీ విరహం, అన్నిటినీ మరిచి సరిగా పనిచెయ్యి, వూరికే జీతమిస్తారా?" అని కోప్పడుతుంది అంతరాత్మ.

"ఎట్లానూ పనితప్పదు. పైగా యీ యేడుపెందుకు? నోరు మూసుకుని లోబడక?" అంటుంది వివేకం.

"ఈ బాధైనా లేకండా, ఆచదువుల్నీ, డ్యూటీనీ, కాయితాల్నీ, రూపాయిల్నీ, ప్రేమించి, యీ మామూలు ధర్మాలలోకి లొంగావా, నీఆత్మ నశిస్తుంది. జాగ్రత్త. ఈబాధ అనే రాపిడితో నీఆత్మకి నిరంతరం మెరుగుపెడుతో వుండకపోతివా, నువ్వుకూడా, నీ చుట్టూ కనపడే నిర్జీవశవాలలో వొకడివైపోతావు" అంటుంది ఆకాశవాణి.

నువ్వు లావవుతున్నావని వ్రాశావు. ఈసారి (ఎప్పుడో-ఎన్నాళ్లకో) నిన్ను చూసినప్పుడు నువ్వు లావుగా కనపడితే, నేను యిష్టపడనని నీ భయమా? లావువాళ్లనిచూస్తే నాకు యిష్టంలేదుగాని (ముఖ్యం ఆడవాళ్లని- రామ్మూర్తితో మన discussion చర్చ జ్ఞాపకంవుందీ?)—ఎందుకంటే, జీవితంతో పూర్తిగా సంతుష్టిపడి, యేచింతలూ, ఆశయాలూ లేక, కొవ్వు పూయించుకున్న మనుషులనిపిస్తుంది. కొంత యీర్ష్యయేమో కూడానూ? లావువాళ్లు కష్టాలుచెప్పుకుని యేడిస్తే నేను నమ్మను. కాని, కాని- నువ్వు!!! నువ్వు లావైతేనేం, సన్నమై చిక్కిపోతేనేం? నువ్వు యేవరంవల్లనో రంభ అంత అందంగా ఐతేనేం, శాపంచాత కురూపి వైతేనేం? నా ప్రేమ మారదు. నీరూపాన్నా, నేను ప్రేమిస్తోందీ? నిన్ను! నిన్ను! నిన్నే! ఈ శరీరంతో సంబంధంలేని నిన్ను నేను ప్రేమిస్తున్నది.

మొన్న మీవూళ్లో క—నిన్ను చూసిందిట; నాతోవొచ్చి-

"ఆమె ఏమీ అందంగాలేదు. ఆమె కళ్లు పెద్దవికావు. ఆమె జుట్టు నొక్కులులేదు. ఆమెకోసమేనా; ఆమె వుత్తరంచూసేనా, నువ్వు నన్ను మరిచిపోయి అంత పరధ్యానంలో పడేవాడివి? ఆమె పేరెత్తితే నామీద ఏహో గొప్పగా మండిపడేవాడివి? ఆమె కోసమేనా?" అని నవ్వింది.

నువ్వు, అందంగా లేవుట! సౌందర్యానికై పిచ్చెక్కిన నా చూపులు, ఎన్నో అందమైన నగ్నశరీరాల్ని కావిలించుకున్న నా

చేతులు, ఎందరో రసికులు వాంఛించి పొందలేనివాళ్ల స్నేహాన్ని పొందిన నా హృదయం- అన్నీ నాఅనుభవాలు, వాంఛలు, స్వప్నాలు అన్నీ ఎన్నడో ఒక్కసారి నిన్ను కలుసుకోడంతో సఫలమౌతాయే ......నువ్వు అందంగా లేవుట! ఈ ఆకాశమూ, పద్మాలూ, సముద్రం చాలా అందంగా కనపడని మనుషులున్నారు మరి!

క—కి అంతకన్న యెక్కువ ఉదారత్వాన్ని ఎట్లా ఆరోపించగలను?

మొన్న రాత్రి స్థానం నరసింహారావు వొచ్చారు అకస్మాత్తుగా. చాలాసేపు మాట్లాడుతున్నాను. ఇంతలో నండూరి సుబ్బారావుగారు వొచ్చారు. ఇద్దరూ పాడారు రాత్రి షన్నెండింటివరకు. అందువల్ల నీకు నిన్నరాత్రే వుత్తరం వ్రాయలేక పోయినాను. నారచనలు నాకు తీసుకువచ్చిన లాభాల్లో యిదివకటే, నేను అడక్కుండానే నాతోటి ఆర్టిస్టులతోటి స్నేహం. వాళ్ళు వెళ్లారో లేదో, ఇంతలో మల్లిక్ కారులో వొచ్చాడు, ఇంక నిద్రయేదీ?

పదిహేను రోజులనించి, నువ్వు, నాకు వుత్తరాలు పరధ్యానంలో, మనసు ఎక్కడో పెట్టుకుని వ్రాస్తున్నట్టుతోస్తుంది. ఇంత కాలపు యెడబాటువల్ల నేను మరుపుకి వొస్తున్నానా? ఏదైనా బాధా? ఇంట్లో చిక్కులా? అదీగాక యీలోకం మెల్లిగా, యీ మామూలు మర్యాదలు బంధువులు, respectability, రెస్పెక్టబిలిటీ, నిన్నుకూడా, మెల్లిగా నానించి లాగేస్తున్నాయా? కాకపోతే నన్ను మరిచి పోగలవా అనుకుంటాను. ఎందుకంటే యీవిడిపోయిన కాలం యెక్కువవుతున్న కొద్దీ నాకు నీ మీదిధ్యాస, కోర్కెకూడా యెక్కువవుతాయికద! స్త్రీ హృదయం హేమవిధమా? నీరులేక మొక్క యెండిపోయినట్టే, దేహాలు కలుసుకోగలిగితేనేగాని, చూసుకోనన్నా చూసుకోగలిగితేనేగాని ప్రేమ నిలవదా?

చిత్రాంగి నాటకం ఆడాలి రమ్మని డాక్టరు అహోబలరావుగారు కబురు పంపారు. చివరికి నాకో ఉత్తరంకూడా వ్రాశారు. నమ్మలేక, నేను,

"మీరేనా వ్రాసింది? ఇది మీ దస్తూరేనా? లేక ఎవరిచాత నన్నా వ్రాయించారా?" అని వ్రాశాను; ఆ దస్తూరి, నాదస్తూరి అంత వంకరగా ఉండడంచాత.

ఆయనే వ్రాశారని పెద్దమ్మాయిగారు వ్రాశారు. ఎందుకంటే, నువ్వు డాక్టరుగారిని ఎరగవు.

"ఈ కార్డూ కవరూ ఇంత చవకగా పెట్టారేమిటో, బుద్ధిలేని గవర్నమెంటు- ఒక్క రూపాయి ఖరీదు పెట్టకూడదూ! ఇంతమంది వుత్తరాలు వ్రాసి, జవాబులు వ్రాయమని వేధించకుండా వుండే వారు?" అంటారు ఆయన.

ఆయన్ని ఆమె ఎవరికన్నా ఉత్తరం వ్రాయమంటే,

"ఆపనేదో చెప్పదురూ ఆవూరువెళ్ళి చేసుకొస్తాను ఉత్తరం వ్రాయడం నా చాతకాదు" అంటారు.

చిత్రాంగి నేను వల్లనవెయ్యవలిసి వొచ్చింది; మాస్టరు ఎంత చంపినా, బెదిరించినా, రెండు పంక్తుల పద్యాల్ని వప్పచెప్పడం చాతకాని నేను! ఈ సారంగధరుడి భాగం చదువుతో, యిన్ని మాటలు అతని నోటివెంట ఎందుకు పలికించానా అని దిగులుపడ్డాను. ఆ వ్రాసేప్పుడు తెలీదుకద, ఈ దేశంలో ఆ నాటకం ఎవరూ ఆడకరనీ, దొంగతనాలు మాత్రం చేస్తారనీ, పేరుచెప్పకండా! నా నాటకంలో సారంగధరుడు నేనే ప్రదర్శించవలసి వొస్తుందనీ! ఎందుకంటే- ఎంత వివేకం మనిషికివున్నా, వ్రాసేప్పుడు కవికి, "యీ పుస్తకంతో యింక లోకాలు జయించామే!" అనిపిస్తుంది. ఆ వుత్సాహం, ఆమాయలో నమ్మకంలేందీ ఎట్లా వ్రాస్తాడు! తరవాత నిరాదరణ ఎన్నిసార్లు జరిగినా, ఆ సమయానికి తలుచుకోడు- ప్రసూతి బాధల్ని స్త్రీ సమయానికి మరిచిపోతున్నట్టు-

చిన్నప్పుడు గ్రీక్ దేశచరిత్ర చదువుతో "ఈ పెరిక్లీస్ చిన్నప్పుడే చచ్చిపోయి వుండకూడదా?" యాభై పేజీల గ్రంథం దాటివేసి వుండవొచ్చునే అని విసుక్కున్నేవాణ్ణి. అట్లావుంది నాగతి!

హైద్రాబాదునించి స—నాతో యీవూరు వొచ్చేసింది. ఎందుకు? ఆమెనిచూస్తే అనుకోను ఆమెలో అంత purposeful flaming romance నివసించగలదని. నేనువున్న మూడురోజాలూ ఇంట్లో చాలాదిగులుగా తిరుగతోంది. నేను సాయంత్రిం ప్రియాణ మైనాను. కొండలమీదనించి చంద్రుడుదయించి, ఎలట్రిక్ దీపాల తలలు తారురోడ్లమీదికి వొంచాడు. Public gardens palms కొనలలోంచి ఊగులాడే చంద్రుడివంకచూసి నాగుండెపట్టుకుంది. ఆవెన్నెట్లో వొంటరిగా రైలులో ప్రియాణం; హుస్సేన్ సాగర్ కంత మాలగా అమర్చిన దీపాలు దూరమాతో వుంటే కలిగే దిగుల్ని తలుచు కుని వెనక్కి యింటికి వెళ్లాను, ప్రయాణం మానకుని. ఇంటికి వెళ్లాక జ్ఞాపకంవొచ్చింది, మర్నాడు బళ్ళోవుండితీరాలని, వుండక పోతే శలవలజీతం రాదని. గుమ్మంలోకి వెళ్ళగానే, నేను వెళ్ళి నందుకు దిగులుపడుతున్నదానివలె, స—'వొచ్చారా!' అని నిట్టూర్పు విడిచింది. మూడురోజులకింద హైద్రాబాదు వొచ్చానని ఆస్పత్రికి పంపిన కబురంది, off duty లో డాక్టరు కూడా వొచ్చింది. ముగ్గురమూ తెల్లారకట్టవరకు వెన్నెట్లో, మాటల్లోనూ, సౌందర్య భారంతో వొంగిన మౌనంతోనూ గడిపాము రాత్రి.

మర్నాడు మధ్యాన్నం నేను స్నానంచేసి వొచ్చేప్పటికి స— బల్లముందుకూచుని ఏడుస్తోంది. బుజంమీదచెయ్యేసి నాతో చెప్ప మన్నాను. అప్పుడు చెప్పింది తన విషాదాన్ని. ఆమెకీ—స్త్రీకీ జరిగిన పూర్వచరిత్ర తమాషాకాదు. ఆనాటినించి అతనికోసం విలవిల లాడుతోంది. ఇన్నేళ్ళూ కలుసుకోకపోయినా, అతని విషయమై గొప్ప 'రొమాన్సు'ని హృదయంలో కల్పించుకుని ఉత్తరాలు వ్రాస్తోంది. ఆమెనించి అంత కవిత్వం ఎట్లావొస్తుంది,—స్త్రీ కోతలుకోసి ఆ వాక్యాలు అతనే అల్లుకున్నాడని నవ్వుకున్నామా? ఆవాక్యాలన్నీ నిజం. సాధారణ హృదయాల్లో, ఎక్కడా కవిత్వం ఉన్నదనుకో లేని హృదయాలనికూడా ఎంతరసవంతంగా చేస్తుందో ప్రేమ! కోర్టులో, లేచిపోయినవాళ్లు ప్రియులకి వ్రాసే ఉత్తరాలుచూశాను.

ఆమనుషుల్ని, వాళ్ళవిద్యని, సంస్కారాన్ని చూస్తే, ఆ వుత్తరాలు ఏరసికుడిచేతో వ్రాయించుకున్నారు, అనుకుంటాము. ఈ నాలేఖలూ అంతే; నాకు బళ్ళో కాంపోజిషన్కి చివరిమార్కులు వొచ్చేవి. అతను ఎందుకు తననిచూడడానికిరాడు? అంటుంది స—. తనువొస్తానంటే ఎందుకు రమ్మనివ్రాయడు అంటుంది. అతనే తలవూపితే, తన కుటుంబాన్నే, తనని గుడ్డిగా గొప్పగాప్రేమించే భర్తనే వొదిలో, దిక్కరించో వెళ్ళిపోతుందనిపిస్తుంది. స్త్రీమీద artist గానేకాని, స్నేహితుడిగానేకాని man గా నేకాని నామనసులో విలువ తక్కువ. అతనిమీద మనసు నిలిపి లాభంలేదని చెపుదామనిపించింది కాని, నామాటలు లాభంలేదని ఆమె కళ్లే చెపుతున్నాయి. నాతో వొస్తే, అతన్ని రప్పించి, సమావేశం కలిగిస్తానన్నాను. ఆమె బైలుదేరింది. స—వూళ్ళోలేదు. అతనికి నామీద కోపంవొస్తుందేమోనన్నాను. కాని ఆమె అతన్ని సర్దుకుంటానంది. నాతో వొచ్చేసింది.

ఆమెతో, ఆమె పిల్లలతో నాకు పొద్దుపోతోంది. స్త్రీ ఎన్ని వుత్తరాలు వ్రాసినా రాలేదు ఇంకా.

మేము షికారువెడుతోవుంటే, ఒక తురకపిల్ల నన్ను పలకరించి, నాకు పనిచేస్తానని వొచ్చేసి మా ఇంటో నేవుంది. ఆ అమ్మాయిని నీకు చూపాలనివుంది. నేనూ స— కలిసి ఆపిల్లని శుభ్రంచేసి జుట్టు కత్తిరించి, రిబ్బన్లుకట్టి తమాషాచేస్తున్నాము. ఆపిల్ల చాలాసార్లు అడివిపిల్లిమల్లే భయమేసేట్టు wild గా కనపడుతుంది. ఆమె పాడితే అడివిలో అగడ్తలూ, వన్యమృగాల అరుపులూ స్ఫురిస్తాయి. ఆమె నిదానంగా నావంక చూస్తే, ఏమిటా అర్థం అని ఆశ్చర్యం కలుగుతుంది.

---

—కుమారి తనని రైలుదగ్గిర కలుసుకోమని వ్రాసి, ఏ రైలో వ్రాయలేదు. ప్రతిరైలుకీ, ప్రతిరోజూ తను వొచ్చిందాకా రావాలని వుద్దేశ్యమా అని విసుక్కున్నానుగాని, సమ్మోహనమైన ఆమె నవ్వు జ్ఞాపకం నన్నట్లానే లాక్కెళ్లింది స్టేషన్‌కి. చూశావా, ఆడవాళ్ళకి అందంయిచ్చే గర్వం! వెళ్లాననుకో ఆమె చిరునవ్వు అందానికి వశ్యుణ్ణిగనక!

ఈవూళ్లో—నాయుడితో చాలా అవసరమైనపనిమీద వొచ్చానని, నాతో దిగకండా, అతని యింటికి వెళ్ళడానికి నన్ను ఉపయోగించుకుంది. 'Past' మరిచిపోయినానా? అని స్త్రీని అడిగి లాభంలేదని నాకు తెలిసి, ఏమీ మాట్లాడలేదు నేను. ఆమెని ఇన్నాళ్లూ మరిచినా, మళ్లీ ఆమె నవ్వునీ, గంతులేసే ఆమెచూపుల్నీ, శీవినీ, చూసేప్పటికి, జరిగిన ఆకర్షణ అంతా జ్ఞాపకంవొచ్చి రాత్రంతా బాధపడ్డాను. ఎంత వివేకం బోధించుకున్నా, నా బాధ ఆగలేదు. ఈ మనసుకిమించి, మనసుకి అందక, లోపల్నించి మన సుఖబాధల్ని ప్రోత్సహించే శక్తి ఏదో గొప్పది లోపలవుంది. అది మనకి అందదు. దాన్ని మార్చడం మనతరంకాదు. "నువ్వెంత చెప్పు. నేను బాధపడతలుచుకున్నాను" అంటున్నట్టువుంటుంది ఎవరో! తనుబాధపడడమేకాక, నన్ను రాత్రంతా మేలుకుని పక్కమీద ముళ్ళమీదవలె దొర్లేట్టుచేసింది. నాది, ఈ స్త్రీ. ఒకసారి నా పెదిమలమీద దయతలిచి తన పెదవుల్ని ఆనించిన పాపానికి, నాకు కనపడినప్పుడల్లా 'నాదే' ననే యీదేబిరికొట్టు తనంపోదా ఈజన్మకి! ఇట్లాంటి నిగూఢదుష్టప్రోత్సాహాలని, పశుత్వాలని సాధించి, నిర్మూలింపగలిగే సాధనం దొరకదా? అసలు అట్లాంటిమార్గం ఎవరన్నా కనిపెట్టారా! పూర్వం రుషులు వెయ్యేసియేళ్లు తపస్సు చేశారంటారే, అదేదో ఇట్లాంటి ప్రయత్నమేనా! కాని వాళ్లు ప్రేమనీ, సంతోషాన్నీ, sense of beautyనీ నాశనప్రయత్నంలోవున్నట్టు తోస్తారు.

చీడని వొదిలించుకపోతే, పువ్వులతో చెట్టే వచ్చినట్లు, యీ దుర్గుణాలతో మన గొప్పతనమే, మన ఆకర్షణే నాశనమవుతుంది అనుకుంటాను

ఏ స్త్రీ ఐనా, నన్ను నిరాకరించగానే, నన్ను మరిచిపోగానే నన్ను అవమానించినట్లు feel అవుతాను. బాధా, కోపంవొస్తాయి. మోహంలో చాలా self respect వుందినాకు. అందువల్లనే, స్త్రీ తనే నన్ను ఆహ్వానిస్తేనేగాని, నేను జోక్యం కలగచేసుకోను. ధనాన్నీ, పదవుల్నీ, స్త్రీలనీ, అభిలషించే మనుషులు ముందు సిగ్గునీ, అభిమానాన్నీ, ఆత్మగౌరవాన్నీ, ప్రిన్సిపిల్సునీ వొదులుకోవాలి- ఎవరో చాలా అదృష్టవంతులు తప్ప.

కలరా అంటున్నావు. జాగ్రత్త. నీకే జబ్బుచేస్తేనా? ఆ పాడు బాక్టీరియా, నీమీద దయతలుస్తాయా? నీ అందం, నీ హృదయం వాటికి అర్థమవుతుందా? ఈ లోకానికి ఎంత అపకారం చేస్తున్నాయో, నీ చిరునవ్వుని మాయంచేసి వాటికి అర్థమవుతుందా? ఇట్లాంటప్పుడు చప్పున తడుతుంది, ఆత్మ, సౌందర్యం, ప్రేమ, ధర్మాలు, యిన్నీ మాట్లాడే మనం, ఆకాశాన్నంటే కలలు కనే మనం, వుత్తి రక్తం, మాంసమని, ప్రతిచిన్ని సూక్ష్మజీవి అనుగ్రహానికీ జడవవలిసినవాళ్లమేనని! What a shudder there is at the thought that the object of so much love is so fragile, that the whole of her heart is suspended after the breath of a mortal creature! నా ప్రాణం, నా ఆనందమంతా మాయమవుతాయన్నా, యింక నానించి ఒక్క కథగాని, మాటగాని రాదని చెప్పినా ఆ కలరా జీవులకి దయకలుగుతుందా నామీదగాని, నీమీదగాని! ఆవూళ్ళో కలరాగా వుందని యీవూళ్ళో మీవాళ్ల యింటికి రావడానికి నువ్వు మీ అధికార్లని వొప్పించుకుంటే 'వొస్తున్నానని నాకే వుత్తరంవ్రాస్తే-' రోజూ అసహ్యంగా బొగ్గులు చిమ్ముకుంటో, నిద్దట్లో చప్పుడుచేస్తో నిరర్థకంగా యీ బ్రొమనుషుల్నీ ఓ చోటినించి యింకోచోటికి మోసుకుపోయి

పారేసే యీ మెయిలు, ఇంద్రలోకపు విమానంకింద విమారిపోతుందికద ! ఆ రోజు యే శుక్రవారమో, మంగళవారమో. ఆ సాధారణపు పేరు, అకస్మాత్తుగా చరిత్రలో అద్భుతంగా ప్రకాశవంతమైన red letter day గా మారుతుందికద!

హైదరాబాదులో చదువుకుంటున్న మా డాక్టరు నోట్సు కాపీచెయ్యమని నాకు యిచ్చింది. వాటిల్లో నిన్ననో మొన్ననో, కలరా సంగతి కాపీచేస్తున్నాను. అప్పుడు ఆబాధలు, చిహ్నాలు, అన్నీ నీకు వొస్తున్నట్టే తలుచుకుని వొణికిపోయినాను. అన్ని జబ్బుల సంగతీ గుడ్డిగా యే interest ఇంటరెస్టులేకండా వ్రాసిన వాణ్ణి కలరాసంగతి వొచ్చేప్పటికి మాత్రం కలరాకి మందులేమిటి, ఎంతమందికి కుదురుతుంది, ఎటువంటివాళ్ళకి, ఇవన్నీ జాగ్రత్తగా చదివాను.

ఏ వూరులోనో కలరాగావుందని పేపరులో చదివి, మళ్లీ ఆ సంగతి యోచించను. కాని ప్రత్యేకించి లోకంలోకల్లా నీకు సంజరమైన ఆవూళ్ళో కలరాగా వుందని చదవగానే, యీ శానిటరీవాళ్లు యేంచేస్తున్నారు, వాళ్ళకి జీతాలు ఎందుకిస్తున్నారు, వూరికే తిరగడానికా? ఈ డాక్టర్లంతా కలరాకి sure remedy మంచి మందు కనిపెట్టక ఇన్నాళ్లు ఎందుకు వూరికే వున్నారు, శాడవనా చదువులు, అని ఆగ్రహం కలుగుతుంది. అదీ మానవ హృదయం.

స—ఎన్నాళ్లకీ రాకపోతే ప—వొచ్చాడు. నాతో చాలా సంతోషంగా మాట్లాడుతున్నాడు మొదట. సాయంత్రం విమలని చూడ్డానికి వెళ్లాము. ఆమెతో అతను మాట్లాడిన veiled sarcasm విధంచూస్తే నాకు కోపంవొచ్చింది. ఇన్నాళ్లు ప్రతిరోజూ విమలా నేను కలుసుకుంటున్నా, చూసుకోలేకండా ఉండలేకపోయినా, ఆమె అధికార్లూ బంధువులూ, ఆమెని అపవాదులతో భయపెట్టి అడ్డపెట్టటానికి ప్రయత్నించినా, మాస్నేహం ఏమాత్రమూ చెదరలేదు, మలినంకాలేదు. చాలా heroic గా నావేపు stick up

అయింది. ఆమె మనసులో నీవుపోసిన భక్తి కారణమనుకుంటాను. మా స్నేహాన్ని మోహమేనంటే, ఆమెని ఇంతవరకు తాకని నేను, ఆమెమీద ఆవిధంగా ఆకర్షణలేని నేను, వొప్పుకుంటానుకాని, ఆమె వొప్పుకోదు. కాని ఇతను ఆ మధురమైన స్నేహభావాన్ని చెదర కొట్టాడు. ఇట్లానే చాలామంది పెద్దలు వాళ్ల వృత్తఅనుమానాల తో లేనిమోహాన్ని హృదయాల్లో అంకురింపచేస్తారు. భర్త 'అతని వంక ఎందుకుచూశావు?' అని భార్యని అడగగానే, ఇదివరకు లేని ఆకర్షణ భార్యకి తడుతుంది. రాత్రంతా విమల విషయం బాధపడి, తెల్లారకట్టే ఆమెని చూడ్డానికివెడితే, సగం భయంతో, సగం సిగ్గుతో, నావంకచూసి, మాట్లాడింది. ఏటిపక్క చెట్లకింద ప్రశాంతంగా,ఆకుల గలగలలో ఆమె చిరునవ్వులతో, cultured talkతో, teaతో, నేను గడుపుతున్న మధ్యాహ్నాలు, ఇంక అంతమైనాయా అని దిగులు కలిగింది. రాత్రులుకూడా మామిడిచెట్టుకింద ఏట్లో తేలే నక్షత్రాలు చూస్తో కూనుంటే, ఆమె అవతలగట్టున నిద్రపో తోందనే వాతావరణం నా కలలకి మాధుర్యాన్ని చ్చేది.

ఇంతాచేసి, కారణం లేకండా ప__నాతో చక్కగా మాట్లా డడం మానేశాడు. నాయిల్లు వొదిలి, జైట సందులో చెట్టు కింద నివాసం ఏర్పరుచుకున్నారువు. ఒకటే మాట్లాడుకుంటున్నారు భార్యాభర్తలు. మరి ఏం జరిగిందో! స__మాత్రం నాతో ఎప్పటి మల్లేనేవుంది. అతను ఆమెని ఇక్కడే వొదిలి,

'హా ప్రియసీ, ఎంతగతి పట్టింది నీకు',

హంసతూలిక పాన్పు...కటికరానేల ఓ అతివనీకు' అంటో వెళ్లిపోయాడు.

— స్త్రీ ఇంకారాలేదు ఎన్ని ఉత్తరాలు వ్రాసినా. 'ఎన్నాళ్ళు! ఇంకారాడేం!' అని యేడుస్తుంది ఆ అమ్మాయి. చివరికి నిన్న టెలిగ్రాం ఇచ్చాను.

నిన్ను తెలుసుకున్నంత మాత్రాన నా హృదయంలో కలిగే ఆరాధనని, బాధని, శాంతిని, యీ పిచ్చిమాటలతో, యీ వంకర అక్షరాలతో ఎట్లా తెలపగలను? నా జీవితలోకానికి కాంతివి నువ్వు. అందరూ యీశ్వరదర్శనం కావాలని; పూజిస్తారు, ప్రార్థిస్తారు. ఆ దేవుడు ఎప్పుడు కనపడతాడా అని భక్తితో కాచుకొన్కుంటారు. దేవుణ్ని ఎరగని నా హృదయం ఆ గొప్పనంతా నీలో మూర్తీభవింప చేసుకుని, నీదర్శనం కోసం కాచుకుని వెర్రి ఆశతో పగలు రాత్రులు ఎదురుచూస్తో గడుపుతాను జీవితాన్ని. నీభక్తుణ్ణి: నీదాసుణ్ణి: నీపాదాల మీదవాలి నానుదుటిని అనించి సమస్తమైన సుఖదుఖాల్నీ మరవ లేనా? కాని నువ్వు—ఆ యీశ్వరుడంత దూరస్థురాలివి ఐనావు. దుర్లభురాలివి.

పూర్వపు పతివ్రతలు భర్తల్ని దైవాలుగా పూజించారంటే నేను వెక్కిరిస్తానుగాని, నాకు నీమీద యెట్లావుందో, దాంటో పదో వొంతు ఆ పతివ్రతలకి ఆ భర్తలమీదవుంటే, వాళ్లని దైవాలనుకోడం ఒక వింతా! కాని ఆ భర్తలు, ఆ రాముళ్ళు, ఆ హరిశ్చంద్రులు, నలుళ్ళు, రావణులు_ అందరూ అట్లాంటి దౌర్భాగ్యులు కనక_ ఈ పతివ్రతలకి కళ్లులేవా అని సందేహం.

నిన్న షికారువెడుతో నీఫొటో జేబులో తీసికుని వెళ్లాను. కాలవవొడ్డున కూచుని ఎంతోసేపు నీముఖంవంక చూస్తున్నాను, ఏమిటా నీలో ఆకర్షణ అని తర్కించుకుంటో. నీ అందమంతా నీ కళ్లల్లోవుంది. అందువల్లనే నాకు నీ ప్రేమలో తృప్తి అనేదిలేదు. భౌతికంగా అందంలేదు కళ్లల్లో. నీ చూపు_ అంతదయగల చూపు_ నా మనసు అంతరాంతరంనించి కదిలించి లాగి, వశపరుచుకున్న చూపు! పెద్దకళ్ళు, కోలకళ్లు తళతళలాడే పాపలు, ఆకాశంవలె శాంతమైన కనుగుడ్లు, నిప్పువలె చురుక్కుమనే చూపులకళ్లని, నన్ను ఆరాధిం

చిన నేత్రాలు, అనేకం చూశాను జీవితంలో. కాని నా ప్రేమ, నా వాంఛ, నన్ను అంతనీ ఏదో గొప్పతనంలోకి మార్చగలవి నీచూపులు. నీకళ్ళలోంచి నీఆత్మే యీలోకంవంక చూస్తోవుంటుంది— ముఖ్యం నావంక!

జీవితం దుర్భరంగా వుంది. కారణం ప్రత్యేకం లేదనుకో. ఈ దుర్భరంగా వుండడం 'క్రానిక్' అయిపోయింది. ఇంతేననుకుంటూ యీ బతుకు. మాటిమాటికీ ఎందుకు బతుకుతున్నాను? అనే ప్రశ్న గాఢంగా మనసుని ఆవ్రతోంది. సాధారణంగా అందరికీ తృప్తినీ సౌఖ్యాన్నీ యిచ్చే విషయాలు నాకు కారణాలుగా కనిపించటంలేదు. ప్రత్యేకించి నా జీవితానికి అర్థం యివ్వగలవి ఏమీ కనపడవు. ఉన్నతాదర్శం అట్లావుంచి, అసలు ఆదర్శమే కనపడదు, నీ ప్రేమ తప్ప! కాని నువ్వు- నాకు అందవు- ఇంకా దూరమౌతున్నావు. అందితే? ఏమో! అందక పోవడంలోనే వున్నదేమో యీ అందమంతా!

ఈ దుర్భరత్వం రోజూరోజూ యెక్కువవుతోంది. "ఆఖరు చేసెయ్యి" అనేవాక్కుబలం తొందర యెక్కువవుతోంది. ఈ బాధ యీ ఆరనితాపం, దేనికో అర్థంకానిదానికోసం అన్వేషణ, యిదంతా, దీనికంతా యేదో పర్యవసానం, ఆదర్శం వుందేమో! ఇంకా ముందుకు పొమ్మని, యీ తుపానుతో పూపులకి, యిదంతా ధైర్యంతో వోర్పుతో దాటితే, అవతల ఒకతీరంవుందా- ఆ తీరాన శాంతీ, ఆనందమూ, నువ్వూ, వుంటారా అని సందేహం మళ్లీ! నీ హస్తాల్లో ఎప్పుడో శాంతి వొస్తుందనే ఆశకూడా· అంతరిస్తోంది. ఎన్నేళ్లు యిట్లా? సాహసించి, విధనే యెదుర్కొని, యీ అభ్యంతరాల్ని ఛేదించి, నా విశ్వాసంతో నిన్నూ కదలించి- ఆ విశ్వాసంలేదు నాకింకా ప్రేమలో! నాముందు తెగసరికిన బంధనాలరక్తం, దుఃఖం, నా కాళ్ళతో తొక్కిపోవలసిన జీవితాల నిరాశ, యివన్నీకనపడి, నా వొక్కహృదయం యిట్లా కాలనీ! ఏమీ? భరించడానికి భయపడతానా? యీ వీణతంతులు తెగనీ, అసలు తంతులు లేకండా యీ

వీణలోనించే గానం వినపడుతుందేమోనని వెర్రిఆశలో కళ్లు మూసుకుంటాను. పోనీ యీ చిక్కుల్లోంచి, యీ ఆరాటంలోంచి- ఎట్లానో నీహస్తాల్లో పొందని శాంతిని, పోనీ మృత్యుదేవి వక్షంమీద కళ్ళుమూయనా? కాని మళ్లీ మెలుకువ అనేదిలేదని నిశ్చయమేవుంటే! హామ్లెట్ Hamletని పట్టిన సందేహం ఎంతమందిని బాధిస్తుంది యిట్లా? మళ్ళీ అనుకుంటానుకదా! మృత్యువుతో జీవితం ఆఖరైతే, యీ లోకాన్ని నన్నే నేను మరవగలిగితే దిగులులేదు- కాని నిన్ను నీనించి కలుగుతున్న యీ నిరంతరవియోగబాధని మరచిపోతానే అనే దిగులు మరిచిపోనేమో! అంతంకానేమో! అని భయం. నాకీ దేహమేపోయి, దివ్యజ్ఞానసమాజంవాళ్లు అనేట్టు; నేను నా ఆత్మ నిన్ను విడవలేక, నిన్నుచూస్తో- నిన్ను తాకలేక, నా పిలుపు నీకు అందక-ఎట్లా విశ్వసిస్తారో ఇట్లాంటివి- కళ్లులేకండా చూస్తారట- కంఠంలేకండా మాట్లాడలేరట! కాని ఇట్లాంటి nonsense నాకు భయంకరమైన కలలుమాత్రం కలిగిస్తుంది అప్పుడప్పుడు.

కాని లోకం ఆదినించి ఎందరు ఇట్లా ప్రేమించలేదు? మళ్లీ Each lover ప్రతిప్రియుడూ ప్రేమకి తానే మొదటి అతిధి నని, ప్రతిసారి ఎన్ని లక్షలసార్లు అనుకోలేదు! వాళ్లప్రేమలన్నీ మాయమైనాయి. ప్రేమించుకుని సఫలులైనవాళ్లు, ప్రేమించుకుని మధ్యలో వియోగంలో పడ్డవారు, ప్రేమించుకుని ఎన్నడూ సఫలంకాని వాంఛతో చచ్చినవాళ్లు వాళ్లందరూ యేరీ యీనాడు?- బియాట్రిస్ డాన్టీ! లైలామజ్నన్! వాళ్లందరూ యేరీ? ఏవో కావ్యాల్లో జ్ఞాపకాల్లో, యితర జీవితాల్లో ఇంకో జన్మల్లో వుండనే వున్నారని, వేదాంతులు యీనాటి కవులుకూడా వ్రాస్తోనే వున్నారుగాని అదంతా వాస్తవాన్ని భరించలేని పిరికితనం! సెన్టిమెంటాలిటీ— వుండులేదని మోసపుచ్చడానికని పైన చల్లే మత్తు మందు. ఈ కొత్తకవుల తెలుగుపద్యాలు చదువు. ఒకరిద్దరు తప్ప ఎర్రని సత్యాన్ని ఎదుర్కోలేక. ఇంకా పురాతనపు అబద్ధాలూ, ధ్యానాలూ, ఋషులూ, దేవతలూ, వెర్రిసెన్టిమెంట్లు, మాతృప్రేమ, మృగాల

మీాది ప్రేమ, భక్తులు, పతివ్రితలూ- తిరునాళ్వారులూ, పంగనామాళ్వారులూ- ఎవరో రాజులూ- భోజులూ, దానాలూ- ఇవే వారి విషయాలూ. Rot, putrid sentiment-stinking religiosity-dam it all —!

ఎట్లా continue అవుతుంది మన ప్రేమ- ఈ జీవితంలోనే మనకి దగ్గిరికిచేరే శక్తిలేదే- ఇంక ఆ జీవితంలోనా? పీనుగుల్ని ఓచోట పాతిపెట్టి ఓచోటవున్నారు వాళ్లిద్దరూ అని సంతోషిస్తారు. రెండు శవాల్ని ఒక చితిమీాదే తగలేశామని గొప్పగా చెప్పుకుంటున్నాడు ఒకడు. మరణంలో ఏకమౌతామా? అటు ఏముంటుంది? నువ్వులేనితరవాత ఏమివుంటేనేం, లేకపోతేనేం? నేను చచ్చినా, నా ఆత్మో హృదయమో, ప్రేమ వుచ్చరించగలిగితే!

అంతా వెర్రి - మాయఆశలు - చస్తామట - ఆత్మ అని ఒక పదార్థం పిట్టమల్లే ఎగురుతుందిట- అదెక్కడో వేళ్లాడుతో వుంటుందిట! మళ్లా ఎక్కడో పుడుతుందిట! అసహ్యపు ఆలోచనలు! సిగ్గుఅయినాలేదు. ఈ వెధవ బతుకులు చాలవూ? మళ్లా పుట్టాలీ, వీళ్లందరూ మనని బాధపెట్టడానికి? ఇంకోచోట- ఇంకోమనిషినై పుడతానంటే నాకేం సంతుష్టి? ఇవన్నీ వొదులుకుని చచ్చేప్పుడు? కాని నిన్ను వొదిలి ఎప్పుడో విడిపోవడమంటే, నిన్ను చూడకుండా ఐపోవడమంటే, ఎంతో నరాలు లాక్కుపోతాయి తలుచుకుంటే! ఎవర్ని అడగను? ఈ కోపమంతా! ఎవరిమీాద చూపను? ఎవరు జవాబుదారీ, యీా బాధలకి, యీా విరహానికి! దేవుడొకడువుంటే, వీళ్లందరిమల్లే బాగా తిడుదును. సంఘాన్నా! ఈ వెర్రి గుడ్డిసంఘాన్ని! ఈ మాత్రం తిరగబాటు లేకుండా, తనూ మృత్యువువేపు సాధుగొర్రెమల్లే అజ్ఞానంలో అసహాయంలో మూలుగుతో మృత్యువువేపు ప్రవహించే యీా సంఘాన్ని- ఛీ, దీన్ని తిట్టనా? దీనికేం శక్తి వుంది?

గతిలేక నాకొత్తమిత్రుడు రా——ని పంపి——స్త్రీని పట్టించి తెప్పించాను. మళ్లీ ఇల్లు పిరియులకి వొదిలి, నా రేగిచెట్టుకింద

చేరాను. నా తురకఅమ్మాయికూడాలేదు ఇవాళ కొన్నిరోజులిట్లా ఎక్కడా కనపడకండా వెళ్లిపోతుంది. ఆ అమ్మాయిమీద అన్నిటికీ నేను depend కావడంచాత, నాపనులు చేసుకోడం మరిచిపోతాను. విసుక్కుని, ఆ పిల్లని రానీకూడదనుకుంటాను. బడి నించి వొచ్చేప్పటికి, నాబట్టలు వుతికి సా ఇల్లుదులిపి, నవ్వుతో, ఎప్పుడూ వున్నట్టే, టీ తీసుకొచ్చి ఇస్తుంది. ఎట్లా కోప్పడను?

విమల చిక్కుల్లోవుంది. స— cross-questioning కి తాళుకోలేక, వొప్పుకుంది, తనకి శ్రీ—మీద ప్రేమఅని. అతను తనని ఎప్పుడో పెళ్లిచేసుకుంటాడని ఆశ. చేసుకోడని, చేసుకునే జవలేదని నాకు తెలుసు. అనలేదు నేనామాట నమ్మదు. ప్రస్తుత వ్యవహారాల్లో, సులభంగా నాకు స్వలాభాపేక్ష వుండనుకోవొచ్చు ఆమె. అదిగాక నా సహాయంకావలిసివొచ్చింది. తన ఉత్తరాలూ, మనిఆర్డర్లు కూడా ఎవరో spy చేస్తున్నారని ఆమె అనుమానం. పాపం, నాకథా నాయికలు పాపాత్ములనీ, అవినీతిపరులనీ. స్త్రీ తన గౌరవాన్ని నిలుపుకోవాలనీ నాతో వాదించే విమల, తన రహస్యాన్ని నాముందు వొప్పుకోడానికి చాలా బాధపడివుంటుంది– అంతేకాదు– ఒక మధ్యాహ్నం నేనూ విమలా స—ముందు బింకాలుపోయి, పందాలు కట్టి, పోట్లాడి చివరికి ఇన్నాళ్లూ లేనిది, అకస్మాత్తుగా గుడ్డిదేవత చేతులో చిక్కాము. Thanks to ప—. ఆ ప్రియుల వ్యవహారం నాద్వారా నడుస్తోంది. ఆప్రియుడు వొస్తానని వ్రాశాడునాకు, నాతోవుండడానికి. గొప్ప drama develop కాబోతుంది. మాకొత్త అనురాగం. పాతప్రియుడు నా guest. వాళ్లిద్దరికీ సన్నివేశం ఏర్పరచాలిట నేను. ఎంతవరకు నాలో దుష్టరాక్షసుని controle చేసుకోగలనో!

కమలదగ్గిర్నించి వుత్తరం వొచ్చింది రమ్మని. అక్షరాలు. అంతే, కాని వొణికిపోయినాను. ఏదోకాబోతోంది నా జీవితం. ప్రతినిమిషం నువ్వుజ్ఞాపకానికి వొస్తావు. నిరంతరమూ దహించే, మధురమైన యీ విరహానలంతప్ప ఏనిమిషానా, నాకు ఏ worry నీ

కలిగించని, నీస్నేహం, ఈ స్త్రీల చరిత్రలుచూస్తే, స్వచ్ఛమైన వెన్నెలలాగ తోస్తుంది మన ప్రేమ.

ఆరాత్రి కమలా నేనూ వెన్నెట్లో మెట్లమీద నుంచోడం, నువ్వు రావడం, నీ చిరునవ్వు! జ్ఞాపకం వున్నాయా? అప్పణ్ణించి నేను చూడలేదు ఆమెని. ఎందుకో ఈ ఉత్తరం ఇప్పుడు! నా కెందుకో ఈ ఆరాటం

వెళ్లనా? ఎట్లానూ వెడతాను. తప్పదు.

స్వేచ్ఛ, free-will- అంటావు! వాటిని నమ్మకపోతే బతుకు దుర్భరంగా, జీవితమూ, కష్టాలూ,పాపాలూ, అర్థవిహీనమైన నరకంగా తోస్తాయా! కాని వుంది free-will. కాని దాన్ని ఉపయోగించుకునే శక్తి చాలామందికిలేదు. వుంది స్వేచ్ఛ, చావడానికి: చస్తున్నారా !

అట్లానే అక్కడ ఏదో ఆపద రాబోతోందని తెలుసు. వెళ్ల కూడదని అనేకసార్లు అనుకున్నాను. వెడతానని తెలుసునాకు.

అప్పుడు కాకినాడలో నువ్వు.

"ఇక్కడవుంటే విపత్తులోకి నడుస్తావు. నేను చూశాను అంతా" అంటే నేను వినకలిగానా? చం—నేను అక్కడవుండాలని నిర్ణయించుకుంది. నీకన్నీళ్ళుకూడా ఆమె పన్నిన ఇంద్రజాల వాతావరణాన్ని ఛేదించలేకపోయినాయి.

అంతే జీవితం !

---

మొన్న నేను రైలు దగ్గరనుంచుని, దాంటో కొందరు మనుషులు మీ వూరిదాకా వెళ్లేవాళ్ళున్నారు కదా అని- అందరూ వెళ్లగలరు- నిన్ను చూడాలనుకుంటే చూడగలరు- నేను వొక్కర్నే, నేనే రావడానికే వీల్లేంది- అని యెంతో యీర్ష్యపడ్డాను, వాళ్లని చూసి ఆ రైలునితాకి, నా ముఖాన్ని ఆ చెక్కలకి ఆనించాను

జుట్టు కత్తిరిస్తే తలనొప్పులు తగ్గుతాయని అన్నాడా డాక్టరు? సరే నీ ఆజ్ఞ- కత్తిరిస్తాను.

ఇప్పుడు యింకా అందంగావుంది నాజుట్టు- ఫ్రప్పం నన్ను రైలుదగ్గరచూసి, నీతో చెప్పినప్పటికంటేకూడా! కత్తిరించడమంటే దిగులేస్తుంది. ఎప్పుడో, కొద్దియేళ్ళల్లో యీజుట్టు వూడిపోవడమో, తెల్లబడడమో యెట్టానూ తప్పదుకదా! ఈలోపున ఎవరో రైలు దగ్గరచూసి నాజుట్టు అందం నీతో చెప్పడానికీ, నేను నన్ను అద్దంలో చూసుకుని ఆనందించడానికీకూడా లేకండా కత్తిరించనా! అంతకన్న తలనొప్పులే నయమేమో! ఐనా నీ ఆజ్ఞ!

మొన్న సాయంత్రం విమలబోర్డింగుకు ఎదురుగా కూచున్నాను. ఆ కాలవా, మామిడిచెట్టూ, కొంచెందూరంలో విమల- చక్కని నవ్వులు ఆమెవి—— జ్ఞాపకంవుందా?- వున్నదనే ధ్యాసా, మామిడిచెట్టు అప్పుడే పూసింది. చక్కని పరిమళాల పుప్పొడిని నా జుట్టునిండా చల్లుతోంది. మామిడి, గోరింట, ఈ పూల పరిమళంలో రసోద్రేకం- కామోద్రేకమంటారేమో, కొందరు- వుంది. ఆ ఆహ్లాదాన్ని సంస్కృత కవులు గుర్తించారు. కాని ఈ నాటి కవులు చూసిన గులాబీ పువ్వులు, చూడని పద్మాలూ తప్ప యింకేమీ వర్ణించరు- స్త్రీలు యింకేమీ ప్రేమించరు. వాసనలేని రంగురంగుల పూలని, కనకాంబరాలని, కాయితాల చామంతి పుష్పాలని, పట్టు పీలికల్ని, బంగారు రేకుల్ని ధరిస్తున్నారు తలల్లో!

ఆకలేస్తోంది. నేను వొండుకున్న అన్నం నాకు సయించ లేదు ఇప్పుడు రెండు గంటలయింది మధ్యాహ్నం, పెసరపప్పు నాన వేశాను. కారంలేదు యింట్లో. బైటికివెళ్ళడానికి యెండగాలుపు. కుండేళ్లని యింటో వొదిలి నాటి ఆట చూస్తున్నాను. నన్ను తల పెట్టని యీలోకం వంక కిటికీలో కూచుని చూస్తోవుంటాను, కొంత సేపు. పాల అమ్మ పాలుతీసుకొచ్చి, నాకు అవసరం లేదన్నా యిచ్చి పోయింది. ఏం చెయ్యాలో తెలీక, కోవాచేద్దామని; పాలని 'స్టౌ' మీద పెట్టి, కిటికిలో కూచుని కలలు కంటో మరిచిపోయినాను. మంచినీళ్లకని వంటింట్లోకి వెడితే, పాలూలేవు, కోవాలేదు, మాడిన గిన్నెవుంది. గిన్నెను అట్లామాడ్చినందుకు చివాట్లు. తరవాత కథ.

గీతాంజలిలో ఒక గీతంలో ఒకామె, ఎండ మబ్బుల్నీ, మబ్బులు ఎండనీ తరిమే తమాషాచూస్తో పొద్దస్తమానం 'నీకోసం' యెదురుచూస్తో కూచుంటానని_అంటుంది. ఎన్నిసార్లాని ఎప్పుడూ వొచ్చే 'నీకోసం' అట్లావుంది నాపని.

ఎందుకో కాలం వూరికే తొందరగా జరగాలనిపిస్తుంది. ఇంకా ఈ నెలేనా, ఈ తారీఖేనా అనుకుంటాను. ఎందుకు, అని ప్రశ్నించుకుంటే, కాలం జరిగి యేం లాభం అనుకుంటే, జబాబు లేదు. ఏదో మార్పులో, భవిష్యత్తులో నమ్మకం, వర్తమానం దుర్భరం గనక.

ఈవాళ నీమీద నాకు చాలా కోపంగావుంది. ఈబాధకీ అశాంతికీ నువ్వే ముఖ్యకారణం. నిన్నే నేను చూడకుండావుంటే, నువ్వే నీ ప్రేమని నాకిచ్చి శాశ్వతంగా నన్ను ఆకర్షించకపోతే, జీవితానికి సమస్యలే వుండేవి కావు. నిద్రపోతూ, ఒక జ్ఞానేంద్రియంతోనూ, ఒక కర్మేంద్రియంతోనూ బతికే నాసోదరులవలె, నేనూ కాలాన్ని గడిపేవాణ్ణి-కాదు-అబద్ధం. అట్లా బతకలేను. ఎప్పుడో నా అంధకారాన్ని, అర్థవిహీనత్వాన్ని, నేనే భరించలేక, యేరైలు పట్టాలమీదో, ఈ జీవనమరణ సమస్యని సాధించి వుందును. అకాల మృత్యువునించి, జీవితానికి పూచీ యిచ్చావు నా విషయమై నువ్వు.

But you are far, and Loneliness
My only lover, through the night,
And not for any word or prayer
Would you console my loneliness
Dear, 'end yourself serene and slight
And the cool clusters of your hair.

అటుమొన్న యెంత యమబాధపడ్డానో చెప్పలేను. తలనెప్పి వికారమూ. నన్ను పలకరించి కనుక్కునే దిక్కులేదు. పాపం, పిల్లలతో, భర్తతో, వుద్యోగంతో వూపిరాడక కొట్టుకునే 'జీవం' తప్ప, అప్పటికీ నామీద ప్రేమవల్ల, ఎట్లానో తీరుబడిచేసుకుని పలకరించి ఓదారుస్తుంది. కాని యిట్లా ఈబాధలోనన్నా పూర్తిగా హృదయం చూపడం ఆమెకి భయం_ నాకూ భయమే ఆమెకోసం_ యెక్కడ అంతమౌతామో! జీవితం ఆమెని యేం చేస్తుందోనని !

మొన్న సాయింత్రం నా స్నేహితుడికోసం ఆమె యింటోకి వెళ్ళాను. దీపంలేదు. చీకటి. ఎవరూ కనపడలేదు. మెల్లిగా 'జీవం గారూ!' అన్నాను ఎవరూ పలకలేదు. విచిత్రంవేసి గదితలుపు కొడదామని నడిచాను. నాకాళ్లకి ఏదో అడ్డంవుందనిపించి ఆగాను. కుర్చీపీటమీద నిశ్శబ్దంగా ఆమె కూచునివుంది. నేను రావడంచూశే వుంటుంది. ఆమెచేతులుజాచి, silent గా నాకోసం wait చేస్తోందనిపించింది. నాగుండెకొట్టుకుంది. గది అంతా electric currents తో నిండి నట్లయింది ఏంకాబోతున్నాము! నేనేం మాట్లాడక వెనక్కి వొచ్చాను. ఆశక్తి ఎట్లావొచ్చిందో తెలీదు. వొచ్చినప్పణ్నించి అన్యాయం చేశానా అని దిగులు. ఎన్నడన్నా నాకు తెలీకండానే ఆమెని encourage చేశానా? లేక అంతా నా imagination అయివుంటుందా?

ఏమీ జరగనట్టే, నాగదిలోకివొచ్చి ఎప్పటిమల్లే silent గా, నేను లేనప్పుడు, నాదిక్కులేని అపరిశుభ్రాన్ని సద్దిపోతోంది. వాళ్లందరిన్నీ ~~అంత~~ బాగా ఎరుగుదును. ఆమె పని చేస్తో చేస్తో, పర

ధ్యానపు కలలు కనడానికీ, ఆమె కళ్లల్లో ఆ నిరాశాదృష్టులకీ అర్థం కనపడదు. ఆమెకైనా తెలుసునో లేదో?

తిండీ, బట్టా, ఇళ్లూ వుంటేచాలు, అనుకుంటాము! అవి లేనంత సేపే వాటికోసం ఆరాటం. అవి రాగానే, మనకు తెలిసినవీ, తెలీనివి ఇంకా బాధలెన్నో! ఎందుకో జీవితం ఇట్లా? దేవుడేవుంటే, అపారమైన దయా, అంతంలేని నిర్దయా కలిసిన వాడిమల్లే తోస్తాడు నాకు.

ఆరాత్రి! జబ్బు, బాధతో దొర్లుతో— నువ్వే పక్కన కూచుని వుంటే, ఆబాధనంతా మరిచి శాంతిని పొంది వుందును కదా, అని నాగతికి యేడుపొచ్చింది. నిన్నంతా ఈ బతుకులో నా వొంటరితనానికై దిగులు పడుతున్నాను. గుంపుతో కలవకపోవడంచాత దానికై లోకమిచ్చే శిక్షయిది. ఎంత స్నేహమైనా, ఎంత ఎడ్మైరర్లు admirers వున్నా సంఘంలో సుఖదుఃఖాలు, నీతులు, ఆచారాలు పంచుకోక యెదురు తిరిగి, బంధుత్వాలు, కట్టుబాట్లు తెంపి "మీతో నాకేంపని?" అని నిగ్రహించిన వాడితో సానుభూతి చూపరు. కష్టాలలో వుంటే, "కోరితెచ్చుకున్నావు, అనుభవించు" అన్నట్టుచూస్తారు, దయగా మాటాడేప్పుడు కూడా. అది క్రౌర్యం కాదు, మానవ స్వభావం. ఇదంతా యెందుకుచేశానా? ఇట్లా ఎందుకు వంటరినైనానా? అని దిగులేస్తుంది నాలో నాకే, కొన్నాళ్లు యేదో లోకం సంస్కరణ మనుకున్నాను, కొన్నాళ్లు ఆత్మాభివృద్ధి అనుకున్నాను, కొన్నాళ్లు అసలు అసహ్యం కోపం కలిగి ధిక్కరించాను— నాతో కలిసి సహాయంగా వుండే కోటి rebels రెబెల్సు వుండేవాళ్లు. కాని నా అభిప్రాయాలు మారి, మిత్రులు మారి, చచ్చి ఏకాకిని కావడంతో, ఇప్పుడు యిదంతా దేనికి చేశానా అని ఆశ్చర్యంగా వెనక్కి చూస్తాను— ఇట్లాంటి weak-moments వీక్ మోమెంట్సులో. చాలా రోజులు, యిప్పటికీ, నీతిపరుల్ని, ఆచారపరుల్నీ; షాక్ shock చెయ్యడమే సంతోషం యిచ్చేది.

ఈమొండి గోడలయిల్లు అమితమైనవేడి. ఈ 'జీవం' సహృదయానికీని, అందరూ వొదిలిన నన్ను, ఆదరించిన యీ ఆదిమాంధ్రుల

మీది ప్రేమచేత, ఈమొండిగోడల్ని లక్ష్యపెట్టక యిక్కడచేరాను. మందుకీ, తిండికీ, డబ్బులేదు. నువ్వు పంపిన ఒక్కరూపాయీ ఈ సాయంత్రందాకా లాక్కొచ్చాను భద్రంగా. నువ్వు నాకతికించిన ఆ లావాటి ఆమె బండికని పావలా లాక్కుని, పైగా అసందర్భపు కబుర్లతో నన్ను చంపేసింది రాత్రంతా. తువ్వాలు లేక మూడు రోజుల్నించి స్నానంలేదు. దరిద్రంమీద కోపంచాత, శుభ్రాన్ని తరిమాను దూరంగా!

మూడు దినములనించి స్నానంబులేదు.

దానిమీద మన parodies పారడీలు జ్ఞాపకమున్నాయా?

కమలగారివ్వాళ్ళో చాలామందిమి పోగైనాము: కవులమూ, గాయకులమూ, బేవార్సువాళ్ళమూ. నాకు మద్రాసునించి వ్రాస్తున్న మెడికల్ స్టూడెంటు సుబ్బమ్మకూడా దిగింది. ఆమె నాకన్న గుప్పెడు పొడుగు, రెండింతలు లావు- ఆమె చిత్రాంగి ఎట్లా వేస్తుంది? కాని చక్కగా పాడుతుంది ఒక్కపాటమరీ......

ఏలాగు భరియింతును,

ఓ చెలీ, ఈ విరహమేలాగు?

అని. ఆమెకంఠంలో చక్కని జీరవుంది. ఒక్కసారే వీణలో రెండుతంతులు కలిసి మోగుతున్నట్టు ధ్వనిస్తుంది.

కమలా—స్త్రీ నేత్రాలతో సంభాషణ ప్రారంభించారు. పాపం, స—ఇంత కష్టపడీవొచ్చింది. ప—కి పిచ్చెక్కిచ్చింది. ఇవ్వాళన్నా నా మొండిగోడలయింట్లో, 'కటికరానేల పాన్పుగా' గడిపింది. అతన్ని పిలిపించడానికి నేనింత శ్రమపడ్డాను.

సరిగా యిరవై నాలుగు గంటలు అతనితో గడపలేదు. ఇవాళ ఆమెనీ, ఆమె అలవాట్లనీ, వెక్కిరిస్తున్నాడు అతను. భరించలేను, నిన్న తాను ముద్దుమాటలాడిన స్త్రీని—ఈవాళ వెక్కిరించడం.

రాత్రి డాబామీద వెక్కి వెక్కి ఏడ్చింది. అతను ఎందుకు తననించి విముఖుడైనాడో ఆమెకి తెలీదు. నాకు తెలుసు. నేనేం ఆశయివ్వగలను ఆమెకి? ఆశ లేదని చెప్పలేక, అన్నీ సరిగా జరుగుతా యని చెప్పచూశాను. ఏడుస్తో రైలెక్కింది.

కమల నన్ను పిలిపించి, ఇంత తొందరలో మనసు ఇంకొకరికి మార్చుకోడం భరించలేక, చాలా బాధపడుతున్నాను. చాలా తమా షాలు జరిగాయి. కాని ఏనిమిషానకూడా, నాకు చాతనయ్యే సమ యాలు తటస్థించినా, మండిపొయ్యే నాబాధని అతిక్రమించే 'జలసీ' గా మారనియ్యలేదని, వాళ్లకి ఏఆటంకంగా నేను మారలేదనేదే నా గర్వం. నేను చెయ్యగలిగిన సహాయంచెయ్యడంకూడా, కూడనిపని అనితోచింది.

అప్పుడే స——ని అట్లా betray చేసిన మనిషిని నమ్మమని ఎట్లా సలహా ఇవ్వగలను?

కమల మనసులో art మీది ప్రేమవుండనుకుంటాను. అది సులభంగా artist మీదికి transfer చెయ్యగలదనిపించింది.

వొంటరిగా, చాలాదిగులుగా వొచ్చేశాను. కాని ఏమిశాంతి లేదు. కమల అందం నన్ను చాలా బాధపెట్టింది. పైగా ఆమె నాయెడల క్రూరంగా నిర్లాకరించినా బాగుండును. సరిగా ఆ నాడు చం——సీనులు మళ్ల repeat అయినాయి. భరించను వెడతానంటే, వెళ్లనీదు. తన హృదయం విప్పి మాటాడదు.

mystery of mysteries
this
a woman's heart

ఎంత వొంటరిగావుంది! అమీనాకూడ ఎక్కడికో వెళ్లింది. నామిత్రులందర్ని, వాళ్లనడతల్నిచూసి జీవం నానించి మొహం తిప్పేశింది.

---

అర్ధరాత్రి. అంతా నిశ్శబ్దం. గాలి రవ్వకూడా కదలడం లేదు ఎక్కడా. ఎందుకో చప్పున, కారణంలేని భయంతో వులిక్కిపడి నిద్రలేచాను. వెంటనే నామనసు నీ మీదికి వెళ్ళింది. ఏదో, నీకేదో, ఆపద రాబోతోందని తోచింది ఏం చెయ్యాను? ఇన్నివందల మైళ్ళ దూరాన్నించి యీ అర్ధరాత్రి? తెల్లవారితే మాత్రం ఎవరికి టెలిగ్రాం యివ్వను? ఇంక యీ రాత్రికి నిద్రలేదు. నీకు కలిగే ఆపదని, నీకేమన్నా తటస్థిస్తే నేనుపడే వ్యథని, నువ్వు లేకపోతే భరించలేని నా ముందుజీవితాన్ని ఇట్లా మనని వేరుచేసిన శక్తిని, దేన్నో తెలీనిదాన్ని, తలుచుకుంటో, ఈ ప్రేమకి, యీ విరహానికి. ఈ జీవితానికి అర్థాలేమా అనే తర్కనతో చీకటని చీలుస్తో కూచుంటాను. నాలుగు గంటల్లో యీ చీకటిని చంపేసి వెలుతురి లోకాన్ని నింపుతుంది. కాని నా హృదయాంధకారానికి, నా వింత భయ జీమూతానికి, విరామం కలుగుతుందా; సూదులమల్లే కుట్టే నక్షత్ర కిరణాలు యీరాత్రి చీకట్లనికూడా చీలుస్తున్నాయి గాని, నాభయాలకి, నా నిరాశలకి ఏమూలా ఓదార్పు కనపడదు

దాహం. నీళ్ళులేవు. తలుపుకొట్టి కమలని నిద్రలేపడం యిష్టం లేదు. ఇందాకటిదాకా ఆమెతో పోట్లాడి, అలిగి, బైటవొచ్చి నిద్రపోయినాను. ఇంట్లో ఆ మనుషుల మధ్య నిద్రపోలేను. ఎందుకింత unsocial fellow ని ఐనానో తెలీదు. నువ్వే వుంటే— ఎందుకు ఆ ఆలోచన—నీ పెదవులనించి నా హృదయాన్ని నింపుకునే వాణ్ని. కాని యీ నిమిషాన, నువ్వేమైనావో, ఎట్లా వున్నావో; తెలీడానికి వీల్లేదా? ఏ శక్తీ, యేదైవమూ, నాకు తెలియచెయ్యడా? ఇంత గొప్ప ప్రేమకూడా మనని సన్నిహితుల్ని చేయలేకపోతే, దేవతల కారుణ్యాన్ని పొందలేకపోతే, యింకా దేవతలున్నారని విశ్వాసం నీకెట్లా నిలిచిందో నాకు అర్థంకాదు గాని!

నేను నీకు తెలీని వాణ్ణయి, కొత్తగా మీవూరువొచ్చి, నువ్వు గుళ్ళోకి నడుతూవుంటే, మొదట చూస్తే ఎట్లా వుండేది? ఏమనుకుంటాను? ఏం చేస్తాను? ఇట్లాంటి ఆలోచనలతో కాలం గడపుతాను. ఆ ఆలోచనల మధ్యనించే కొత్త కథలు పుడతాయి. నిన్ను మొదటిసారి చూడగానే, నా జీవితాన్ని పాలించే స్త్రీ, ఇంక నాకెక్కడా శాంతి అనేది లేకండా చేసే సౌందర్యం, నా జీవితాన్ని అగ్నితోనో అమృతంతోనో నింపబోతున్న నేత్రతేజస్సు కనపడ్డదని రూఢిగా తెలుసుకునే వాణ్ణి. వీపుమీద ఎవరో వెనుక విరిగేట్టు కొట్టినట్టయి స్తంభించి పోతాను. ఎవరితోనో మాట్లాడుతో నిర్లక్ష్యంగా నవ్వుకుంటో నువ్వు గుడిమెట్లెక్కి మాయమవుతున్నావు. ఎట్లా? ఇంక జీవితంలో కనపడవేమో, ఆ స్త్రీల గుంపులో కలిసిపోతావేమో, ఆ కార్తీక పౌర్ణమి కర్పూరాంజనాల చీకట్లలో! వొళ్ళు తెలీక, గుడి తలుపు ముందుకి పరిగెత్తి నీకు ఎదురౌతాను.

"మీతో మాట్లాడాలి" అంటాను.

నువ్వు తెల్లబోయి చూసి

"నాతోనా! ఎవరుమీరు?" అంటావు.

"నేనూ! నేనెవరైతేనేం? ఎంతో అవసరంమీతోమాట్లాడడం"

"ఏమిటా సంగతి?"

"వీళ్ళల్లోకాదు. విడిగా రావాలి"

చుట్టూవున్నవాళ్లు తెల్లబోయి చూస్తోవుంటారు. నువ్వుమాత్రం నావంక నిదానించి చూస్తో నిలబడతావు. నాకళ్ళలోనైనా, నన్ను కలిచిన భావాలు నీకు కనబడవా కొంచెంగా! కొంచెంగా కళ్ళని వాల్చి, ముందుకి, నావేపుకి రెండు అడుగులు వేస్తావు. నీతో వొచ్చిన వితంతువులు పళ్లు కొరుకుతారు. పుణ్యావనితలు చెంపలమీద వేళ్ళేసుకుని, ఇంటికి వెళ్ళగానే యీ విడ్డూర్యం ఎంత చొంగలు కారుస్తో చెప్పుకో వొచ్చో "ప్లాన్లు" వేసుకుంటున్నారు అప్పుడే. "ఈవాళ గుళ్ళోనే...!" అని వాక్యాలుకూడా ప్రారంభిస్తున్నారు. వుపోషమూ! ఆకలి, శివుడిమీద భక్తీ అన్నీ సమాప్తి వాళ్ళకి. ఇంక

ఆ రాత్రికి నువ్వూ నేనూ, వాళ్ళలోకం; వాళ్ళ దేవతలు, నేను స్తంభం చాటుకి వాళ్ళచూపులకి కూడా అందకండా దారి తీస్తాను, ఆ సింహద్వారం దగ్గిర, ఆ పళ్లెమూ, గిన్నె పెట్టి వొచ్చేస్తావు. నేను ఆగుతాను. నువ్వు నాముందు ఆగుతావు. నాకు మాటలు రావు. కళ్లు నాకేసి ఎత్తి ప్రశ్నిస్తావు. వాళ్లు, రెండువేపులా కమ్ముకుని తొంగిచూస్తున్నారు. కాని మనకి తెలీదు. నువ్వు, నేను అనే స్వరమిళిత మాధుర్యంలో విశ్వమే మరిచాము.

"ఎందుకు?" అంటావు. నేను చెప్పతలుచుకున్నది, తెలిసి నట్టే నీకు. నాకళ్లు ఎన్నో సంగితులు చెప్పేశాయి అప్పుడే. రెక్కలు కొట్టుకునే నా ఆత్మ ఎప్పుడో చెప్పగలిగింది నారహస్యాన్ని.

ఇంక తరువాత కథసాగదు. ఎట్లాగో నాతో వొచ్చేస్తావు.

బావుందా?

వుత్త అతిశయాలు వ్రాశాననుకోకు. చిన్నప్పుడు నీ బొమ్మ చూసినప్పణ్ణించీ ప్రేమించాను నిన్ను. ఆ బొమ్మని మావాళ్ళదగ్గిరికి తీసికెళ్ళి "ఈ అమ్మాయిని పెళ్లి చేసుకుంటాను" అన్నాను. "ఈ అమ్మాయా? ఏం అందంగావుంది?" అన్నారు. ఇది కలకాదు. నిజమే వ్రాస్తున్నాను. చెప్పానేమో నీకోసారి. నీసంగతంతా తెలుసు కున్న తరవాతకూడా, పెళ్లిఅయిందని తెలిసిన తరవాతకూడా నాకా సంగతులేమీ అభ్యంతరాలుగా తోచలేదు. ఎట్లాగో ఎప్పుడో నిన్ను కలుసుకుంటాననే నా నమ్మకం మొదటినించీ: నేను నా మొదటి కథ వ్రాసినప్పుడు— నాకేమాత్రం సందేహం కలగలేదు— తప్పకండా హృదయాల్లో పలుకుతుందని తెలిసింది. అంతకన్న యెక్కువగా నీతో నా జీవితం పెనవేసుకుందనే ఏమీ ఆధారంలేని నా నమ్మకం వాస్తవమయింది. నా నమ్మకమే నిన్ను నాదగ్గిరికి తీసుకొచ్చిందా, లేక భవిష్యత్తును ఎట్లాగో నేను చిన్నప్పుడే గ్రహించగలిగానా? నాకు పదహారేళ్లప్పుడు నేను ఒకరికి 'నాజీవితం వాఙ్మయంతో సంబంధం కలిగి నడవబోతోం'దని వ్రాశాను. ఏం ఆధారం ఆ వ్రాతకి? అని యోచిస్తే ఏమీలేదు. విచిత్రంగా ఏ

సంబంధమూలేని మనం కలుసుకోడమూ, అంతకన్న గొప్ప, ఏఅదృష్టం వల్లనో, ఏ వరంవల్లనో, నన్ను నువ్వు ప్రేమించగలగడమూ తట స్తించాయి. Miracles మిరకెల్సు అబద్ధాలంటారు చాలామంది. ఇంత అపూర్వమూ, అసాధ్యమూ, అసామాన్యమూ, అద్భుతమైన విష యం: వాస్తవంలోగాని, కథలలోగాని, కలలలోగాని, జరిగిందా అనిపి స్తుంది, ఆరాత్రి వెన్నెట్లో గేటుదగ్గిర నేను (ఇంకా కొత్త మనకి, ప్రేమతప్ప ఒకరనొకరం యెరగం) శలవతీసుకోవడం సేనించి. ఇంకా వుంటే మన కోర్కెలు తీవ్రతలో మళ్లీకల్పించుకోలేని యే బంధాన్ని తెంచుకుని, జీవన సముద్రంలో దూకిపోతాయేమోనని భయం. గేటు దాకా నడవడం—నేను బైటికి ఒక్కొక్క అడుగే. ఏ మిషమీద ఇంకా కొంతసేపు ఉండగలనా, ఉంటే నన్ను నేను నమ్మగలనా, అనుకుంటూ నడవడం గ్రహించి గాబును నువ్వు; నేను అవతలికి వెళ్లగానే చప్పున గేటు తాళంవేసి, కదలక అక్కడే నుంచోడం— పోచ్చేశానే అని నా పశ్చాత్తాపం—ఇంక మధ్య తాళంపడ్డ గేటు వుందికదా అనే ధైర్యంతో ఒకరిచేతులు ఒకరం—అదే మొదటిసారి పట్టికొని అట్లానే...ఎన్ని గంటలు!...చంద్రుడు డాబా వెనకకి వెళ్లి మనని నీడలతో కప్పిందాకా. మన వేళ్ళమధ్యతప్ప తక్కిన దేహమంతా మంచుతో తడిసిందాకా,... అట్లానే నుంచోడం జ్ఞాప కం వుందా? గేటు తెగవడానికిగాని, తెరవమనడానికిగాని ధైర్యం చాలదు.

ఇదంతా యీ చీకట్లో వ్రాస్తున్నాను. మళ్లీ నీకేదో ఆపద రాబోతోందనీ, పొచ్చిందేమో అనీ భయం కలుగుతోంది. నాలుగు రోజుల్లో నా భయాల్ని వెక్కిరిస్తో నీదగ్గిర్నించి వుత్తరం వొస్తుందని- ఎన్నిసార్లు వొచ్చిందికాదని- సమాధానం చెప్పుకున్నా భయం పోదు. ఎట్లా నాలుగురోజులు గడపడం! కాలాన్ని తుపాకితో కాల్చి చంప డానికి వీల్లేదు, ఏప్పొచ్చినొక్క యీ గడియార్ని తొరగా తిప్ప లేనూ? ఒక్కొక్క తారీఖునే పట్టుకుని గొంతు నరకడానికి ఎవరి తరమూకాదు. వేదాంతులు కాలమూ దూరమూ మనసు కల్పించు

కునే మాయ అనే పుస్తకం చదువుతున్నాను. అదెట్లా నిజమునే సమస్యకన్న—దూరమునేది లేకపోతే, నువ్వు నాదగ్గిర వుండ వొచ్చునుకదా? కాలమునేది లేకపోతే నాలుగు నెలలు యిప్పుడే గడిచిపోయి నువ్వు రావొచ్చునుగదా అని వెర్రిపడుతున్నాను. ఆ పుస్తకం వ్రాసిన ఆయనకి, "నువ్వు వొచ్చి ఓసారి యీ దూరం మాయం చేసిపో. నాకు కొంచం అవసరంవుంది" అని వ్రాస్తే! దూరమూ కాలమూ మనసులోంచి మాయం కావడానికి తపస్సు అవసరమంటారు ఈ దేశపు వేదాంతులు. కాని తపస్సు చాలైతే వాటితోబాటు నువ్వు దగ్గిరికి రావడం బదులు, వాటితో నువ్వూ మాయంకావుగద!

పతివ్రతలు భర్తల ఆరాధనవల్ల అంత గొప్పశక్తులు సంపాయించారే, స్త్రీని నిన్ను ఆరాధించే నాకు, గొప్ప శక్తులు కలగ కూడదూ? నేనూ నువ్వూ కలుసుకునేందుకోసం ఎన్ని మార్పుల్ని, ఎన్ని విప్లవాల్ని కలిగిద్దును యీలోకంలో! ఆలోచించుకో.

నువ్వులేనప్పుడు వొంటరి పక్కమీద చలిలో నిద్రాదేవి మాత్రమే నన్ను పలకరిస్తుంది. కాని నీ తలపు ఏమాత్రమన్నా నన్ను సమీపించిందా, కోపమొచ్చి ఆ దేవి లేచిపోతుంది. ఇంకా నావేపు రాదు రాత్రికి.

ఇన్నాళ్లు నాదగ్గిర్నించి ఉత్తరం రాలేదేమా అని నువ్వు ఆత్రుతపడుతున్నావా? పడవు. నువ్వు తొందరపడి నాకు వ్రాస్తావేమో, చూడాలనే కోర్కెతోనే చాలానాళ్లు వ్రాయడం అలస్యం చేస్తాను. కాని నువ్వు వ్రాయవు. "ఏం భయం??" అని అక్షరాలతో నవ్వుతావు? "నీకే తీరికేవుంటే నాకువ్రాయకండా వుంటావా? మొగవాడివి. నీకేం ఆపద! నా ప్రేమ నిన్ను కాపాట్టంలేదా?" అంటావు పైగా! కాని నువ్వు భయపడలేదేమూ, అని నాకు యీర్ష్య? నన్ను చాలా ప్రేమిస్తే వ్రాయవా? నా ప్రేమే గొప్పది అని సమర్ధించుకుంటాను. నీకు అపాయాలు వొస్తున్నాయని భయపడుతో రాత్రులంతా మేలుకు కూచునే నా ప్రేమే గొప్పదో, 'నా ప్రేమ

వుండగా ఏం అపాయలు వొస్తాయి!?' అని విశ్వాసంతో పలకని నీ ప్రేమ గొప్పదో? ఎవరు నిర్ణయిస్తారు మనమధ్య.

కాని నువ్వెందుకు భయపడవా అని నాకోపం. నేనెవరి నన్నా ప్రేమించకూడదా? నిన్ను మరిచిపోకూడదా? నీతిపరుణ్ణయి మన ప్రేమను పాపమనుకునే దుర్గతికి దిగకూడదా? యోగినై యివన్నీ తుచ్ఛమైన బంధాలని ముక్కు మూసుకోకూడదా? లాభంలేదు. నీకేం భయంలేదు "వెర్రివాడా నామీద నీకెంత ప్రేమో నాకు తెలీదా!" అంటావు నువ్వు చిరునవ్వుతో, ఆ చిరునవ్వు చూసే భాగ్యంలేదు నాకు ఇప్పుడు.

నిన్ను తలుచుకున్నప్పుడే, నాకు పూర్వ జన్మాలలో నమ్మకం కుదురుతో ఉంటుంది. మన అనురాగం యీనాటిదికాదనీ; సృష్టి అనాదిగా ప్రారంభమయి క్రమేపీ అభివృద్ధిచెంది, కొత్త రంగుల్ని పొందిందనీ తోస్తుంది. ఇద్దరమూ ఒకే చెట్టుమీద పచ్చపువ్వులుగా, ఒకే అడవిలో జింక జంటగా, ఒకే దేశానికి ప్రాణాలర్పించిన యోధులంగా, ఎన్నో జన్మాలు గడిపాము. ఒక్కొక్కసారి కలుసుకుని విడిపోయి, ఒకరికోసం ఒకరం, ఎవరికోసమో తెలీకండానే, విరహాలు పడి, తపస్సులు చేశాము. నీ కళ్లల్లోకి చూస్తో నిశ్శబ్దంగా కూచున్నప్పుడు—ఏమిటి ఆలోచిస్తున్నావు? అని అడుగుతావే, అప్పుడు యిట్లాంటివి, సగం సగం జ్ఞాపకం వొచ్చే పూర్వానుభవాలు తోస్తో వుంటాయి. కారణంలేని భయాలు, అర్థంకాని ఉద్రేకాలు, సాధారణంగా కలగని స్నేహభావాలు, అసలు చెప్పలేని మనసుకే అందని, యీ దేహానికీ, మనసుకీ చెందని ఆకాశపు అనురాగాలు తడతాయి. ఎక్కడో అంతరమైన ఆత్మల్లో కాకపోతే, నీ చిన్నబొమ్మని చిన్నప్పుడు చూడగానే ఎందుకంత పూర్వ పరిచయం తోచాలి? మళ్లీ పెద్దయినాక, చీకట్లో తలుపు దగ్గిర జాలిగా నుంచున్న నిన్ను ఎట్లా గుర్తించగలిగాను నా జీవితానికి అర్థం నువ్వేనని! నిన్ను మళ్ళీ చూడాలని, పలకరించాలని ఎన్ని విశ్వప్రయత్నాలు చేశాను! తలుచుకో, ఆ దినాలలో క—కీ నాకూ

స్నేహం. ఒక్క నిమిషం విడిచివుండేవాళ్లం కాదు. బంధువులం కావడం చేత మా పరిచయం సులభమయింది. ఆమె నన్ను ఎంత ఆరాధించేది! నావెనకనే తిరుగుతో, ఒక్కచూపుకోసం మాటకోసం, కనిపెట్టుకుని నన్ను తనవేపుకి తిప్పుకునే ఆ స్నేహం, ఎండలో దీపంవలె కనపడడం మానేసింది. ఆ కన్న అందమైన దానివా? నీసంగతి నాకేం తెలుసు? ఏమిటి ఆకర్షణ!! నమ్ముతావా, యిప్పుడైనా, మన పరిచయం పురాణమని, ఆదిమధ్యాంతరహితమని! మొన్న నామిత్రులు Love at first sight అనేది వుంటాలేదా అని నాతో తర్కిస్తున్నారు. కొందరికి వుంటుందన్నాను నేను. రూఢి చెయ్యడానికి ఏమీ చెప్పలేను—నీ సంగతిమాత్రం మనసులోవుంది. వెన్నెలకన్న మృదువుగా స్వచ్ఛంగా వెలిగే మన ప్రేమ- మాటల లోకి పెదవుల్ని దాటి వొచ్చిందా- లోకంలో ఎంత చవక! ఎంత nastyగా మారుతుంది!

అకాత్తుగా కమల వొచ్చింది. మళ్లీ మాగాథ మొదలు- ఎట్లా పరిణమిస్తుందో అని భయం ఆమె వుద్దేశ్యం అగ్రాహ్యం. మళ్లీ నా దగ్గిరికి ఎందుకురావాలి? నన్నెందుకు తనని మరిచిపోనీదు? వెళ్లమన లేను. ఆమె వున్నంత సేపూ ఆశన్నా నన్ను బతికిస్తో చంపుతో వుంటుంది. ఇట్లాంటప్పుడు, మనసేకాదు, నాశరీరంకూడా బాధపడు తుంది. జ్వరంతో కొట్టుకున్నట్టు- యీ మోహవిషాన్ని వొదిలించు కోవాలని అరుస్తుంది రక్తం. కాని శక్తిలేదు. దేవుడేవుంటే saints చేసినట్టు, ఆయన శరణుచొచ్చి పాదాలమీదపడి ఏడుద్దును.

'ఆమెని ఇయ్యనన్నా ఇయ్యి—

వొదిలించనన్నా వొదిలించమ'ని.

నీకు పెలిగ్రాం ఇవ్వగలిగితే! నీ దగ్గిరికి పారిపోతే! అన్న తలపు నిరంతరమూ మనసుని తడుతో వుంటుంది. భయంకరమైన కలలో వున్నట్టూ, వొదిలించుకుని లేవాలన్నట్టూ ప్రయత్నిస్తాను. ఆమె అప్పుడప్పుడు రాక్షసిలాగు కనపడుతుంది. నేను చదివిన కథ

జ్ఞాపకం వొస్తుంది. బ్రహ్మరాక్షసి అందమైన స్త్రీరూపాన ఒకయువకుణ్ణి ఆకర్షిస్తుంది. కాని ప్రతిసారీ, అతని రక్తాన్నీ, నెముకల్నీ ఆ విధాన పీల్చేస్తుంది. అతనికి తెలుసు చచ్చిపోతున్నానని. కాని రాత్రి అక్కడికి వెళ్లకండా నిలవలేడు.

నువ్వు తప్ప నాకింక రక్షణమార్గం కనపట్టంలేదు. ఈ వుత్తరాలతో తప్ప అందవు నువ్వు. రాలేవా ఓసారి.

అమీనా, నావిచారం అర్థంకాక, ఏడుస్తుంది. చెప్పమంటుంది. తను తీరుస్తానంటుంది.

కమలకి వశ్యురాలు. ఎట్లా చెప్పను? ఏంచేస్తుంది చెపితే మాత్రం? నాకు భయమేస్తోంది. అందరిమల్లే స్త్రీలతో ఆడుకుని, వొదిలేసి తిరగగల స్వభావం నాకి ఎందుకుకాదా అని యేడుస్తాను! కాని అప్పుడు నువ్వు నాకెక్కడ వుండేదానివి! నిన్ను కటాక్షించిన ఆగుణమే, నాకీబాధల్ని తీసుకొస్తే,

రానీ అనుభవిస్తాను.

ఈ బాధనంతా, అశ్రు పుష్పాలుగా మార్చి, నీ పాదాలవద్ద అర్పిస్తాను.

---

మద్రాసునించి వొచ్చి నీ వుత్తరంచూశాను ఇవ్వాళే. నీ ప్రశ్నలకి జవాబు వ్రాసేముందు అక్కడ ఏం జరిగిందో వ్రాయనీ. అక్కణ్ణించి వ్రాయడానికి ఒక్క నిముషం ఊపిరి తిరగలేదు.

నేను వెళ్ళేప్పటికి మద్రాసులో కాంగ్రెసు జరుగుతోంది. చాలామంది నేనెరిగినవాళ్ళూ, ఎరగనివాళ్ళూ చేరారు. కాంగ్రెసు చూడాలి. నాపనులు ముగించుకుని, నాలుగురోజుల్లో తిరిగిరావాలి. అవీనాకి వాగ్దత్తం.

ర___ని చూడ్డానికి వెళ్ళాను శనివారం మధ్యాన్నం. కాయిలా పడిలేచింది. నన్ను చూసి విడవలేదు. గంటలో వొస్తానని వెళ్ళిన వాణ్ణి, వారం తరవాత శుక్రవారం సాయంత్రం ఆమె గదినించి బైటికి వొచ్చాను. అన్నాళ్ళూ ఇరవై నాలుగు గంటలూ ఆగదిలో ఆమె మంచంమీదే గడిపాను. నన్ను వొదిలేం తరవాత యీ నెలలలో జరిగిన చరిత్రంతా చెప్పింది.

ఎన్ని హృదయభేదకాలైన విషయాల్లోంచి బైటపడ్డవంటావు! ఎట్లా వొదలిపోనూ ఆమెని! సు___వొచ్చాడు. రా___ఉత్తరాల్లో అతని పేరు తెలుసునావు. ర___కి వశ్యులైన మనుషుల కళ్ళల్లో కలిగే చూపు, అతని కళ్ళలో ఇంకా గాఢంగా కనపడ్డది. ముగ్గురమూ అన్ని గంటలూ ఆగదిలోనే___తిండికూడా

ఆమె మాటలు వింటేనే తెలిసింది ఇంక రా___కి ఆశలేదని. పాతప్రియుణ్ణిగాని, భర్తనికాని వొదలి ఇంకొకర్ని ప్రేమించడానికి ప్రతిస్త్రీకీ స్వేచ్ఛవుండాలి, కాని అది వుపయోగించవలసిన అవసరం కలగడం దురదృష్టమంటాను. అందులో రా___వలె తన జీవితాన్నే స్త్రీకోసం ధారపోసిన ప్రియుల్ని వొదలాలంటే- పాత sentiments కృతజ్ఞతలు, అడ్డంరాకపోతే స్త్రీ హృదయానికి- ఆ

హృదయం చాలా కఠినమైన దంటాను. అందానికి ఆకర్షణకి చరిత్రలో ప్రసిద్ధికెక్కిన స్త్రీలలో, గొప్ప ప్రేమకథలు నడిపిన స్త్రీలలో, నే నెరిగిన వారిలో, నేను ఇదే చూశాను.

ప్రేమ మారిందా వారు ఇంక ఏ finer feelings నీ అడ్డం రానీరు. పాత ప్రియుడు బతికి వున్నాడనే మరిచిపోతారు. అందు వల్లనే ప్రపంచం వాళ్లని ఎన్నడూ క్షమించదు. రాక్షసులకింద జమ కడుతుంది. కాని—వారి స్వభావమే వేరు- ఈ అసమాన సౌందర్యవతు లది. వారి నీతిశాస్త్రమే వేరు. తక్కినవారి ధర్మాలు వాళ్లని బంధిం చవు. అట్లా చూడకపోతే ర—ప్రవర్తనని, రా—ని అంతసులభంగా మరిచిపోవడాన్ని నేను క్షమించలేను- ఎందుకంటే అట్లా మరిచిపో గల శక్తి నాకులేదు కనక కాబోలు!

ఆ సాయంత్రం మేము బ్రహ్మసమాజం కాన్ఫరెన్సుకివెళ్లాము. ఒకప్పుడు మాకు చాలా ఆప్తులైనవాళ్ల మొహాల్ని దూరాన్నించి చూశాము. గుమ్మం దగ్గిర సె—కనపడ్డది. నాతో చిన్నప్పుడు గంతు లేసి, ఆడుకునే ఆ అమ్మాయిని చూస్తే చాలా కలవరం కలిగిందినాకు. నన్ను గుర్తించి మొహం తెల్లనై తప్పుకుంది. నేను బ్రహ్మరాక్షసిననీ, ఆడపిల్లల్ని ఎత్తికెళ్లి వొండుకుతింటాననీ, చెపుతారుగావును. చెప్పరు- ఏవో భయంకరమైన అర్థంలేనిమాటలు- నిట్టూర్పులు- suggestions ఇస్తారు.

పిల్లల మనస్సులు తక్కినవి అల్లుకుంటాయి. వితంతువివాహం చేసుకుందని అబ్బత్త సంగతి మా పెద్దవాళ్ళు ఆమెపేరు వుచ్చరించే వారుకాదు. ఆమె సంగతి రహస్యంగా మాట్లాడుకునేవాళ్ళు. నా మనసులో ఆమె భయంకరమైన భూతంగా తోచేది చిన్నప్పుడు. ఆమెని చూసింతరవాత- నీకు తెలుసు ఏమయిందో! వాళ్ళు పెట్టిన చిన్నప్పటి భయాలు నామనసులోని attraction కి సహాయపడి వుండవా! సె—మొహంలోకూడా నన్నుచూస్తే అణుచుకోలేని curiosity;ఎవరూ చూడకుండావుంటే నాతో మాట్లాడాలనే ఆసక్తికూడా చూశాను.

సాయింత్రం — స్త్రీ వొచ్చి తారనాద్ రాఘవాచార్ల గారి నాటకానికి వెడదామని పిలిచారు. తారనాద్ గారిని నేను ఎప్పుడూ చూడలేదు. కాని ఆయన విషయమై ప్రజలు చెప్పుకునే విపరీతమైన scandals వింటే, ఆయన మహాపురుషుడై వుండాలనిపించింది.

కమలావాళ్ళూకూడావొచ్చారు. కమలమళ్ళీ నన్ను ఆకర్షించాలని ప్రయత్నించింది. నన్నూ —స్త్రీనీ ఇద్దర్నీ సమర్థించుకోవాలని చూస్తున్నట్టుంది. ఆమెనిచూసి, నేను కళ్ళు తిప్పుకోలేక పోయాను. కాని నా self-respect ని నేను వొదులుకోతలుచుకోలేదు. మళ్ళీ, ఆపాత నిప్పులో చిక్కడం తలుచుకుంటే భయమేస్తోంది. అదిగాక — స్త్రీ ప్రేమ సంపాయించడంకోసం నామీద అబద్ధపు సంగతులు చెప్పింది. అతని ప్రవర్తనని సమర్థించుకోడంకోసం అతనువాటిని ప్రచారంచేస్తున్నాడు. తన భర్త అనుమానాల్ని తప్పించుకునేందుకు నామీద ఇంకా నిందలుమోపి నట్టుంది. నామీద చల్లేబురద అతని కంటోకారంగా మారాలని ఆమె వుద్దేశ్యం. సరిగా చం — చరిత్ర అనుకో. చం — మళ్లేనే నాకళ్లని మెరిపించి, దయచూపి, తన కొంగుకి కట్టుకోవాలని చూసింది. కాని తన్ను ఆకర్షించడంవల్ల నాకు కలిగే బాధా, తనకి కలిగే సమస్యలూ, బాధ్యతలూ, ఆమెకి అఖ్ఖర్లేదు.

నేను ర—కి ఆమెచర్య చూపి, ఆమెని నిరాకరించాను. మాకు ప్రబలవిరోధం కలగబోతోందని అనిపిస్తోంది.

—స్త్రీమాత్రం యీకొత్తమోహంతో చాలా వున్మత్తుడు, ఉత్సాహవంతుడు, కొంత ధైర్యస్తుడుగా ఐనట్టు కనపడుతున్నాడు. ప్రేమ మనుషుల్లో అణిగివున్న ఎన్ని సుగుణాల్ని బైటికి తీసుకొస్తుందీ, అట్లానే ఆ ప్రేమవిచ్ఛిన్నంకాగానే, ఎన్ని కులకులలాడే పాముల్ని జెర్రుల్ని బైట పెడుతుంది!

ఆ కమలలో ఒక గొప్పశక్తి, తెలివి వుంది. పురుషుల్ని కీలు బొమ్మల్ని చేయగల స్త్రీలు అందరిలోనూ వుంటుంది కొద్దో గొప్పో.

పురుషుడు తను ఏవిషయంలో అధికుణ్ణి అని నమ్ముతున్నాడో, ఆ విశ్వాసాన్ని ద్రుఢపరుస్తుంది. దానివల్లనే హృదయంకరిగిందనిపిస్తుంది. ఎవరూ చూడలేని గొప్పతనాల్ని తాను చూశానంటుంది. లేక నిజంగానే చూడగలదో!

ఇదే పురుషుడిమీద స్త్రీ influence ఇట్లాంటి అసాధారణమైన ప్రోత్సాహంవల్లనే తల్లులూ, వేశ్యలూ, సాధారణ మానవుల్ని గొప్ప యోధుల్నీ artists నీ చెయ్యగలిగారు. తమకి మోహం చలించగానే, ఎంత ధీరుల్ని ఏడిపించి, కాలికిందనలిపి, పిచ్చెక్కించి, తమని చంపేట్టుగానో, వాళ్లనివాళ్లు చంపుకునేట్టుగానో, లోకాన్ని క్షోభపెట్టేట్టుగానో చేస్తారు.

తారనాద్ గారి సంగీతంవిన్నాను ఆనాడు. అంతవరకుఎక్కడా అట్లాంటి పాటవినలేదనిపించింది. ఆయిన ఇవతలకివొచ్చి వెళ్లపోతో వుంటే, అట్లానే వెంటచూస్తోనుంచున్నాను. ఎంతో ఆకర్షణవుంది ఆయనలో. ఆయన్ని ఇంకా తెలుసుకోవాలని వుందినాకు. ఎట్లా! ఆకర్షణేకాదు ఆత్మౌన్నత్యం కనపడ్డది. ఆసంగీతం ఆయన కంఠం గొప్పతనంకాక ఆత్మగొప్పతనాన్ని వ్యక్తపరిచినట్టు feel అయినాను.

కాంగ్రెసు చూడలేదు. రోడ్డుమీద అడుగుపెట్టలేదు ఇంక, స్నేహితుల్ని కలుసుకోలేదు. అమీనా బెంగపెట్టుకుందేమోనని వొచ్చేశాను. నన్ను ప్రేమించిన స్త్రీ, నన్నునమ్మినబిడ్డ, కన్నీటిచుక్క, నాకుగొప్ప attractive obstacle —నావల్ల బాధకలుగుతుందేమోననే భయంతో, సాధారణ ప్రజలని ఆకర్షించే స్నేహితులు, కీర్తి, గొప్ప, అన్నిటినీ సులభంగా ఆలోచించకండా త్యజించే స్వభావంతో నేను పుట్టినట్టు తోస్తుంది.

ఇంక నీ వుత్తరం—

ప—స—ఇద్దరూ మద్రాసువొచ్చారు. ప—నాతోమాట్లాడ్డం మానేశాడు.— స్త్రీకోసం తన భార్యరావడం బాగానేవుంది. స్త్రీ—ఇంకావాళ్ల స్నేహితుడుగానే వున్నాడు. మధ్యనేను విరోధినైనాను. అతనికి నామీద అంతకోపంరావడానికి ఏదో ప్రబలమైన mis-

understanding వొచ్చివుండాలి. ఎట్లా వొచ్చింది. స— తప్ప ఇంక ఏమీకనపట్టంలేదు. తన కుటుంబ సౌఖ్యం కోసం, తన భర్తతో సఖ్యంకోసం,—స్త్రీమీద భర్తకి అనుమానం లేకండా కాపాడడానికి తక్కిన స్త్రీలమల్లేనే, చం— వలె, కమలవలె, విమలవలె నన్ను బలి ఇచ్చి వుంటుందనుకుంటాను.

కానీ, ప—నాతో మాట్టాడకపోతే నాకు ఆట్టే దిగులులేదు. నాకు explanations చాలా అసహ్యం. To be misunderstood has become a life-habit. అందులో ప—బ్రహ్మసమాజానికి అమ్ముడుపోయినాడు. చాలా charming companion in exile. అంతేకాని అతని refiined selfishness ని, exhaulted vanity ని భరించడం కష్టం.

మంచికేవొచ్చింది. పుచ్చిన ఒక బంధం విడిపోయింది.

రా— తప్ప నాకుస్నేహితులులేరు. ఇద్దరమూచాలమా, అదుర్గు పుట్టించడానికి!

"ఈ గొప్ప అంతా నువ్వు నాలో కల్పించుకుంటున్నావు గాని, నాలో ఏముంది?" అని వ్రాశావు. అవును నిన్ను రోజూ మీవూళ్ళో చూస్తున్న వాళ్లు, నీ బంధువులు_ నేను నీలో చూడగలిగిన దివ్యతేజస్సుని ఎల్లా చూడగలరు? అంధులు. వాళ్లకి నా సంగతి తెలిస్తే, నేను నిన్నిట్లా పూజిస్తున్నానని "డ్రీమర్", అంటారో, లేక వున్మత్తుడంటారో, లేక కామాంధుడే అనేస్తారో!" తాను వొలిచింది "రంభ" అంటారు. "రంభని నేను ప్రేమించను. రంభకన్న ఉన్నతురాలైన సంగతి మీకళ్లకెట్లా కనపడుతుంది? మీకే ఆమె అర్థమైతే, మీవంటిదే ఐవుండును. అప్పుడు మిమ్మ్నెంత ప్రేమిస్తున్నానో ఆమెనీ అంతే ప్రేమించి వుందును." అంటాను నేను. " రంభకన్న ఔన్నత్యం ఎక్కడవుంది? " అని వాళ్లంటే నా హృదయంలో నంటాను. అసలు రంభ ఎక్కడ

పుట్టింది? సాధారణ సౌందర్యంతో తృప్తిపడక ఉన్మత్తుడై కలలు కన్న కవి హృదయంలో పుట్టింది.

You are not wrong who deem
That my days have been a dream
Yet if hope has flown away
In a night, or in a day
In a vision or none
Is it therefore the less gone?
All that we see or seem
Is but a dream  within a dream.

ఊర్వశి ఈనాటికి క్రిష్ణశాస్త్రి హృదయంలో కలికాలానికి పునర్జన్మను పొందలేదూ? గొప్పగా, తేజస్సు కళ్ళముందు వున్నా రెప్పలువిచ్చి, చూడగల శక్తిలేదు చాలామంది మనుషులకి. నా కథల్ని తిట్టే మనుషులకి చాలమందికి స్త్రీ అనగానే ఒక్క భాగమే ప్రాముఖ్యంగా కనిపిస్తుంది కళ్ళముందు. అందువల్లనే స్త్రీపరమైన కథలు అసహ్యం కలిగిస్తాయని గోలపెడతారు. ఎప్పుడూ స్త్రీ చరిత్రలే వ్రాస్తావే అంటే; సృష్టి స్త్రీ స్వరూపం గనక అంటాను నేను. నీవు నా అపరదేవతవి, మంగళమూర్తివి. నిన్నే ప్రేమిస్తాను. ఆరాధిస్తాను. నీ నుంచే, నిన్ను ఆధారం చేసుకునే, సౌందర్య శక్తిని అందుకుని సృష్టి రహస్యాన్ని సాధించి యోగినౌతాను.

నువ్వే నాకు కనిపించకపోతే, ఎన్నో పోగొట్టుకున్న ఉన్మత్తుడివలె, ప్రేమ, జీవితం, సౌందర్యం యివేమీ అర్థంగాక, యింకా భూమ్యాకాశాల్ని వెతుకుతో వుండేవాణ్ణి. అందువల్లనే నాకు మరింత అమూల్యమైనావు. నాకు గురువు సర్వకామ్యాలూ సిద్ధింపచేసుకోడానికి ఉపదేశించిన మంత్రం నువ్వు. నీవు వినా నాకు భవిష్యత్తు లేదు, వర్తమానంలేదు.

నా హృదయాన్ని వెలిగించే నీజ్యోతితో తృప్తిపడడం యింకా చాతగాక, హృదయఫలకంమీది- మసక యింకా వదలక, నిన్ను నీ దేహంకోసం, నీచేతుల స్పర్శకోసం, నీచూపుల మాధుర్యంకోసం ఇట్లా విరహపడి విలపిస్తాను. ఈ వియోగమనే అగ్నిని రగిల్చి వెలిగించివుంచి నీపీఠందగ్గిర, నా లోపలి చీకటి మూలలకి వెలుగునీ, వేడినీ వ్యాప్తిచేసుకుంటాను, మనం కలుసుకున్న రెండురోజుల ఆనందమూ, ముందు రాబొయ్యే నెలలవియోగాగ్నితో మండుతోనే వుంటుంది కద! ప్రేమతో చూసుకుంటున్న మనకళ్లలో, భయంతోకూడిన చీకట్లు కలవకండా వుండవుకద! ఎందుకంటే—మనమధ్య, మనని వేరుచేసే అభ్యంతరాలు, మనం కల్పించుకున్నవే గనక! సంఘ చట్టాలను నిమిషంలో తిరస్కరించగలం. కాని హృదయం యేర్పరిచే ధర్మాల్ని మీరితే ఆత్మగౌరవం నశిస్తుంది. ఇంక ప్రేమకి చోటేదీ!

నువ్వు తప్ప నాకింక ప్రపంచమే లేకండా చేసుకోవడంవల్ల దేనిలోనూ ఆసక్తిలేకండా, యింక యేమిత్రులమీది అనురాగానికీ స్థలంలేకండా కావడంవల్ల, నేను ఏకాకినైనాను. నానించి రాగం ఏంది, ఎవరు నాకై లక్ష్యంచేస్తారు! మనుషులు నాకు ఉత్తపేర్లు, నీడలు, తాత్కాలిక సంబంధాలు. నిన్ను నిరంతరమూ కోరికోరి,నిరాశతో భస్మమౌతో వుంటాను. నాబాధని నాలేఖలలో నీకు అందించి, నిన్ను కలవరపెడతాను.

ఎవరితోనూ మాట్లాడాలని వుండదు, ఏవూరూపోయి చూడాలని వుండదు, ఏప్రపంచ వ్యవహారాలూ తెలుసుకోవాలని వుండదు- ప్రేమకథలూ, ప్రేమపద్యాలూ తప్ప ఏవీచదవాలని వుండదు. అప్పుడప్పుడు ఈ సృష్టి సమస్యను ఏ వేదాంతికాని తీర్చాడేమోనని వెతుకుతాను—ఆ సమస్యలో మన ప్రేమా, మృత్యువూ, ఈ విరహమూ, నా నిరంతరమైన ఈ అశాంతీ అర్థమవుతాయేమోనని.

ప్రపంచమిచ్చేకీర్తి, ధనం, స్నేహం నాకు అక్కర్లేదు. నువ్వు తప్ప, నన్ను ఎవరు పొగిడినా, నాకు ఆనందంరాదు. నానించి మెప్పును పొందాలని, రచయితలు నాముందు నన్ను మెచ్చుకుంటే,

నేను చాలా ఇబ్బంది పడతాను. కాని నా చేతకానిది నటించడం నాకు అసహ్యం.

ఇందువల్ల నేనేమో, ప్రపంచానికి నన్ను చూస్తే కోపం అనుకుంటాను.

ఎందుకంటే ప్రజలు తనమీద అధికారంచేసి న్యూనతచేసే వాళ్లని గౌరవిస్తుంది; స్వంత విచారాలు చెప్పుకుని వాళ్ల 'సింపతీ'కి యాచించే నిర్భాగ్యుల్ని ప్రేమిస్తుంది. కాని తనజోలికి రానివాళ్లని, ఉపేక్ష చేసేవాళ్లని, మారమని గోలపెట్టే వాళ్లని ద్వేషిస్తుంది.

టాగూరు వ్రాశాడు ఇద్దరు ప్రియుల సంగతి–

"మాకేమీ వొద్దు యీ మూల యీ స్థలం చాలు. సైన్యాలు యుద్ధాలు చేసినా సరే, మమ్మల్నిమాత్రం disturb చెయ్యకండి. రాజ్యాలూ, ధనాలూ, అన్నీ మీరే అనుభవించండి. మమ్మల్నిద్దర్ని ఒకర్ని ఒకరికి వొదలండి. అంతేచాలు వెయ్యి నమస్కారాలు" అంటారు.

మనమే కలుసుకుంటే, ఎట్లాగో మనం కలిసి వుండిపోవడమే తటస్థిస్తే ఇంక నేను ప్రపంచానికి కనపడతానా, ఎవరితో నన్నా పలుకుతానా, ఇంక ఏపనన్నా చేస్తానా, ఎక్కడికన్నా వెడతానా, నిన్నుచూస్తో, నీచిన్న వేలునీ, మాటనీ, చూపునీ, ఆరాధిస్తో, మృత్యువు మనని మింగెయ్యకముందే నిన్ను నాలోకలుపుకుని, నిన్నూ, నన్నూ, విడతియ్యడానికి వీలులేని స్థితిని విధికి కల్పించనా అనిపిస్తుంది. నా బాధని భరించలేక, desperate ఐ, యీ విరహం వల్ల మృత్యువు ఆసన్నం కాకూడదా! అప్పుడన్నా, మనం మన వివేకాన్ని జయించి, జీవితాల్ని ప్రేమాగ్నికి ఆహుతి చెయ్యమా అని తపనపడతాను.

O Human Love, thou spirit given
On Earth, of all we hope in heaven.

ఇప్పుడు నేను పూర్వంమల్లే నీనించి ముద్దులు కావాలనీ, నిన్ను తాకాలని కోర్కెవుందనీ వ్రాయకపోవడం నీకు వింతగా వుందా! బాధ కలిగిస్తోందా! నా ప్రేమ తక్కువైపోయిందనీ నా మనసు చలించిందనీ, నువ్వు నాకంటికి పాతబడ్డావనీ అనుకుంటున్నావా? మనం హైవేలో కలుసుకున్నప్పుడు నువ్వు అనలేదూ? ఆ రాత్రి మనిద్దరమూ హోటలు వరండాలో తోటముందు అర్ధరాత్రి నిశ్శబ్దంలో కూచున్నప్పుడు...లోపల ర—నిద్రపోతోంది...మనిద్దరం వరండాలో కుర్చీలలో కూచున్నాము. ఆరాత్రి మనకి శరీరంమీద ధ్యాసేలేదుకద! కాని ఆనందం ఏమన్నా కొరతపడ్డదా? ఈ శరీరాలు పోయినా కూడా ఒకరినించి వొకరం ఆనందించగలమేమో! ఇంక మరణమంటే భయమేముంది!

ఆరాత్రి మనం, ఎన్నో గడిచిన సంగతులు, కలలు, సంయోగాల స్మృతులు వియోగాల ఆతురతలు—కొంచెంగా నక్షత్రాల కాంతిలో, కొంచెంగా చెట్టులోంచి పడే రోడ్డుదీపం కాంతిలో, ఎట్లా మాట్లాడుతున్నాము...ఆ నల్లని రాత్రి, మర్నాడు విడిపోతామనే దిగులుతో, అప్పుడే అడిగావు ఆరాత్రి.

"ఇప్పుడు; నన్ను ఇదివరకంతటి తీవ్రతతో వాంఛిస్తున్నావా?" అని. అప్పుడు దగ్గిరవున్నాను గనక ఆ చీకట్లోకూడా చెప్పగలిగాను నాకళ్లతోనే నీ ప్రశ్నకి ప్రత్యుత్తరం. ఇప్పుడు మాటలతో యీ అక్షరాలతో చెప్పాలి. మాటలు! మాటలు! ఎంత అర్థంలేని మొద్దులు యీ మాటలు! హృదయార్థాన్ని దాచడానికి ఉపయోగించే యీ మాటలు! మాటలే లేకపోతే యింత మోసం చెయ్యలేరు మనుషులు! ఈ మాటలతో నా నాప్రేమని నీకు తెలియచెయ్యాలని ప్రయత్నించడం నేను?

నీ శరీరాన్ని తదేక ధ్యాసతో, విపరీత మోహంతో పూజించడంవల్ల, చిరునవ్వు కింది నీపెదిమ చివరలను, నీమెడమీద జుట్టును, నీ పాదాల యెరుపును, నీ కనుకొనుకుల్లోని దయను! అదేవిధిగా

ధ్యానించి ధ్యానించి, నీ ఆత్మని అందుకోగలిగాను గావును, అందువల్లనే క్రమంగా నీ శరీరంమీది మమకారం, నా చేతుల్లోని తీవ్రత, నా మాటల్లోని వాంఛ, అన్నీ జీర్ణించినట్టు, కనపడుతున్నాయి.

ఒకప్పుడు నా జీవితంలో, చాలాకాలం కిందట ఒక వూళ్లో ఒక చిరునవ్వును ప్రేమించాను. ఆ చిరునవ్వు ఎవరిదో ఆమెలో ఏ అందమూ లేదు. కాని ఆమె నవ్వితే నా కళ్లకి చప్పున చుట్టూ ఆమె దొడ్లో చెట్లమీదా కుండలమీదా, దడిమీది కాకర పువ్వుల మీదా ఆకాశాన్నించి యెరుపుకన్నా గొప్ప వెలుగుపడ్డట్టు తోచేది.

ఆమె నాతో కబుర్లు పెట్టుకుంటుంది. ఆ చిరునవ్వును తెప్పించగలిగిందాకా నేనూ ఏదో కబుర్లు చెపుతాను. ఒకసారి ఆమె నవ్వనేలేదు. ఎంతసేపటికీ వెళ్ళక ఆగిన నావంక ప్రశ్నార్థకంగా చూస్తోంది, వెళ్ళమనడం మర్యాదకాదని. ఆమె చిరునవ్వు చూడకండా వెళ్ళడం చాలా బాధగా కనిపించింది. మొదట్లు జంకాను కాని చివరికి విధిలేక,

"ఒకసారి నవ్వు, నేను వెడతాను" అన్నాను. నా భయాలు నిజమైనాయి. రెండు నిమిషాలు సీరియస్‌గా తల వాల్చి కూచుంది.

"ఎందుకు లెండి...?" అంది. చాలా దిగులుగా సందేహంగా.

"ఏమిటి? " అన్నాను అర్థంలేకండా—

"ఆయన నన్ను నమ్మి—వూరూరూ తిరగడానికి వెడతారు." అంది.

ఎట్లా చెప్పను నాబాధ: అసహ్యం! ఎవరిని నిందించను? ఆ అపార్థానికి? ఆమెకి explain చెయ్యాలని చూశాను. కాని మాట్లాడుతోవుంటే నాకే తెలిసింది ఆమె నమ్మడంలేదని. ఆమెదేం తప్పు వుంది? స్త్రీని వాంఛించకండా చిరునవ్వును ప్రేమించే eccentrics లోకంలో వుంటారని ఆమెకెట్లా తెలుస్తుంది?

అయినా, నిజంగా నా ప్రేమ చిరునవ్వుమీదేనా, sex తో సంబంధంలేదా, అని తర్కించి, విడతీసి, చీల్చి పరీక్షిస్తే, ఏమో యే ~~forced~~ Freud వేదాంతంలోకో దిగుతుంది వాదన. ఏది sex కాదు? అనవలసి వొస్తుంది.

అదిగాక, ఆ చిరునవ్వు అందాన్ని చూసి అక్కడ మనసు ఆగుతుందా—చిరునవ్వును కల్పించే పెదవులమీదికి, పెదిమలనించి, మనిషిమీదికి వెళ్లాక ఇక్కడ తక్కిన మనిషిలో ఏమీ ఆకర్షన గొప్పది లేకపోవటంవల్లగాని—వుంటే? ఆమెదా తప్పు నన్ను సరిగా అర్థం చేసుకోకపోవడం!

ఇదంతా నీకు అర్థమవుతోందా? నాకు తెలుసు...నీ మనసు అతి నిర్మలం—సరళం—ఇట్లాంటి complexities నీకులేవు, నామీది దయా ప్రేమా తప్ప. అతి నీతిపరులైనా, చిత్రగుప్తుడైనా, నీలో ఒక్కతప్పును ఎంచలేరు. అందువల్ల నీకాగోలలు పట్టవు — నన్ను పట్టాయే అనే జాలీ దిగులూ తప్ప!

ఈ దేవతల్ని లక్ష్మి, సరస్వతి బొమ్మల్ని పూర్వం చెక్కిన వాళ్లూ ఈనాడు పటాలు చిత్రించేవాళ్లూ, ఆ అందాలన్నిటినీ Sex feeling అడుగున లేకండా వ్రాశారంటావా? దిసిమొల బొమ్మల్ని వేస్తే పరువు తగ్గుతుందని, ఆ కోర్కెనంతా యీ దేవతల మీద భక్తి కింద మరుగుపరిచి తీర్చుకుంటారు. ఆడవాళ్లూ కృష్ణుడి మీద అంతే. కృష్ణుడిమీద కవిత్వాలు వ్రాసే యీ కవులు కొంత వరకన్నా homosexuals.

• అట్లానే ఓసారి ఒకరాత్రి వీధినాటకంలో పాడే కంఠం విని వరసగా మూడురాత్రిలు, నిలవలేక ఆ మనిషికోసం ఆరాలుతీశాను. సంగీతం కాదు. ఆ కంఠంలో ఏమిటో వుంది. ఏ ఆకర్షణ analyse చెయ్యలేను.

అప్రకారమే యోచిస్తాను, నీలో నేనేమి ప్రేమించాను, ఇప్పుడేం ప్రేమిస్తున్నానని. "ఎందుకు యోచించడం? కొంచెం

యిట్లా మెడకుకి విశ్రాంతినియ్యి." అంటావు దగ్గిర వున్నప్పుడు నువ్వు. కాని చాతకాదు నాకు.

అందమా? నువ్వు కురూపివైతే—

నా ప్రేమ పోతుందా? పోదని నమ్మకం. నీ గుణాల్నా! అయితే ఏ గుణాలవి? నాకు తెలుసా? ఆ గుణాలు ఎక్కడవున్నా ప్రేమిస్తానా? నాకు యిష్టంలేని గుణాలు నీలో వున్నాయి చాలా, నాకు యిష్టంలేని సుగుణాలే ఎన్నో వున్నాయి నీలో. మరి నీఆత్మనా? ఆత్మఅనేదే వుంటే, దానికీ రూపం గుణం వుండవుకద! ఏ ఆత్మ అయినా వొకటే ప్రేమించడానికి! ఇవన్నీ కలిసిన నిన్నా! నా మీది నీ ప్రేమనా? లేక నాలోంచి వొచ్చే ప్రేమకి నిన్ను ఆధారం చేసుకున్నానా? నాలో ప్రేమ ముందు వుండి నిన్ను అంగీకరించిందా? నువ్వు నాలో అడివరకులేని ప్రేమని ఉద్భవింపచేశావా? ఇవన్నీ ఇట్లా తర్కించుకుని, తర్కించుకుని చివరికి తన ఆనందంకోసం, అవసరంకోసం, నా మనసు నిన్ను కల్పించుకుంది, నామనసులో వుండే వాంఛలే నీ రూపాన్ని ధరించాయి అనుకుంటాను. అందుకనే నువ్వు నా యీశ్వరివైనావు. ఎందుకు? దేన్ని? ఎట్లా? ప్రేమిస్తున్నానని ఎదటి మనుషుల్ని వెతకడం పిచ్చి, ఆ గుణాలూ ప్రేమా, అంతా తన మనసులోంచే వొస్తున్నాయి.

రే—ఓసారి నాతో "ప—ని ఎందుకు ప్రేమిస్తున్నానో తెలీదు. అందమా? అంతకన్న అద్భుతమైన స్త్రీలతో పరిచయం నాకు. ఏమిటి యీ పీడని ఆకర్షణకి కారణం? పూర్వజన్మ సంబంధం" అన్నారు, చాలాబాధతో. ఆ బాధకి కారణాలు తెలుసును కదా నీకు?

---

నాకు చివరికి మిగిలిన వొక్క స్నేహితుడూ చచ్చిపోయినాడు. ఎన్ని ఉపద్రవాలలోనన్నా ఒకరికి ఒకరం వున్నాముకదా అనుకునేవాణ్ణి. అంత హృదయాలు విప్పి మాట్లాడుకోగలిగిన వాళ్లు నాకు ఇంక దొరకరు. లోకాన్ని ఎదిరించి, ఈశ్వరుణ్ణే, ధిక్కరించి ఇద్దరమూ నుంచున్నాము. ఇంక నేను ఏకాకిని. పిల్లల్నివొదిలి అతను చచ్చిపోవడం నేను క్షమించను. నేను కుష్ఠురోగినైనా, క్షయవల్ల బాధపడుతున్నా, మనసు గొప్ప వ్యసనంతో నన్ను ప్రతినిమిషం కాలుస్తున్నా, నాపిల్లలలో ఎవరికన్నా నేను బతకడంవల్ల సహాయం చెయ్యగలిగితే, అంతా వోర్చుకని బతుకుతాను. వాళ్లని ఈ లోకంలోకి రప్పించిన బాధ్యత నాదిగనక.

రా—చచ్చిపోతానంటే నేను వ్రాశాను అతనికి. దేశాలు తిరిగి వ్యధని మరిచిపొమ్మని. తూర్పునించి ఎండా, మనకేసి చూసే పువ్వులూ, నవ్వే ఆకాశం వుండగా, చచ్చిపోవడం ఎందుకని! కాని నువ్వు లేకపోతే, నేనేమాతాను? ఈ పిల్లలూ లేనివాణ్ణనుకో. కాని నువ్వు ఇంకోర్ని ప్రేమించి, నన్ను వొదిలావనుకో, బతుకుతాను. నిన్ను అప్పుడు ప్రేమించగల ఉదారత్వం ఉంటుందా? ఏమో చెప్పలేను. ఆపరిస్థితుల్నిపట్టి వుంటుందనిపిస్తుంది. కాని ఔన్నత్యంకోసం తప్పక ప్రయత్నిస్తాను. బాధవుంటుంది. దాంతో ఘోరయుద్ధం చేస్తాను. నాకేమనిపిస్తుందంటే, మనకి ఆశక్తేవుండి, మనలోని తుక్కుని మాడ్చి జయిస్తే, అదంతా సుందరమైన పుష్పాలుగా మారి మన స్వభావాన్ని అలంకరిస్తాయి అని. ఇన్నాళ్లూ, జెలసీతో, స్త్రీ మన ఆస్తి అనే అభిప్రాయంతో యుద్ధాలుచేసి, జయించి, చివరికి అతను ఇట్లా అయినాడంటే ఒకటే దిగులు నాకు.

“ర—పోగానే, నాకు లోకంలో ఇంకేమీ మిగలలేదు. ఎందుకు బతకాలో చెప్పు”అన్నాడు.

"పిల్లలు" అన్నాను.

"వాళ్లకి నావల్ల ఉపయోగం లేదు" అన్నాడు.

నేను నమ్మలేదు.

ప్రజలు, విరోధులు, మర్యాదస్తులు, వెక్కిరిస్తున్నారు. "నిరీశ్వరులకీ, దుర్నీతిపరులకీ ఇదే అంతం. బాగా జరిగింది. మాకుముందే తెలుసు"నని నా విరోధులకి అట్లాంటి తృప్తిని ఇవ్వకండా వుండడం కోసమన్నా బతుకుతాను నేను. ఎందుకంటే వాళ్లు నా స్వంత విరోధులుకారు, యువకులకీ, అభివృద్ధికీ విరోధులు.

ఏయువకుడు అధికారాన్నీ, నీతినీ, దేవుణ్ణీ, మతాన్నీ, మర్యాదనీ, ధిక్కరించినా,

"ఆ. చాలామందిని చూశాము. రా— ఏమైనాడు? చెలం ఏమైనాడని!"

భయపెడతారు.

వీళ్లలో ఒక్కళ్లని చావమను రా—చచ్చిపోయినట్టు, నిశ్చింతగా దృఢంగా, అన్నీయోచించి, మిత్రులతో discuss చేసి, చచ్చిపోబోయే సాయింత్రంకూడా, నవ్వించి, కబుర్లుచెప్పి,

"అవతల ఏమీలేదు అలిసిపోయినాను. నిద్రపోతాను."

అని ఎవడనగలడు?

ఈ పిల్లల దగ్గిర్నించి ఎంతదాచినా వాళ్లనాన్నకి ఏదో ఆపద వొచ్చిందని తెలుసుకుని గోలపడుతున్నారు వీళ్లు. నాకు అత్యవొప్ప చెప్పినవాళ్ల విషయమై, నేను నా పూచీని తీర్చగలనా అని ఆలోచిస్తాను.

మృత్యువు తరవాత జీవితమేవుంటే తిరిగి కనపడడానికి వీలే వుంటే, రా—తప్పకండా నాకు కనపడతాడని నానమ్మకం.

కాని ఎంత తర్కించుకున్నా భయంకూడాను.

ఈ పిల్లలు నాపిల్లలకి వున్న బొమ్మలీన్నీ, బట్టలీన్నీ చూస్తోవుంటే నేను వోర్చుకోలేను. వాళ్లకీ అవన్నీ మళ్ళీకొనిపెట్టడానికి డబ్బు లేదు. కాకి ఆశతో నా అన్నంవంకచూస్తే తినలేను. ఎట్లా ఈపిల్లల్ని తృప్తిపరచడం? ఎంతమందినో నాయింటోకి నాతో తెచ్చి వుంచు కోవాలనిపిస్తుంది. పిల్లల డబ్బు ఇతరులమీద ఖర్చుపెట్టడానికి ఏం అధికారంవుంది అనిపిస్తుంది. ఎవరన్నా స్నేహితులు డబ్బు అడిగినా, నన్ను వాళ్లదగ్గిరికి రమ్మన్నా అట్లాగే యోచిస్తాను, సంపాయించి నంత మాత్రాన డబ్బు నాది అవుతుందా అని. ఈప్రశ్నలకి జవాబు ఎవరూ ఇవ్వలేరనుకుంటాను. ఎందుకీ గోలలు అందరిమల్లే ఆలోచించ కండా బతకరాదా అనుకుంటాను.

ర—నన్ను రమ్మని ఉత్తరాలు వ్రాసింది టెలిగ్రాం ఇచ్చింది. కాని నాకు వెళ్లడానికి మనస్కరించటంలేదు. ఆమెతో తగినంత సానుభూతి నా మనసులో లేదు. వెళ్ళి దొంగ కన్నీళ్లుకార్చి ఏం లాభం?

రా—నేనూ ఎన్నో రాత్రులు మృత్యువుతరవాత జీవితంవుందా, వుంటే ఎట్లా వుంటుందని యోచించేవాళ్లం. అతను కనపడి నా సంశ యాన్ని తీర్చకూడదా?

వెళ్ళిపోయినావు. డాబామీదికి మనం వేసిన నిచ్చెన యింకా అట్లానే వుంది? నా వేదాంతాన్నీ నన్నూ వెక్కిరిస్తో, చివరిమెట్టు మీద నువ్వు సంశయిస్తో ఆగడం, నేను చెయ్యి అందియ్యడం తలుచు కుంటో కలలలో పడిపోతాను. నిద్రపొయ్యే నీచేతిని పట్టుకుని, నక్షత్రాలవంక చూస్తో, ఎందుకు—నువ్వు వెళ్లిపోవలసిన రోజు రావాలి అని ప్రశ్నలడుగుతో—ఇంత దగ్గిరా వున్న యీ చేతిని విడవవలిసి రాకండా, యే దేవుడూ, యే పరిస్థితులూ, మార్పులూ, సహాయం చెయ్యలేరా, అని నరాలమధ్య నిరాశ బాధపడడం—

ఎంత మధురంగా వుండేది ! నీవేళ్ళు ఆ బాధనంతా మార్చేవి ఆనందంగా. ఎక్కడ వున్నావు—ఎంత దూరాన ?

నక్షత్రాలమధ్య, మనం యీ భూమికి చెందనట్టే, మనకి శరీరాలు లేనట్టే, పొద్దున్నే కాఫీకి కిందికి దిగనక్కర్లేనట్టే, తేలిపోయే వాళ్ళం. నీకళ్ళనించి నక్షత్రాలని, నక్షత్రాలనించి నీకళ్ళలోకి, చూసే నన్ను...నువ్వునిద్రపోతోవుంటే, గాలిలో కదిలే నీమొహంమీది జుట్టుని, నీవక్షంమీద పమిటని చూస్తో కూచున్నాను, తూర్పుఆ మొహాన్ని వెలిగించిందాకా, ఉష ఈ ఉన్మత్తుణ్ణి పలకరించిందాకా.

అంత సౌందర్యాన్ని నా చేతుల్లో పట్టుకుని, ఒక్క చిన్న చూపుకి, వేలు స్పర్శకి, గోలపడతాను—వెతుకుతాను. గుడ్డి విధిని ప్రార్థిస్తాను. శూన్యలోకంలో తడుముకుంటాను.

గదిలోకి పొద్దున్న వెళ్ళగానే చేతులో కుడుతున్న బట్టమీదికి వొంగి వాల్చిన నీతల కనపడ్డదే అనిపిస్తుంది. నా ముందు నా చేతులు పట్టుకుని కూచుని, నువ్వు మళ్ళీ నీ యింటికి వెళ్ళడమూ, మీ ముసలమ్మ ఆజ్ఞలూ, పొరుగు ఆవిడ ఈర్ష్యలూ, పేరంటాలూ, నగలూ, దొంగమాటలూ, వాళ్ళు ఏదో నీ సంగతి తెలుసుకోవాలని, నీ మాటల్లో ధైర్యం, నీ కళ్ళల్లో వెలుగూ, వాటికి రహస్యమేమీ అని వెతకడం—ప్రశ్నలూ—ఇవన్నీ నువ్వు తలుచుకుని, తలుచుకుని, గొణగడం—బతుకుని తిట్టడం—ఎంత బావుండేవి ఆ వుదయాలు—కాఫీ కప్పుల ముందు ? కాఫీ పొగ తగిలినప్పుడల్లా నీ మాటలూ ఆ పొగలూ, కలిసి వొస్తున్నట్టు, కప్పు తీసుకునే నీవేళ్ళు నాకు తగిలినట్టు—కాఫీతో తడిసి పరిమళించే నీ పెదవులు నన్ను గౌరవించినట్టే జ్ఞాపకం వొస్తుంది.

ఈవాళంతా వాన మబ్బులు—బైటికి పోవాలనిపిస్తుంది—వొంటరితనం యీ గదిలో భరించలేక. అదృష్టవంతులు చీట్లపేకలాడి కాలాన్ని చంపుకుంటారు. నాకా—చదివి చదివి కళ్ళు నిప్పులు—షికారా ? ఎటుపోనూ ? ఎటు వెళ్ళినా నువ్వే. ఆ వంతెన కింద

కాలవలో నీ పాదాలు తడుపుతో కూచోడం—ఆ నీళ్లని చూసి నేను యీర్ష్యపడడం—చాపలు ఏడుస్తాయి, నీకాళ్లు తీసేస్తే అనడం— ఆవానరోజున నా సహాయంతో చెట్టు కొమ్మమీద నువ్వు కూచుని, పైగా నీళ్లు నా నెత్తిన విదిలించడం—అన్నీ జ్ఞాపకం వస్తాయి ఎటు పోదామనుకున్నా. నువ్వు వొచ్చి వెళ్ళాక, అది వరకు నేను వెళ్లే అందమైన స్థలాలన్నీ దుర్భరాలైనాయి.

అర్ధరాత్రిలు ఇంకా వొంటరిగానే ఉన్నాననుకుంటో భ్రమ పడి లేచి, నువ్వున్నావన్న సంగతి జ్ఞాపకం వొచ్చి, సందేహపడి: పక్కన నిన్ను తాకి లేపి, తృప్తిపడడం — జ్ఞాపకం వుందీ!

ఆ తెల్లారకట్ట నువ్వు వెళ్లడం — ఆకాశాన్నించి ఒక్క రాత్రి కరుణించి యీలోకంలో ప్రియుడితో గడపడానికి — వొచ్చి వెలుగు కనపడగానే వెళ్లిపోయే అప్సరసవలె, ఏదో కొత్తగూట్లో రాత్రి గడిపి, తెల్లారి తన గుంపుని చూడగానే, వాటిలో చేరి ఒక్క అరుపుతో ఎగిరిపొయ్యే హంసవలె—మాయమైనావు. జ్ఞాపకం వుందా! చల్లని గాలివేసింది, త్రయోదశి చంద్రుడు వెలుతురికి భయపడుతో దిగులుగా అస్తమిస్తున్నాడు—అదే ఆఖరు సారి ప్రపంచాన్ని వొదలేస్తున్నట్టు దడిమీది ఒక్క బూడిద గుమ్మడి పువ్వు మన మొహాలు చూడలేక గాలిలో తల తిప్పుతుంది.

ఉదయాలు వొస్తున్నాయి పోతున్నాయి. కాని కళ్లు తెరవగానే నా పక్కన, చెదిరిన జుట్టుతో, పక్కమీద అలసటగా అంటుకున్న చేతులతో, నన్ను చూసి కొత్త కాంతిలో నవ్వే కళ్లతో, నలిగిపోయిన జాజిపువ్వుల దండని సోమరిగా చీలుస్తో, నువ్వు కనపడవుగద! ఎందుకు పనిలేక సూర్యుడిట్లా తిరగడం— యింకా తెల్లవారడం? ఆఖరు ఉదయమని నువ్వు కళ్లువిప్పిన సమయం—ఉరి పడపొయ్యేవాడి కళ్లల్లోనన్నా వుంటుందా అంతబాధ!

ఇంతే నా బతుకు ఇంక! ఇంక కనపడవా?

" There be none of beauty's daughters
With a magic like thee.
And like music on the waters
Is thy sweet voice to me,
When, as if its sound were causing
The charmed ocean's pausing,
The waves lie still and gleaning
And the lulled winds seem dreaming,
And the midnight moon is weaving
Her bright chain o'er the deep;
Whose breast is gently heaving
As an infant's asleep
So the spirit bows before there
To listen and adore thee
With a soft but full emotion
Like the swell of summers ocean "

ఇంక కనపడవా ?

---

వి—చచ్చిపోయిన రాత్రి నాకు కలవొచ్చి వులికిపడిలేచాను. నేనూ వి—,వొయ్యా, తోటలో తిరుగుతున్నాము. వాన కురిసి నేల అంతా తడిగావుంది. వి—ఒక చక్కని చెట్టు కిందికి వెడుతోంది. తలెత్తిచూశాను. ఆ చెట్టునిండా తలకిందులుగా కొమ్మలనించి వేళ్లాడుతో తాచుపాములు. నేను వి—ని బుజంపట్టుకుని ఇవతలకి లాగాను. ఒక పాము ఆమెని కరవపోతోంది. ఉలికిపడిలేచాను.

మూడురోజులయింతరవాత తెలిసింది ఆరాత్రే ఆమె చాలా దూరదేశంలో చచ్చిపోయిందని. ఆమెకి జబ్బుగావున్నదనికూడా తెలీదు నాకు.

కల విచిత్రంకదూ! ఆమె నిజంగా ఆ రాత్రి చచ్చిపోగానే కనపడ్డదేమోనని అనిపించేటంత vivid గా వుంది. ఆమెకి నేను వ్రాసిన ఆఖరు వుత్తరంలో

"అన్యాయంగా నీ ప్రియుడి అనుమానాల్ని నిద్రపుచ్చేందుకు నా మీద అపనిందలుమోపావు. అంత ధైర్యస్తురాలివి, సంస్కారం వున్నదానివి, నువ్వు సాధారణ స్త్రీలు చేసే పనికి దిగావే అని నా దిగులు. నాకు కోపంలేదు. ఎన్నడన్నా నిన్ను జీవితం కష్టపెడితే, నీ స్నేహితులు, బంధువులు, నీ జీసస్ క్రైస్టే నిన్ను నిరాకరిస్తే, దేవుడూ, స్నేహితులూ, బంధువులూ వొదిలిన చెలంవున్నాడని, అతని సహాయం సిద్ధంగా వుంటుందని జ్ఞాపకం వుంచుకో. "అందాకా మనం కలుసుకోక పోవడం మంచిది" అని.

నేను ఆమెని మళ్లీచూడలేదు; చూడాలనిపించలేదు.

ఏదో నాపాత జీవితం ముగుస్తోందనీ, కొత్త ఆరంభం చెయ్యబోతున్నాననీ అనిపిస్తోంది. గత సంవత్సరం మిత్రులుచాలా పాతవాళ్లుకూడా నన్ను వొదిలేశారు.

ర—మొన్న వొచ్చింది. రాగానే ఆమె మొహంచూడగానే తెలిసింది— ఇన్నేళ్ల మా స్నేహమూ అంతమయిందని. రా—చచ్చి పోయినాడు. కొత్త స్నేహితులు గామ్యూర్తి తాతా దూరమైనారు. స—ఆమె భర్తా విరోధం కట్టారు. కమలతో ప్రబల శత్రుత్వం— ఆమెతో కవి సమూహమంతా. వి—చచ్చిపోయింది. అమీనాపారి పోయింది.

ఈ వొంటరితనానికి తోడు నువ్వూ దూరమైనావు, నా 'ట్రాన్స్ఫరు'వల్ల. ఇంతదూరం ఈ మారుమూలకి నిన్ను రమ్మని ఎట్లాపిలవను? నువ్వు ఎట్లా రాగలవు?

దీక్షితులుగారికి మాబడికే transfer అయింది అదివొక్కటే యీ చీకట్లో కాంతిరేఖ. అభిప్రాయాల్లో, ఆచారాల్లో, ఏసంబంధమూ లేని ఆయనకీ, నాకు. యీ స్నేహం విచిత్రంగా వుంటుంది. నాలో, నాఆత్మలో, నాpossibilitiesలో ఆయనకిఅపరిమితమైన విశ్వాసం— ఆయనకీ, నీకూ. నన్ను స్నేహితుడుగా స్వీకరించి, నాలో విడవని విశ్వాసం ఉన్న ఆయన ఆత్మోన్నత్యం ఎంతగొప్పదో యోచించు.

నాలో నీలో ఎన్నిమార్పులు వొచ్చినా, అనుభవించాము, ఒకరిలో ఒకరం, శరీరాలూ, మోహం, నరాలూ, రొమాన్సు, కవిత్వం, కళా, ఇవ్వగలిగిన ఆనందాన్నంతా అనుభవించాము. ఎప్పుడూ చల్లారని అగ్నివంటి ఆకర్షణతో హృదయాల్ని ప్రజ్వలితం చేసుకుని, ఒకరినొకరం ప్రేమించాము. ఒకరిలో ఒకరం ఈవిశ్వసౌందర్యాన్ని, నక్షత్రదీప్తిని, భూమ్యాకాశాల పరస్పర వీక్షణని అనుభవించాము. అంతకన్న జీవితానికి కావలిసింది నాకు ఏమీ కనపట్టంలేదు.

నాసమస్తకార్యాలకూ, ఆలోచనలకీ, నీవే కేంద్రం. అన్ని వేళలా, 'నువ్వు, నువ్వు' అనే ధ్యాస నా మనసు వెనక పాటకి తంబుర శృతివలె మోగుతో వుంటుంది.

Ah, could I kiss you now and lose myself
In the flood of your dark singing mystery
Primeal death-deep tide!
Could I kiss you on the mouth and my
thrilled soul
Peer into the immensity of your immeasurable
being!
Could I, in the sea-soft touch of your lips find
The meaning of things beyond, beyond the
senses

P. Mitra.

ఇదివరకటివలె స్త్రీ మిత్రులుకూడా నాదగ్గిర చేరటం మానేశారు. నాలో ఏదో మార్పు కలిగిందిగావును. ఈ వాంఛలోకూడా శరీరాలు కలపడమేగాక, ఇంకా ఉన్నతమైన సౌఖ్యాలు ఉన్నాయి, ప్రేమ లేకండా వూరికే ఒకపక్కమీద దొర్లడం, చాలా తక్కువ రకం సౌఖ్యాన్నిస్తుందనీ, శరీరసుఖంలోకూడా నిదానించి, విచక్షణ ఉపయోగిస్తే, ఇంకా గొప్ప సౌఖ్యాలు దొరుకుతాయి అంటే ఈ యువ్వనుల చెవిని పట్టదు. నాకు పట్టేనా! సంసార బంధాలు తెంపుకున్నవాళ్లూ, సంసారాలే వాళ్లని తన్నేసినవాళ్లూ, కొందరు 'ప్రియులో, ప్రియులో' అని గోలపెడుతారు, కొందరు 'పెళ్లో పెళ్లో' అని అడుగుతారు. ప్రియుల వ్యవహారంకూడా మర్యాదగా రహస్యంగా arrange కావాలి. నేను అబద్ధాలాడడానికి సిద్ధంకావాలి. నా పద్ధతులు వీళ్లకి నచ్చేట్టులేవు.

అనుభవంలోంచి నూతన విజ్ఞానాన్ని పాఠాన్ని నేర్చుకోకండా, చలనమూ అభివృద్ధీ లేకండా ఒకటే సున్నాలో అదే పని చేస్తోవుండడంకన్న మృత్యువులేదు. తిండీ, నిద్రా, పడకా, మళ్లీ అంతే. కొందరు—ఒకరితోనే; కొందరు వూరికే స్త్రీలని వెతకడం,

ఆఖరికి మార్పేతప్ప, ఏవీ కొత్త సౌఖ్యంకలగదు. తిరిగి తిరిగి కలిగే ఒకే అనుభవంలోంచి నూతన విజ్ఞానాన్ని సంపాయించలేక పోయి నప్పుడే, మనసుకి వృద్ధాప్యం, మృత్యువు. అట్లాచూస్తే, చాలామంది యువకులు ఇదివరకే మృతిపొందారు. నా చుట్టూ గొప్ప కవులు కన పడుతోనే లోపల చచ్చిపోతున్నారు. నా స్నేహితులు అంతే. మన అనురాగంలోంచి నిరంతరమూ కొత్త కొత్తకాంతిని అందాల్ని చూడగలిగాము కనకనే ఇంతకాలం మనకి ఉన్నతమైన తృప్తినియ్య కలిగింది.

అందువల్ల నేను వివాహం అనర్థదాయకమంటే, నేను వ్యభిచా రాన్ని బోధిస్తున్నానని ప్రతివాళ్ళకీ ఊహ. ఇకంతాచూస్తే నామన సులో సంగతి సరిగా వ్రాసి చెప్పడం నాచేత కాలేదేమో అనిపిస్తుంది.

ఈ గోలలన్ని నీకెందుకు? కాని నీకు వ్రాయాలని కూచోగానే నా బాధలు, నా సందేహాలు, అన్నీ పొంగుతాయి కాయితంమీదికి. అవే నేను. శాంతమైన వెన్నెలవంటి నీ చిరునవ్వును నేనెంత ప్రేమి స్తున్నానో, నాలోని ఈ అశాంతి నీకు ఆకర్షణీయ మనుకుంటాను. నవ్వే చంద్రుణ్ణి సముద్రం తనలో చెదరకొట్టి, ఆడించి, అనేక దిక్కుల ప్రతిఫలింపచేసి సంతుష్టిపడ్డట్టు, నిన్ను అట్లా ప్రేమిస్తాను. కాని యింత ఆరాటపడ్డా నేను, నువ్వు ఆకాశంనించి అట్లానే నవ్వుతో వుంటావు.

పెళ్లి అనేదాంతో ఎందుకు నాకు విరోధం? పెళ్లి వ్యభిచారం కింద, వేశ్యాత్వంకింద మారిందిగనుక. పెళ్లిలోకన్న వ్యభిచారంలో ఎక్కువనీతివుందిగనక. బలవంతమూ, డబ్బూ, అలవాటూ ప్రవే శించేప్పటికి, వ్యభిచారమూ, వేశ్యాత్వమూ, వివాహమంత నీచదశకి దిగుతాయి. పెళ్లికితిరగబడ్డవాళ్లని నేను encourage చేశానంటే, స్వేచ్ఛకోసం—

కాని ఎట్లానూ నా స్వేచ్ఛావాదం, వీళ్లకి నచ్చదు, అర్థంకాదు. ఎంతమందితో ఎన్నిసార్లు అనుభవిస్తే అంత మెచ్చుకుని, నాకు ఉప

కారం జరిగినట్టు, నా ప్రచారానికి బలం కలిగినట్టు, నేను కృతజ్ఞత చూపలివసినట్టు మాట్లాడతారు.

ఇంక నాకు వీళ్లకీ పడేట్టులేదు. అంతేకాక, నాకూ నా స్నేహితులకూ కూడా మా మధ్య ఆకర్షణ తగ్గిందిలాగుంది.

అదిగాక గాఢంగా ఒకర్ని ప్రేమిస్తూ ఇంకోరితో సంబంధం ఎంత న్యాయమనేది నన్ను ఎప్పుడూ బాధించింది. ఇప్పుడు ఎక్కువవుతోంది. రెండోవారికి తెలీకండా చేస్తే అది చాలా నీచం. తెలిపితే, వాళ్లు బాధపడకండా ఉండేటంత ఉదారులు కావాలి. మొదటలో చిన్నతనంలో పె___తో పరిచయం కలగగానే, అంత బాల్యంలోనే నన్నీ సమస్య బాధించింది. తరవాత ర___వ్యవహారంలో మరీ మథనపడ్డాను. ఇప్పటికీ నేనేమీ చెప్పలేను ఆవిషయం.

నాజీవితంలో నీకు తెలీని రహస్యాలు ఏమీలేవు. నువ్వే నా స్నేహాలని అభ్యంతర పెట్టి, నీకు కష్టం కలుగుతుందని రాస్తే, తప్పకండా మానేశేవాణ్ణి. కానినా స్వేచ్ఛకి నా self-fulfilment కి అడ్డం వొచ్చిందే నీ ప్రేమ అనే కోపం, దిగులు, ఎంతప్రయత్నించినా నన్ను వొదిలేదికాదనుకుంటాను.

నీ ఉదారత్వమనే మంత్రంతో నా అనుభవాలన్నీ అన్ని పుష్పాలుగామారాయి మన ప్రేమదేవతపాదాలవద్ద. నీకే తెలుసు ఎట్లానో!

తిరిగి తిరిగి. నా హృదయం సమర్థించుకుంది, 'నువ్వేకావాలి. నువ్వే నా సాఫల్యం' అనే విషయాన్ని.

ఎందుకంటే, మోహావ్యవహారాలు నా జీవితానికే సూత్రాలనీ, నీళ్లూ, జ్ఞానమూ ఎట్లా మనుషులు కోరతారో, అంత తీవ్రంగా ~~instructive~~ instinctive గా నాకు అవసరమైనాయనిపిస్తుంది.

అందరికీ అట్లాకాదా, అని అడిగితే, నాకు తెలీదు. వాళ్లకే తెలియాలి.

ఈ స్నేహాలు లేకపోతే నాలో ఓ భాగం ఎండి నశించేది— అది creative side కావొచ్చు romantic side కావొచ్చు. ఏతృప్తీలేకా నా వాంఛలలో నలిగి ఎండిపోయిన నేను నీకేం అంగీకారంగావుండేవాణ్ణి!

కాని నువ్వే నాతోవుంటే...ఆసంగతి సరిగా యోచించలేను. తలుచుకుంటేనే మనసు ఆలోచనల్ని చెదరకొట్టే, కాంతితో నిండుతుంది.

నీతికీ, నావాంఛకీ యుద్ధం జరిగే ఆ మొదటిరోజుల్లో, ఎంతో analyse చేసుకున్నాను. నాకు నీతిపరులలో విశ్వాసం. నా వాంఛలమీద అవిశ్వాసం. నాకు దేవుడు వుండేవాడు ఆరోజుల్లో. అంతరాత్మవుండేది. వాళ్ళిద్దరూ కలిసి ఆజ్ఞలుపెట్టేవాళ్లు. బెదిరించేవాళ్లు. కాని నేను ఎంతప్రయత్నించినా పశ్చాత్తాపం కలిగేది కాదు. చేసినపని తలుచుకున్నప్పుడల్లా, నాహృదయం చెప్పలేని గొప్ప ఆనందంతో నిండేది. నా స్నేహమే పాపమైతే లోకంలో సౌందర్యం ఆనందం అన్నీ పాపాలనిపించింది — క్షుద్రసౌఖ్యాలు కష్టాలే పుణ్యాలులాగున్నాయే అనుకున్నాను.

నన్ను నా మిత్రులమీది శృంగారాకర్షణనించి తప్పించమని ఎన్నో ప్రార్థనలుచేశాను, శరీరాన్ని శుష్కింపచేశాను, ఏకాకినై గడిపాను. నన్ను నేను నిరాకరించుకుని బలవంతాన ఆటంకపరుచుకున్నా నా మిత్రులు నాకోసం బాధపడుతోందేమో అనే ఆలోచన నన్ను అస్వాధీనుణ్ణిచేసి లాక్కుపొయ్యేది.

నేను పాపానికే పుట్టానని నిశ్చయం చేసుకున్నాను. కాని ఇద్దరి జీవితాల్ని అంత కాంతితో సంతోషంతో నింపే సంబంధం వికృతమని ఘోరమని నమ్మలేక పోయినాను.

నా మెదడే అట్లా ఏర్పడ్డదేమో, నా జాతకమే అట్లానేమో! దీక్షితులుగారు జాతకాలు నిజమంటున్నారు. నాకు రూఢిచేస్తానం

టున్నారు, ఎవరి దగ్గిరికో తీసుకుపోయి. నవ్వాను. హేళనచేశాను. కాని రుజువుచేస్తానన్న నిజాన్ని పరీక్షించకపోవడం మూర్ఖమనుకున్నాను.

దీక్షితులుగారు అబద్ధం చెప్పరు. మోసపోరు. నిజంగా జాతకాలే నిజమైతే! తలుచుకుంటేనే భయమేస్తోంది— ఏదో చీకటి అగాధంలోకి జారినట్టు— నిజమేఐతే— నేను ఇన్నేళ్లు నమ్మింది, ప్రయత్నించింది అంతా అబద్ధం. మనుష్య ప్రయత్నమే లేదా? నాకు రూఢి ఐన రోజున నేను నాశనమన్నాకావాలి, నా కళ్లకి కొత్త జ్యోతి అన్నా కనిపించాలి తప్పదు.

మనుషులు ఇంత మూర్ఖత్వం క్రూరత్వం చూపడం, ఖండించడం, ద్వేషించడం, ప్రతిదాంట్లో జోక్యం కలిగించుకోడం, నిందలు మోపడం, ఇంక ఏ సౌఖ్యమూ చాలకాక ననుకుంటాను. ఒక్క తల్లిని, పిల్లను, ప్రియురాల్ని, కళను సంపూర్ణంగా ప్రేమించేవాడు— ఎంత ఉన్నతుడు కావాలి. ఈ చౌర్యాలూ, క్రౌర్యాలూ మళ్లీ ప్రేమ పేరనే జరుగుతాయి. ఏంచేతకాక తమ importance ని, అహాన్ని పెంచుకుని, ఇతరులలో హీనత్వం ఏరడంలో తమ గొప్పతనాన్ని స్థిరపరచుకోవాలని ప్రయత్నిస్తారు. చెప్పినా వినరు ఇంకా సౌఖ్యాలు ఉన్నతమైనవి ఉన్నాయంటే. చాలాసార్లు వాళ్ల దుర్మార్గాన్ని చూసి వొళ్ళుమండినా, చాలాసార్లు చాలా జాలివేస్తుంది— అంధకారంలో వెతికే మనుషుల్ని చూసి— అందరికన్నా నామీద!

నాకేం తెలుసు, నీ ప్రేమతప్ప. ఇంక వేరే సౌఖ్యం ఆనందం ఏదీ! కాని అసలువుందా! మన ప్రేమకీ, మన విరహానికీ, మన మరణానికీ, అర్థమివ్వగల నూతన సత్యం!

ప్రపంచాన్ని చూసినకొద్దీ, నా హృదయాన్ని వెతికినకొద్దీ, అనుభవం విస్తీర్ణమైనకొద్దీ, నాకేదో కారణంలేని విశ్వాసం కలుగుతోంది, మనుషుల యత్నాలకీ, కలలకీ, నిలవనీని ఆవేశాలకీ, ఆశయాలకీ, విచారాలకీ, ప్రేమలకీ, ఏదో ఉన్నతమైన అర్థం సాఫల్యంవుండి

తీరాలని. ఎంత ఆలోచించినా, చదివినా, అడిగినా, వెతికినా, ఆ రహస్యం అందదు. నేనింకా అభివృద్ధి చెందాలేమో! తెలుసునసే వాళ్ల మూర్ఖత్వం, దుర్మార్గత్వం, చూసి తిరగబడకపోతే, ఇంకా విశ్వాసం వుండునేమోనాకు. ఈ మతాలే అభ్యంతరం, మనుషులు సత్యం తెలుసుకోకండా. ఆమతాలకి తెలుసునేమో ఆరహస్యం, కాని మనుషులకి చెప్పడం చాతకాక తంటాలు పడుతున్నారేమో!

మన ప్రేమ, మన అద్భుతమైన ఆనందం, ఆవేశం, విరహం, మన నవ్వులు, కన్నీళ్లు, కావిలింతలు, అన్నీ ఏమైనాయి. ఆలోచిస్తే, మనం ఒకర్ని ఒకరం అంత తీవ్రంగా వాంఛించుకున్నంతసేపూ, దేహాలు ఇంక వేరుకాకండా ఒకటి చెయ్యాలనే భౌతికవాంఛ, ఒకరినొకర్ని అర్థంచేసుకుని ఐక్యంకావాలనే మనో వాంఛ, ఒకరిలో ఇంకొకరికితప్ప ఇంక ఆనందమే లేకండా తన్మయులమాదామనే హృదయవాంఛ, ఇదంతా అంతకన్న ఏదో గొప్ప ఆనందంకోసం; మన శరీరాల, మనసుల, హృదయాల, ఐక్యంతో సాధించలేని కలియికకోసం ప్రయత్నమనిపిస్తుంది. ఆత్మలనేవి వున్నాయేమో! ఆత్మని ఆత్మ అందుకోలేక, దేహాల్లోంచి, మనసులోంచి, అందుకోవాలని బాధపడుతుందేమో! ఎందుకంటే ఎప్పుడు సుఖం అనుభవించినా, ముఖ్యం సుఖంలో సంతోషంలో ఎన్నడూ విశ్రాంతి దొరకలేదు నాకు. ఆనందానుభవం ప్రారంభించిన నిమిషం మొదలు, అది చెదిరిపోతుందే, గంటలోనో, వారంలోనో, అని దిగులే. ఇంతేనా, ఇంకా intense గా యీ ఆనందాన్ని అనుభవించలేనా అని ఆరాటమే.

●

మన ఇన్నేళ్ళ అనుభవానికీ మిగిలింది ఏమిటి? ఇంకా అదే రకం స్నేహం, దేహాలు అలిసిపోయిందాకా, పనికిరాకండా చెడిపోయిందాకా! ఆ అనుభవాల జ్ఞాపకం. తరవాత మధురమైన స్నేహం. అంతేనా! మనం వ్రాసుకున్న లేఖలూ, జ్ఞాపకాలూ ఇంతేనా మిగిలేది?

మొన్న నువ్వు వ్రాసిన ఉత్తరాలన్నీ మళ్ళీ చదివాను! ఎంత ఉద్రేకాన్ని, ఎన్ని సుందరానుభవాల్ని, ఎంత ఆనందాన్ని బంధించాము ఆ అక్షరాలలో. ఎన్ని కన్నీళ్లు ఆ కాయితాలనిండా! ఎంత విరహం!

మన ప్రేమ అశాశ్వతత్వం తలుచుకునేప్పుడు, అవి ఎప్పుడన్నా ప్రచురితమైతే! అనిపించింది. కాని అప్పుడు మాత్రం! పోనీ, ఏ రెండు యవ్వన హృదయాలకో ఉన్నత ప్రేమమార్గం చూపగలిగితే! కాని మనసు ఏడుస్తుంది చప్పున. "నీకథలన్నీ బూతు కథలూ, నీ వ్యాసాలన్నీ అవినీతి వ్యాసాలుగా మారాయి. జ్ఞాపకంవుందా! నీ హృదయంలోని సౌందర్యభావం, రసాన్వేషణ, నీ అన్వేషణాగ్ని, అన్నీ అక్షరాలై, ఇతరుల మనసుల్లో ఏమైనాయి! నీచత్వం, మురికి, అసహ్యం— ఈ feelings ఏకద అవి రెచ్చకొట్టింది. ఇంక నీ ప్రేమలేఖలా!" అంటుంది.

కాని ఎవరికో, ఎన్నటికో.........ఏకొద్దిమందికో...

ఎవరో చదివి ఒక్క నిట్టూర్పు విడవరా!

మన కన్నీళ్లు నవ్వులై ఏ young lovers పెదిమలో అలంకరిస్తాయి. మనం సాధించిన ప్రేమ విజ్ఞానం, తోవ వెతుక్కునే ఏ వెర్రియవ్వనులకో వెలుగుచూపుతుంది.

కాని మనం......?

ఈ దిగులు తప్పదు. కాలం కదలకండా ఆపలేము. ఇంత గొప్ప ప్రేమతోకూడా. భర్తతప్ప ఇంక ఏమీ మిగలకండా ఐక్యమైపోయిన పతివ్రతలే ఆపలేకపోయినారు. కాని కాలం ఆగాలనివుందా నిజంగా మనకి? కాలంగడిచిందని ఏడవకండా! ఒకరి కళ్ళల్లోకి ఒకరంచూస్తో, పెదిమెలమీద పువ్వుల సౌరభం, ఆకాశపు విశాలత్వం అనుభవిస్తోవుండేప్పుడుకూడా, అట్లావుండిపోతామా,... తృప్తిపడో, తృప్తిలేకో, (రెండో, వొకటేనో) కొత్త ఆనందంకోసం

వెతుకుతాము. కాలం కదలాలి. మళ్లీ కదలకూడదు. తమాషా ఈ మనస్సు!

మన ఇష్టంవొచ్చినట్టు కదలాలి. మన ఇష్టం ఏది? గట్టిగా ఆలోచించు. తెలీదు. తెలిస్తే లోకమంతా తెలుస్తుందేమో!

మనం అనుభవించినవాటికన్న గొప్ప ఆనందాలు ఉండాలని, కావాలని, కలలుకంటూనే, అది చిక్కితే, మన అనుభవాలకి continuations కావాలి. అంతే. భిన్నంకావడానికి వీలులేదు. ఎందుకంటే ఎన్నడన్నా నా ఆత్మసాక్షాత్కారం అయిందంటే, అది నీ పెదవులమీద నాలోంచి నేను తప్పించుకున్నా అది నీకళ్లలో. నేను లేను, నేను ఒక ఆనందాన్ని, ఒక అనుభవాన్ని, అనిపించేటంత ఐక్యమైనాను. నా నరాలలో ప్రపంచగానమే కంపించింది. నీ చేతులమధ్య నాదేహంకరిగి, మాయమై, నువ్వు వొదిలినప్పుడు మళ్ళీ రూపంపొందింది. నువ్వుదగ్గిరలేనప్పుడూ, నీధ్యానమే నాఆలోచనల కన్నిటికీ స్మృతి.

వీలులేదు. ఇంత ఉన్నతానుభవం నశించదు. మనమనుభ వించిన బాధతో మన విరహం మధురంగా మన హృదయాన్ని ఆవ రించింది.

ఎందుకో ఎంత తృణీకరించినా, ఎంత అపార్థాలు చేసుకున్నా, ఇంకా ఎవరో తెలీని ప్రజలు నన్ను...కాదు... నాబాధల్ని, నా ఆశయాల్ని, తెలుసుకుని అర్థంచేసుకోవాలని ఈ బాధ!

సౌందర్యం, ప్రేమ అంటే, ఇదేననుకుంటూ. "నేను" కాని దాన్ని నాదిగాచేసుకోవాలని— లేక 'నేను' 'అది' ఐపోవాలనే ప్రయత్నమేమో! నిన్ను ప్రేమించడం వాంఛించడం, ఈలోకాన్ని వాంఛించడమేమో!

ఏమోలే ఈ గోలకి అంతంలేదు.

కాని ఈశ్వరుడేవుంటే, ఆ ఈశ్వరుణ్ణి చూడడానికి నువ్వే మార్గంనాకు. నీద్వారాతప్ప ఏ ఔన్నత్యమూ, నన్ను చేరడానికి వీలులేదు. నా నివాసం నీలోనే కనక. ఈశ్వరుడు ప్రత్యక్షమైతే నాకు, నీరూపానే రావాలి—ఇంకా ప్రజ్వలితంగా, ఆనందంగా అనంతంగా కావాలి. అంతే.

రా—చచ్చిపోవడం ఇంకా నాకు అలవాటుకావడంలేదు. ఎప్పుడూ ఏదో వెతుక్కున్నట్టుగా వుంటుంది. నేను వెళితే, అతను చావకండా ఆపివుండగలుగుదునేమో అనే సందేహం బాధిస్తుంది. ఇంక నేనేకదా మిగిలింది అని దిగులువేస్తుంది.

'మీ రా—చచ్చిపోతేనేం, నేనులేనా!' అని నువ్వువ్రాసిన ఉత్తరం ఎంత గర్వాన్నీ బలాన్నీ ఇచ్చింది నాకు!

నువ్వేలేకపోతే, నేను ఎన్నాళ్లకిందో చచ్చిపొయ్యేవాణ్ణి అనుకుంటాను. జీవించి ఏంలాభం అని ప్రశ్నించుకున్నప్పుడల్లా, 'నీ కోసం, నీప్రేమకోసం' అని సమాధానంవొస్తుంది. నువ్వులేకపోతే, ఏంచేసేవాణ్ణి అసలు! నాకథలకీ, నాప్రియత్నాలకీ, రహస్యప్రోత్సాహం నీనించి. నా ఉత్సాహానికీ, నాధైర్యానికీ నువ్వేకారణం దేశం ఎంత నిరాకరించినా, ఎంత ఘోరంగా నన్నుగురించి మాట్లాడినా, వ్రాసినా, నాకు సంబంధించనట్లు నాకు తోచడం, నేను వ్రాసేదీ చేసేదీ, సత్యమనే ఆత్మవిశ్వాసం, అన్నీ నీనేత్రదృష్టినించిపొందాను. నాజీవితం నీతో. ఈ పనులు—ఉద్యోగం, వ్రాతలు, స్నేహాలూ, అన్నీ కలలు. నాకు కలిగే ఆనందం ఎప్పుడూ నీనించి. తక్కిన ప్రపంచం నన్నుగురించి ఏమనుకుంటోవుంటే నాకేం?

జీవితంలో నా ముఖ్యోద్దేశ్యం, ఆశయం, అదృష్టం నువ్వు. తక్కినవి ఎట్లాపోతేనేం? తిట్లు నా చెవులకి వినపడవు. విమర్శలు నాకంటపడవు. నన్నేదో సాధించామని కులికే ప్రజల అవస్తచూస్తే

జాలి కలుగుతుంది. ఎప్పుడో ఎదో నాకంటబడి, చదవమని నన్ను బలవంతం చేస్తే, ఎందుకా ఇంత ద్వేషం! ప్రేమా, సౌందర్యం, ఆశిం చినవాళ్లకే నేను వ్రాస్తోంది. తక్కినవాళ్లని నేను చదవమనలేదే! తిరిగి తిరిగి నాపుస్తకాల్నే చదవడమెందుకు? ఉపయోగం కనపడే ఆవొక్కరూ చాలు, అపకారమనుకునే మీరందరూ చదవడమెందుకు? నిప్పులు తొక్కినట్టు ఆచిందులెందుకు? అని ఓ నిమిషం అనుకుని, నొచ్చుకున్నా. నువ్వు జ్ఞాపకంరాగానే వాటితో నాకేంపని, ఎందుకు ఓనిమిషం వృధాగా ఆ తుక్కు విమర్శలకీ, కుళ్ళు అపవాదులకీ, నిమిషం వృధాచేశానా, అనుకుంటాను. నువ్వుండగా, నీమీది ప్రేమ ఈ కళ్లలో వెలుగుతున్నంతసేపు, నేను కవచధారిని, అజేయుణ్ణి.

ఉజ్వలమైన నీ ప్రేమకి నేను అర్హుణ్ణేనా, నిజంగా నేను పొందినట్టు నువ్వు సంపూర్ణమైన సాఫల్యాన్ని, పొందావా అని యోచిస్తాను. నీ మాటలు తప్ప నాకేం తెలీదుకద! తెలిసేవిధంలేదు కద; నా ప్రాణానికి ప్రాణమనీ, నా హృదయంలో ఎప్పుడూ ప్రజ్వలిస్తో వుంటావని వ్రాస్తాను కాని, నీ ఆలోచనలు నాకు తెలీవు కదా! నిన్ను, అసలు నిన్ను నేనెరగనుకదా! ఎంత కావిలించుకున్నా ఎంత నీ కళ్లలోకిచూసినా, నిన్ను అందుకోలేనుకదా! ఇంక ప్రేమసాఫల్యం కలిగిందని ఎట్లా అనను?

ఇంతకన్న ఏంకావాలి అంటే నేనే చెప్పలేను. తెలీదు. కాని ఇంకా ఎదో సాధించగలిగిన సాన్నిధ్యం వుందని, ఇంతకన్న తేజోవంతం మధురవంతమైన సంయోగం వున్నదని విశ్వాసం, అది నా చాతకాలేదనే వ్యసనం నన్ను వొదలవు.

But I cannot reach you, for the sap of life
That would have sipped the ecstacy of the sun
Is trapped in the seed.

ఎందుకంటే ఆదర్శమైన ప్రేమలో వ్యక్తిత్వమే నశించాలి. 'నేను, నువ్వు' అనే భావమే అదృశ్యం కావాలి. కాని దానికి అర్థం ఏమిటంటే, ఏదో దూరంగా మనసుకి గోచరించడమేకాని మాటలతో నీతో చెప్పలేను.

అదే నిజమైతే, మళ్లీ ప్రయాణంకానా—యీ నూతన అన్వేషణంలో, అంతమెక్కడ! అసలు వుందా?



---

I would ask for still more, if I had the sky with all its stars, and the world with its endless riches; but I would be content with the smallest corner of this earth if only she were mine.

R. TAGORE.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B174 |
| పుస్తకం పేరు | ప్రేమలేఖలు 02 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 272 |
| లేని పేజీలు | 1to4,11 to 142 |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | |
| | thasin munisha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |